

ద్వితీయ ముద్రణ : : అక్టోబరు, 1964

వెల : : రు.4–00

ముద్రణ : : ఉజ్వల ప్రింటర్స్,
కర్నూలు.

---

ఈ పుస్తకం డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ లైబ్రరీస్, ఆంధ్రప్రదేశ్ వారి ప్రొసీడింగ్సు నెం. 227–A3/62, తేదీ 25–2–1963 లో అన్ని పబ్లిక్ లైబ్రరీలు తెప్పించుకొనుటకు అప్రూవ్ చేయబడినది.

# ప్రాణేశ్వరి

చంద్రోదయ మౌతుండగా రాధాదేవి స్నానాల గదినుండి బయట పడింది. గబగబా డ్రాయింగ్ రూమ్‌లో కెళ్ళి, క్రితం దినం పారిస్ కార్నర్‌లో కొనుక్కున్న సరిక్రొత్త ఫ్యాషన్ చీర తీసి- ఒంటికి కప్పుకుంది. ఆ చీరె తన సౌందర్యాన్ని యినుమడింప చేస్తుందో లేదోననే అనుమానం వచ్చి, నిలువెత్తు అద్దం ముందు కెళ్ళి నిల్చుంది. అందులో ప్రతిబింబించిన తన నగ్నసౌందర్యాన్ని చూసుకొని, సిగ్గుపడి చప్పున ప్రక్కకు తప్పుకుంది.

చీరె కట్టుకోవటం పూర్తి చేశాక, ఏవేవో కోర్కెలతో బరువెక్కిన వక్షోజాలకు జంపర్ వేసి- ఆ పైన జార్జెట్ సిల్కు రవికె తొడుక్కుంది. తనొక్కతే ఏకాంతంగా

వుండడంవల్ల - తన చర్యల నెవ్వరూ పసిగట్టటం లేదనుకొని- ఆ మధ్య తను చూసిన ఒక సినిమాలోని ప్రఖ్యాత హీరోయిన్ నడిచినట్లు వయ్యారం ఒలకబోస్తూ అద్దంముందుకెళ్లి కూర్చుంది. శుభ్రంగా యిస్త్రీ చెయ్యబడిన చేతిరుమాలుతో ముఖం తుడుచుకొని టాయిలెట్ అయింది. జడలో మల్లెలు తురుముకొని, ఒంటికి అక్కడక్కడ కాస్త అత్తరు పట్టించి, హంసగమనంతో నడుస్తూ బాల్కనీ సమీపించింది.

అప్పటికి పూర్తిగా చంద్రోదయ మైంది. సుధాకరుడు చిరునవ్వులు చిలికిస్తూ ఎక్కడికో పరుగులు తీస్తున్నాడు. ఆయన కరుణకిరణాల వెలుగు రాధపైపడి,తియ్యటి తలపులతో గిలిగింతలు పెట్టింది.

ఆమె నవ్వుకుంటూ ఎప్పటిమాదిరే- ఎదురింటి మేడలోని కిటికీవద్ద నిల్చొని తదేకంగా తనను చూస్తున్న ఆ అబ్బాయివైపుకి ముఖం త్రిప్పింది.

రాధా దేని ఆ అబ్బాయివైపుకి చూడగానే అతను చిరునగవు చిందించి-గభాలున సిగరెట్ వెలిగించుకున్నాడు. గుప్పు గుప్పున పొగ వదలుతూ కనురెప్పలు మూయకుండా ఆమె కనుల్లోకి దృష్టి నిల్పాడు.

రాధ సిగ్గుపడింది. తన కళ్లల్లోకి ఎందుకలా చూస్తాడతను? అతని చూపులు తన సర్వావయవాలను తాకుతున్నంత తీక్షణంగా వుంటాయి. తనలో ఏముందని అలా చూపులు పడేలా నిక్కి నిక్కి చూస్తుంటాడు?

ఆ అబ్బాయి మాసము రోజులనుండి ఆ మేడమీది గదిలో వుంటున్నాడు. ఈ నెలరోజులు అతను తనను చూడటం తప్ప వేరే ఏ పనీ చూసుకున్నట్లు లేదు. అతని కే పనీ లేదా? కనీసం భోజనం చెయ్యటం- గడ్డం గీక్కో వటంలాంటి పనులు కూడా చేసుకోడేమిటి? అనుక్షణమూ కిటికీవద్ద నిల్చొని తనెప్పుడు దర్శనమిస్తానా అని ఒళ్ళంతా వెయ్యికళ్ళు చేసుకొని కాచుకొని వుంటాడు. తను కన్పిస్తే నవ్వుతాడు. కన్పించకపోతే దిగులు ముఖంతో కృంగి వుంటాడు. చాటుగా నిల్చొని చాలామార్లు యీ సంగతి కనిపెట్టింది తను. బాల్కనీమీద తను లేని సమయంలో అతని వదన మండలం మీద విచార మేఘాలు అలుముకొని వుంటాయి- దేనికో? తనను గాఢంగా ప్రేమిస్తున్నాడేమో! తను కావాలని కోర్కెల చూపులు విసరుతుంటాడు. పిచ్చి వాడా! పెళ్ళయినపడుచును ఎలా పొందగల ననుకున్నాడో! నిన్నటి దినం ఎవ్వరూ చూడకుండా ఆ మేడలో నుండి బాల్కనీ మీదికి ఒకఉత్తరం ముక్క పడేశాడు. ఆ ఉత్త రంలోన వాలక్షఆశలు, కోర్కెలు వెలిబుచ్చు కున్నాడు. అతని ఆశల్ని, కోర్కెల్ని తీర్చేందుకు తనేమైనా కల్ప వృక్షమా? కామధేనువా?

అయినా, ఆ అబ్బాయికి తనపై ఎందు కంత మోహం ముంచుకొచ్చింది? కేవలం ముఖపరిచయమున్నంత మాత్రాన్నే ప్రేమలేఖ వ్రాసేందుకు అంతటి మొండిధైర్యం

ఎక్కడి నుండి వచ్చింది?

ఏది ఏమైనా ఆ ఉత్తరాన్ని చాలా చక్కగా వ్రాశాడు. స్త్రీ హృదయాన్ని ఆకట్టుకునే ఉత్తర మది. ఎన్నిమార్లు తా నా ఉత్తరాన్ని చదువుకున్నా తనివి తీరటం లేదు. ఇప్పటికి ఎన్నివందలమార్లు త నా ఉత్తరాన్ని చదువుకుందో లెక్క లేదు. ఒక్కొక్కమారు చదువుకూవుంటే ఒక్కొక్క తియ్యటి భావం ఆ ఉత్తరంలో తొంగి చూస్తుంటుంది. ఎంత బలీయమైన వాంఛో అతనిది! తన నవ్వు అతని గుండెల్లో అమృతవాహినియై ప్రవహిస్తోందని-తన చూపుల చల్లదనం అతని హృదయంలో వెన్నెలై వెల్లివిరుస్తోందని వ్రాశాడు. ఎంత గొప్ప భావుకత!

తన పేరు తెలియ దన్నాడు. 'పేరులేని సుందరివా నువ్వు?' అని ప్రశ్నించాడు. 'ఈ ప్రపంచంలో నా కెవ్వరూ అక్కర్లేదు-నువ్వుతప్ప!' అన్న అభిప్రాయం వెలిబుచ్చాడు.

త నంటే అంత అభిమానం అతని కెలా కల్గింది? ఒరులు చూస్తారేమోననే భయమైనా లేకుండా ఉత్తరం వ్రాయ గల్గినంత సాహసం అతని కెవరిచ్చారు?

మొత్తంమీద ఆ ఉత్తరం తన హృదయంలో కొత్త కోర్కెలను కురిపించింది. ఆశా కుసుమాలను వికసింప చేసింది. తనలో అణగిమణగివున్న కామవాంఛలను తిరిగి రేకెత్తింప చేసింది. చిన్నతనంలో తను కాలేజీలో చదువు కుంటున్న రోజుల్ని- ఆ నాటి వింతవింత ఆశల్ని, కోర్కెల్ని మళ్ళీ

యీనాడు పునరావృత్తికి వచ్చేట్లు చేసింది. ఎంత మధుర మైన దా ఉత్తరం.

రాధాదేవి ఆ విధంగా తియ్యటి ఆలోచనలతో సత మతమౌతూ అక్కడి నుండి తన డ్రాయింగ్ రూమ్‌కు తిరిగి వచ్చి, ఆ అబ్బాయి క్రితందినం వ్రాసిన ఉత్తరాన్ని, భద్రంగా తాళం వెయ్యబడివున్న సూట్ కేసులో నుండితీసి, తృప్తిగా మరోమారు చదువుకో సాగింది.

"సుందరీ!"

మళ్ళీ వచ్చావా? మేడమీద నువ్వలాగే సౌందర్య ప్రతిమ వైపోతే, నే నిక్కడ కోటి సంవత్సరాలు యిలాగే నిల్చుండి పోతాను.

నీ కనుల్లోకి- పరిపూర్ణమైన నీ యవ్వనంలోకి- వింత కాంతులతో వెలిగిపోయే నీ ముఖవర్చస్సులోకి చూస్తూ ఈ ఐహికాలను విస్మరిస్తాను. ఆకలి దప్పికల్ని మరుస్తాను.

నువ్వే నా దైవం! నువ్వే నా సమస్తం!! నువ్వే నా ఆరాధ్య దేవతవి!!!

ఓ సుందరి! వాగీశ్వరి! అపర రతీదేవీ!

నా ఒళ్లో- కంట్లో- మస్తిష్కంలో నువ్వు సెల యేరువు- పాపవు- వెన్నవు అయ్యావు.

నీ సుందర దరహాస విగ్రహం నా ఎదలో సుధా నదుల్ని ప్రవహింప చేస్తోంది! నీ చూపుల చల్లదనం నా గుండెల్లో వెన్నెలై కురుస్తోంది! నీ చిరునగవు నాలో కోటి

కోట్ల ప్రణయ దీపాల కాంతికిరణాలను వెదజల్లుతోంది!

ఓ మేడమీది బంగారు పిల్లా!

నీ పేరేమి? ఎక్కడి దానవు? ఎటునుండి వచ్చావ్? నిన్ను స్వంతం చేసుకొని-రాత్రిళ్ళు నీ కండగాల్ని, పెదవుల్ని కళ్ళను ముద్దుబెట్టుకుంటున్న ఆ భాగ్యశాలి ఎవరు? లేక-నీకెవ్వరూ లేరా? ఒంటరి దానవా నువ్వు?

నువ్వు ఎందుకలా నా వైపు చూస్తూంటావ్! ఒళ్ళు జలదరించేలా- గుండెలు పగిలేలా- ఎదలో ఆశాహర్మ్యాలు పెరిగేలా ఎందుకు చూస్తావ్?

నీ చూపులు నాలోకి మన్మథ బాణాలు వదులుతున్నాయి. తూట్లు పడజేస్తున్నాయి. మనస్సును పిండి చేస్తున్నాయి.

అమ్మో! నేను భరించలేను. నువ్వలా చూడకు. నాలో కలత లేపకు. నన్ను పిచ్చివాణ్ణి చెయ్యకు.

నువ్వలా చూస్తే నేను చచ్చిపోతాను. అయినా నీ వెంటే వుంటాను. నిన్నొదిచి ఎక్కడికీ వెళ్ళను. నిన్నొడిచి నేను బ్రతుకలేను!

దేవీ! నీ కోసం మధురకు రానా? నీ కోసం మెరీనా బీచిలో సత్యాగ్రహం చెయ్యనా? చెప్పు; నీ కోసం ఏం చెయ్యమంటావో? నీ నామస్మరణ చేస్తూ కూర్చుంటాను.

కాని... నీ పేరేమో నాకు తెలియదు. నిన్నెట్లా సంబోధించాలో బోధపడదు. పేరులేని సుందరివా నువ్వు?

ఎందుకట్లా నాలోకి చూస్తుంటావ్? దేనికలా నాలో కోర్కెల్ని కురుపిస్తుంటావ్?

మొన్న నువ్వు బాల్కనీమీదికి రాలేదు, ఎందుకో? నువ్వు రాకపోతే నేను చచ్చిపోయా ననుకున్నాను. బ్రతుకు అమవస అయ్యిందనుకున్నాను. ఇహ తిరిగి నువ్వు బాల్కనీ మీదికే రావేమోనని భయపడ్డాను.

నీ కోసం- నీ చూపుకోసం- నీ ఒక్క చిరునగవుకోసం యిక్కడ ఒక ప్రాణి నిల్చుని అనుక్షణమూ తల్లడిల్లి పోతుంటుందనే నగ్నసత్యాన్ని నువ్వు మరచిపోయావేమో!

నువ్వు వంట గదిలో వుంటే- స్నానాల గదిలో వుంటే- నీ భర్త సాన్నిథ్యంలోవుంటే నేను జ్ఞాపకం రావటం లేదా? నా చూపులు- నేను నిల్చునే తీరూ- నా బర్కిలీ సిగరెట్ తెల్లటిపొగ నిన్ను వెంటాడటంలేదా?

ప్రొద్దుపోయాక నీ భర్తతోపాటు నువ్వా గదిలోకి వెళ్ళి-చీకట్లో రాత్రంతా గడుపుతూవుంటే- ఎందుకో నాకు అసూయ కల్గుతోంది. ఇంత గొప్ప సౌందర్యవతిని నీ భర్త ఒక్కడే అనుభవిస్తున్నాడేనని ఈర్ష్య జనిస్తోంది.

సాయంకాలం అయ్యేసరికి నువ్వొక్కతవే బాల్కనీ మీదికి వస్తే, వెంట అతను కూడా వస్తాడెందుకు? నీ శరీరాన్ని తాకుతూ- నీ భుజాలను సుకుమారంగా పట్టుకొని, జడలోని మల్లెల్ని సవరిస్తా డెందుకు? దూరంగా నీలాకాశంలో కన్పించే మనోజ్ఞమైన దృశ్యాల్ని చూపిస్తూ నిన్నెందు

కలా పరవశురాల్ని చేస్తాడు.

అతను నిన్ను ముట్టుకుంటూ వుంటే- నా ఒంటిపైన అసూయ ప్రాకుతుంటుంది. నీ కురులను సవరిస్తూంటే నా గుండెలు మంచులా కరిగి పోతుంటాయి. నిన్ను అతను తన హృదయానికి హత్తుకుంటూంటే, నేను చలనం లేని ప్రతిమ నయిపోతుంటాను.

నేనిట్లా చావ లేక బ్రతకటం నీకిష్టమేనా? ఈకోర్కెల్ని అణచుకోలేక ఆరాటపడటం నీకు సమ్మతమేనా?

ఇక్కడే, యీ మేడమీది కిటికీ వద్దనే యిలా నిన్ను చూస్తూ, సిగరెట్ పొగ వదుల్తూ, ప్రాణంలేని నిర్జీవ ప్రతిమనై పొమ్మన్నావా నన్ను?

నీ కేది సమ్మతమో చెప్పు, అదే అవలంభిస్తాను. మనస్సును చిక్కబట్టుకొని- నువ్వు 'ఊఁ' అంటే యీ మేడ దుమికి-గాలిలో నిన్ను చేరుకుంటాను. లేదంటే యిక్కడే యిలాగే శిలనై పోతాను.

చెప్పు నా ప్రాణేశ్వరీ, నీ కేద సమ్మతమో చెప్పు.

"......"

రాధ ఉత్తరం చదవటం ముగించి తనలో తాను తియ్యగా నవ్వుకుంది. తను అతనికి ప్రాణేశ్వరిట! తన కేది సమ్మతమో తెల్పాలట. ఏమని తెల్పాలి తను?

తనకు ఆ అబ్బాయి అంటే యిష్టమేనా? ఏమో! ఎప్పుడూ త నా విషయాన్ని గురించి ఆలోచించివుండ లేదు.

మాసంరోజుల నుండి తను అతన్ని చూస్తూనే వుంది. అతని చర్యల్ని, చూపుల్ని పసిగడుతూనే వుంది. కాని, ఏ నాడూ యీ విషయమై తను ఆలోచించి ఎరుగదు.

ఒక దినం బాత్‌రూమ్‌లో స్నానం చేస్తుండగా తలుపు తట్టిన చప్పుడైంది. ఆయన వచ్చాడేమో ననుకొని స్నానం పూర్తి చెయ్యకుండానే గబగబా చీరెచెరగు ఒంటికి కప్పుకొని వెళ్ళి తలుపు తీసింది.

ఎదురుగా తన భర్తకు బదులు ఆ మేడమీది అబ్బాయి చిరునవ్వులు వొలికిస్తూ నిల్చొని వున్నాడు. అర్థనగ్నంగా వున్న తన అవయవాల కేసి- కళ్ళల్లోకిచురుగ్గా చూశాడు. ఆ చూపులన్నీ తను ఏ నాటికీ మరువలేదు.

చప్పున తను సిగ్గుపడి తలుపుచాటుకు చేరుకుంది. తన దొంగచూపులు చూసి కాబోలు ఆ అబ్బాయి ముసి ముసినవ్వు ప్రదర్శించాడు.

"ఇంట్లో ఎవ్వరూ లేరాండి?" అని నవ్వుతూనే అడిగాడు.

తన గుండెలు గుభేల్‌మన్నాయి. ఒళ్లు జలదరించింది.

"దేనికి?" అనడిగింది, లేని ధైర్యాన్ని పుంజుకుంటూ.

"ఈ మేడలో ఒక పోర్షన్ ఖాళీగా వుందని విని వచ్చాను. ఇక్కడ గదు లేవీ ఖాళీ లేవా ఏమిటి?" అన్నాడు.

తను అమ్మయ్య అనుకొని శాంతిశ్వాస పీల్చుకుంది.

"ఈ మేడలో ఏవీ ఖాళీల్లేవండి. ఆ ఎదురింటి మేడ

నెలరోజుల నుండి ఖాళీగావుంది. అక్కడికెళ్లి విచారించండి.''

అని తను గభాలున తలుపులు వెయ్యబోయింది. ఆ అబ్బాయి తిరిగి తన అర్ధనగ్న శరీరంవైపుకి తృప్తిగా చూచి- అక్కడ్నుంచి వెళ్లలేక వెళ్లిపోయాడు.

ఆ దినం సాయంకాలమే ఎదురింటి మేడలో చేరిన ట్లున్నాడు; ఒక్కక్షణమైనా వృధాగాకుండా తన దర్శనం కోసం ఆ కిటికీవద్దకు వచ్చి కాచుకొని వుంటున్నాడు మొదటి చూపులోనే తనపై మోహం కల్గింది కాబోలు! అందుకనే హృదయారాటాన్ని భరించలేక, సాహసం చేసి ఉత్తరం వ్రాశాడు. అయినా, తనేవిధంగా ఆ అబ్బాయి కౌగిలిలో కరగిపోతుందనో ఆ ఆరాటం! పిచ్చివాడు! పిచ్చి పిచ్చి ఊహలతో సతమత మయ్యేటట్లున్నాడు.

ఆ విధంగా రాధతలపోస్తూ, ఎవరో వస్తున్న చప్పుడు కాగా వెనుదిరిగి చూసింది. భర్త చిరునగవు మొహంతో- చేతిలో గులాబిదండ పట్టుకొని వస్తున్న దృశ్యం కన్పించాక ఆమె ఆలోచనలన్నీ పటాపంచ లయ్యాయి. ఆయన వచ్చీ రాగానే ఆమెను సమీపించ బోయాడు.

రాధ అంతదాక తను చదువుతూ కూర్చున్న ఆ అబ్బాయి ఉత్తరాన్ని అతి మెలకువగా బల్ల సొరగులో దాచి, లేచి నిల్చుంది. ఎప్పటి మాదిరే నవ్వుతూ ఆయనకు స్వాగతం పలికింది.

ఆయన మరింత దగ్గరగా వచ్చి, ''రాధా!'' అని

పిలిచాడామెను.

కళ్లతో నవ్వి ఆమె ఊరుకుంది.

"నీ జడలో యీ గులాబీలను అలంకరించనా!" అనడిగాడాయన.

"ఊఁ!" అని కోయిలవలె పలికి, ముసిముసి నవ్వు ప్రదర్శించిదామె.

ఆయన గులాబీల గుత్తిని ఆమె జడలో సవరించి, తన వైపుకు తిప్పుకున్నాడు. కామపూరితమైన ఆయన, ఆమె మోమెత్తి తనవైపుకు త్రిప్పుకుంటూ గాఢంగా కౌగలించుకున్నాడు. ఆయన కౌగిలిలో ఆమె పరవశురాలైపోయింది.

"వెళదామా, రాధా!" అన్నాడాయన తిరిగి.

"ఎక్కడికి?"

"అప్పుడే మరచావా? ఓడియన్‌కు"

"టికెట్లు తెచ్చారా?"

"ఆహాఁ!"

రాధయింకేమీ మాట్లాడకుండా ఆయన కౌగిలినుండి బయటపడింది. కాస్సేపటికి యిద్దరూ తలుపులకు తాళాలు వేసి క్రిందికి దిగివచ్చి బస్‌స్టాప్‌వైపు నడవసాగారు.

అప్రయత్నంగా రాధ ఎందుకోగాని వెనక్కి తిరిగి చూసింది. ఆ మేడమీది అబ్బాయి ఎప్పుడు వెంటబడ్డాడో-సిగరెట్ పొగ వదల్తూ, దగ్గరగా నడుస్తూ వస్తున్నాడు.

రాధ హృదయంలో ఒకవైపునుండి భయం- మరో వైపునుండి ఏదో తెలియని అనిర్వచనీయానందం ఒకదాని వెంట మరొకటి వచ్చి పెనవేసుకున్నాయి. ఆ అబ్బాయి వెంటబడటం చూసి భర్త తనపై అనుమానపడతాడేమో నని భయం! తనపై ఎంత మోజు లేకపోతే ఆ అబ్బాయి వెంటబడతాడనే ఆనందం!!

ఆమె వెనక్కి తిరిగి ఆ అబ్బాయికేసి వాలుచూపులు వదలుతూనే నెమ్మదిగా భర్తను అనుసరించసాగింది. ఇద్దరూ బస్‌స్టాప్ చేరుకునేసరికి- ఆ అబ్బాయి కూడా వెనువెంటనే వచ్చి బస్‌స్టాపింగ్ వద్ద నిల్చుండి పోయాడు.

సాయంకాల మవటంవల్ల బస్‌స్టాపింగ్ జన సందోహంతో చాలా క్రిక్కిరిసివుంది. 21 వ నెంబర్ బస్సులు రెండు మూడు వచ్చి వెళ్ళి పోయాయి. ఆ విధంగా మరో అరగంటపాటు అక్కడే నిల్చున్నా బస్సు దొరికే భాగ్యం లభించేట్లు లేదు. అందుకనే రాధ భర్త ఆమెవైపు తిరిగి--

"టాక్సీలో వెళదామా రాధా! బస్సు దొరికేట్లు లేదు" అన్నాడు.

రాధ చుట్టుప్రక్కల చూసింది. ఎక్కడా టాక్సీలు గాని, ఆటోలుగాని లేవు. తాము టాక్సీలో వెళ్ళిపోతే- ఎంతో ఉత్సాహంతో వెంటబడ్డ ఆ అబ్బాయి నిరుత్సాహ పడతాడేమోనని అనుకుందామె.

"అబ్బే! టాక్సీ దేనికండి? మరో పది నిముషాల్లో

బస్ రానే వస్తుందిగా! ఈ చుట్టుపట్ల టాక్సీలుకూడా లేవు''
అని సమాధాన మిచ్చింది.

ఆయన యింకేం మాట్లాడకుండా దూరంగా దృష్టి నిల్పి బస్‌కోసం ఎదురు చూడసాగాడు.

ఆ అబ్బాయి యథాప్రకారంగా సిగరెట్ దమ్ము లాగుతూ, చుట్టూ జనం వున్నారన్న ధ్యాసైనా లేకుండా, ఆమె కళ్ళల్లోకి-పరిపూర్ణమైన అంగసౌష్టవంలోకి తదేకంగా చూడ సాగాడు.

రాధ సిగ్గుపడి పయిట సవరించుకుంది. మనస్సులో తియ్యగా నవ్వుకొని- 'ఆ అబ్బాయి కళ్ళల్లో ఎన్ని కోర్కె-లున్నాయో! తన వక్షస్థలంకేసి- అవయవాలకేసి ఎంత సూటిగా చూస్తాడు! తనవన్నీ అతని స్వంత మవుతే ఏం చేసుకుంటాడో' అని తలపోసింది.

అంతలో బస్ రానేవచ్చింది. ఇంకో అరగంటైనా ఆలశ్యం చెయ్యకుండా బస్ వచ్చినందుకు ఆ అబ్బాయి లోలోన ట్రాన్స్‌పోర్ట్ డిపార్ట్‌మెంట్ వాళ్ళను తిట్టుకొని, ఆ జనసందోహంలో తనూ ఒకడయ్యాడు.

ఏ విధంగా నైతేనేం అందరూ బస్ ఎక్కాక కండక్టర్ విజిల్ వూదాడు. బస్సు కదిలింది. కూర్చునేందుకు స్థలం లేకపోవటంతో రాధ తన భర్త ప్రక్క నిలబడింది. ఆ అబ్బాయికూడా ఆమెకు దగ్గరలోనే నిల్చుని దొంగ చూపులు చూడసాగాడు.

ఆ అబ్బాయికి రాధ, ఆమె భర్త ఎంతదాక వెళు తున్నారో తెలియదు. వాళ్ళను అనుసరించాలని బయలు దేరిన అతను కండక్టర్ వచ్చేసరికి జేబులోనుండి చిల్లర డబ్బులు తీసే ప్రయత్నంలో మునిగివున్నట్లు నటించాడు.

కండక్టర్ ఆ అబ్బాయి ఆలస్యాన్ని భరించలేక ముందున్న వాళ్ళవైపు చూసి- 'టికెట్! టికెట్!' అన్నాడు తన మామూలు ధోరణిలో.

"రెండు ఓడియన్" అని రాధ భర్త చిల్లర డబ్బులు కండక్టర్ చేతిలో పెట్టాడు.

కండక్టర్ అక్కడ టికెట్లు యిచ్చి వెనుదిరిగేసరికి ఆ అబ్బాయికూడ చిల్లరడబ్బులు సర్దుకొని ఏడు నయా పైసలు అతని చేతిలోపెట్టి టికెట్ పుచ్చుకున్నాడు.

రాధ, ఆ అబ్బాయి ఎంతదాక టికెట్ తీసుకుంటాడో గమనించాలని వెనుదిరిగి చూసేసరికి, అతను చిరునవ్వు చిలకరించాడు. అంత మందిలోనూ తనను చూసి అతను నవ్వినందుకు ఆమె చిరుకోపం ప్రకటించింది.

అంతలో బస్ వుడ్‌ల్యాండ్స్ బస్‌స్టాపింగ్ వద్ద అకస్మాత్తుగా ఆగింది. ఆ ఆగే వూపులో ఆ అబ్బాయి రాధపై పడి భుజాన్ని ముద్దెట్టుకున్నాడు.

రాధ కలవరపడి చుట్టూ చూసింది. వెళ్ళేవాళ్లు వెళుతూ- ఎక్కేవాళ్లు ఎక్కే కోలహాలంలో ఆ దృశ్యాన్ని ఎవ్వరూ చూడలేదని తెలుసుకొని గాఢంగా నిట్టూర్పు

విడిచింది. ఆ అబ్బాయి ఏమీ తెలియని వాడిలా ఆమె కురుల నలంకరించిన మల్లెల, గులాబీల వాసన చూస్తూ తన్మయత నటించసాగాడు.

కొంతసేపటికి బస్ ఓడియన్ స్టాపింగ్ చేరుకుంది. రాధతోపాటు ఆమె భర్తకూడా క్రిందికి దిగాక, ఆ అబ్బాయి సైతం అక్కడే దిగాడు.

అందరూ ఓడియన్ చేరుకున్నాక రాధ భర్త రెండు ఫస్ట్‌క్లాస్ టికెట్లు తెచ్చేసరికి ఆ అబ్బాయి ఒక్క అంగలో బుకింగ్ ఆఫీసు చేరుకొని తనూ ఒకటో క్లాస్ టికెట్ తెచ్చుకున్నాడు. అదంతా గమనిస్తున్న రాధ ముసి ముసి నవ్వు నవ్వుకుంటూ భర్తతోపాటు థియేటర్‌లోకి నడిచింది.

ఆ అబ్బాయి సైతం వాళ్ల వెనకాలే వచ్చి తన టికెట్ మీది నెంబర్ ప్రకారం రాధ కూర్చున్న ప్రక్క సీట్‌లో చతికిల బడ్డాడు.

సినిమా ప్రారంభమైంది. ఇంగ్లీషు పిక్చర్ చూసేందుకు యిష్టంలేని రాధ, తన ప్రక్కనకూర్చున్న అబ్బాయి కేసి క్రీగంట చూస్తూ- అతను తనవైపుకు చూసినపుడల్లా పయిట సవరించుకో సాగింది. ఆమె పయిట సవరించుకోవటం-క్రీగంట చూడటం గమనించిన ఆ అబ్బాయి కొత్త ఉత్సాహాన్ని పుంజుకొని నెమ్మదిగా కుర్చీమీద వున్న ఆమె మృదుహస్తాన్ని స్పృశించాడు.

ఆమె చూసీ చూడనట్లు వూరకుండి పోయింది.

ఆ అబ్బాయి గుండెల్ని చిక్కబట్టుకొని తిరిగి ఆమె చెయ్యిపై తన చెయ్యివేసి-ఎవ్వరూ చూడకుండా ఆ రెండు చేతులపై చేతిగుడ్డ పరిచాడు.

రాధ అతని అవస్థ చూసి నవ్వుకొని, చటుక్కున చెయ్యి ప్రక్కకు లాక్కుంది. ఆ అబ్బాయి ముఖాం వెను వెంటనే వెలవెలబోయింది.

ఆ విధంగా కథ క్లయిమాక్స్ అందుకొన్న కొంతసేపటికి ఇంటర్వెల్ అయింది. ఆ దీపాల వెలుగులో ఆమె సౌందర్యాన్ని అతను మరోమారు నఖశిఖ పర్యంతం తృప్తిగా చూచి, ఏమీ తెలియని అమాయకు డిలా, మౌనంగా కూర్చుండి పోయాడు.

తిరిగి లైట్లు ఆరిపోయాయి. సినిమా ఆరంభమైంది. అప్పటికే బయట జినజినమని వర్షం కురియ సాగింది.

ఈ మారు రాధ పిక్చర్ చూడటంలోనే లీనమై పోయింది. అతనిక చేసేదేమీ లేక మేష్టారుగారి ముందు బడికుర్రాడిలా నిశ్శబ్దంగా కూర్చుండి పోయాడు.

సినిమా అయిపోయింది. హాల్లోని జన మంతా బిలబిలమంటూ బయటికి నడవసాగారు. ఆ వెళ్ళటంలో రాధ భుజానికి భుజం తగిలిస్తూ- ఆ స్పర్శకే ఆ అబ్బాయి స్వర్గధామం చేరుకున్నంత గొప్పగా మురిసిపోతూ- హాలు బయటికి వచ్చాడు. ఎప్పటికప్పుడు అతని చర్యల్ని పసి గడుతూనే రాధ ముందు కెళ్ళసాగింది.

అంతదాక జినజినమని కురుస్తున్న వర్షం ఆగి పోయింది. రాధా, ఆ మెథర్తా యిద్దరూ వెళ్ళి ఒక టాక్సీలో కూర్చున్నారు. వాళ్ళిద్దరూ టాక్సీవైపు వెళ్ళటం, అందులో కూర్చోవటం, క్షణంలో టాక్సీ బుర్రు మనటం చూస్తూ ఆ అబ్బాయి నిశ్చేష్టుడై, క్షణకాలం ఎక్కడివాడక్కడే నిల్చుండి పోయాడు. చేసేదేమీలేక తన దురదృష్టాన్ని తిట్టుకుంటూ అప్పుడే వచ్చిన 3 వ నెంబర్ బస్ ఎక్కి ఉస్సురుమని నిట్టూరుస్తూ ఖాళీ వున్న ఒక సీటులో కూలపడ్డాడు.

# 2

సాయంకాలమైంది.

సంజ వెలుగులు బాల్కనీమీద పడుతుండగా రాధ యథాప్రకారం లోనుండి బయటికి వచ్చింది. అప్పటికి కూడ ఎదురింటి అబ్బాయి కిటికీవద్దే నిల్చొని వున్నాడు. పాపం! అలా గంటలతరబడి తన దర్శనంకోసం ఎందుకలా ఒంటికాలి తపస్సు చేస్తుంటాడో! తనలోని ఏ శక్తులు అతన్నంత గాఢంగా ఆకర్షించుకున్నవో? ఏది ఏమైనా ఆ అబ్బాయి కేమీ తెలిసినట్లు లేదు. లేకపోతే ఎందుకా నిరీక్షణ? తన ఒక్క చూపు కోసం ఏమిటా వేగిరపాటు? తను కన్పిస్తే నవ్వుతాడు. హిమాలయాలను అధిరోహించి విజయపతాకం నాటినంత గొప్ప అదృష్టశాలిగా మురిసిపోతాడు! పిచ్చిగాక పోతేనూ తన కోసం ఎందుకంత ఆరాటపడటం? తనెలా లభ్యమవుతుందనుకున్నాడు? పెళ్లయిన పడుచు, సంసార స్త్రీని వాంఛించటంలో అతని ఉద్దేశ్య మేమిటో? పెళ్ళి కాని పిల్లను కోరినా అర్థముంది కాని, తనెక్కడ, అతనెక్కడ?

గతరాత్రి సినిమాలోకూడ అదోరకమైన వెకిలిచేష్టలు ప్రదర్శించాడు. తను సూటిగా అతని కళ్ళల్లోకి చూడగానే, ఎంతగానో బెదరిపోయాడు. అప్పుడు తనకు నవ్వు వచ్చింది.

జాలి కల్గింది. ఆ అమాయకుడికి తనపై ఎంత భక్తి అని మురిసి పోయింది.

సినిమా వదిలాక ఆ జనసందోహంలో తన ప్రక్క భర్తవున్నా వెంటబడ్డాడు. భుజానికి భుజం తగిలించి, కేవలం స్పర్శజ్ఞానంవల్ల నే స్వర్గధామం చేరుకున్నంత గొప్పగా పొంగి పోయాడు. అల్ప సంతోషి కాబోలు.

ఆ విధమైన ఆలోచనలతో రాధ తనలో తాను నవ్వుకుంటూ వుండగా, ఆమె భర్త సైతం బాల్కనీమీది కొచ్చాడు. అడుగుల చప్పుడు విని రాధ వెనుదిరిగి చూసింది. భర్త నవ్వుతూ దగ్గరగా వచ్చాడు. ప్రశాంతమైన ఆయన నిర్మల వదనం ఎప్పటిమాదిరే చిరునవ్వులు చిందుతోంది.

అత నామె రెండు భుజాలూ పట్టుకొని కళ్ళల్లోకి చూడసాగాడు. ఆ సంఘటనను ఎదురింటి అబ్బాయి గమ నిస్తున్నాడేమోనని రాధ లోలోన బాధపడింది. కాని తప్పనిసరి అనటంవల్ల మరింత ముందుకు జరిగి ఆయన మెడ మీది కాలర్ సవరించింది.

"రాధా!" అని పిలిచా డతను.

"ఊఁ!" అందామె.

"నే నొకటి అడగనా రాధా?"

"ఏమిటది?"

"ఎన్నడూ కన్పించని క్రొత్తదన మేదో నీలో నేడు కన్పిస్తోంది. నీ మనోహరత్వానికి కారణ మేమిటో నేను

తెలుసుకో కూడదా ?''

రాధ, ఆయన కవితాధోరణి విని ఏం మాట్లాడ లేదు. వంచిన తల ఎత్తకుండా నిల్చుంది.

''నీ కళ్లల్లోని ఆ వింత కాంతి, బుగ్గలమీది అరు ణారుణచ్ఛాయ నన్ను దివ్యలోకాలలోకి పరుగెత్తింప చేస్తు న్నాయ్! నీలో యింత సౌందర్యం వుందని ఎన్నడూ అనుకో లేదు రాధా!''

ఈ మారు కూడా రాధ పలక లేదు. నెమ్మదిగా తల ఎత్తి దూరంగా దృష్టి నిల్పింది.

''ఎప్పుడూ గలగలా మాట్లాడి నన్ను పరవశుణ్ణి చేసే నువ్వు- యీ రోజు మూగదానివై మరింత దగ్గరగా ఆకర్షించుకుంటున్నావ్? దూరంగా కన్పించే ఆ లైట్ హౌస్‌లోంచివచ్చే కాంతి- అస్తమిస్తున్న అరుణార్కుని కాంతికిరణాలు- మనోజ్ఞమైన నీలాకాశం- ఈ పువ్వుల గుబాళింపు- నీలో యింతటి క్రొత్తదనాన్ని ఆపాదిం చేందుకు కారణభూతమైనవా రాధా! పలకవేం!''

రాధ ఇహ భరించలేక పోయింది. మాట్లాడటం తప్పని సరైంది. కళ్లల్లోకి చూస్తూ అంది:

''అందం ఎప్పుడూ ఒకేలా వుంటుంది. దాన్ని చూడటంలోనే క్రొత్తదనం పుట్టుకొస్తుంటుంది. ఒకోమారు ఒకోదృష్టి ఆ అందంపై ప్రసరించటంవల్లనే అనుభూతులు మారుతుంటాయి' అని మీరేగా ఒక వెన్నెల రాత్రిలో

నాతో అన్నారు... ఈ సౌందర్యం మీ స్వంతం. దీన్ని గురించి మీ రెలా తలపోసినా, ఏ దృష్టితో పరికించినా, హృదయంలోని భావాలకు అనుగుణ్యంగానే కన్పిస్తుంది. ఎన్నడూ లేని క్రొత్త అందం నాలో యీ దినం వుందని మీరు మనస్సులో తలపోశారు. ఆ దృష్టితోనే నన్ను చూశారు. కనుకనే నాలో యీ రోజు మీకు ఎనలేని సౌందర్యం కన్పించి వుంటుంది. అంతే నంటారా?''

''నిజాన్ని నిజంగా విపులీకరించి చెప్పావ్ రాధా! నువ్వు కేవలం సౌందర్యరాశివే కాదు. హృదయం విప్పి మాట్లాడుకోగల సహృదయురాలివి. అందుకే నువ్వంటే నాకు ఎనలేని ప్రేమ...''

అని అత నామెను గాఢంగా కౌగలించుకున్నాడు. ఆమె అడ్డు చెప్పలేదు. అతని కౌగలిలో తన్మయురాలై కళ్ళు మూసుకుంది.

ఆ దృశ్యం చూస్తున్న ఎదురింటి అబ్బాయి మనస్సులో అగ్నివర్షం కురిసింది. తన సర్వస్వమని భావిస్తున్న సౌందర్య దేవత-తన కళ్లముందే ఒక మానవుడి కౌగిలిలో పరవశు రాలైపోయింది. ఎంత ఘోరం! ఎంత అపచారం!! తన మనస్సు పడిన ఈ బాధకు ఉపశమన మేమిటి? ఎదలోని యీ గాయం మానే దెలా?

ఆ విధంగా ఆ అబ్బాయి అవస్థపడుతూ — హృదయంలోని ఈర్ష్యను భరించలేక కిటికీ రెక్కల నన్నింటినీ

బాహాటంగా తెరిచి-ఎదురింటి తన ప్రణయరాశి చేష్టలను వెయ్యి కళ్ళతో పరికించసాగాడు.

అప్రయత్నంగా ఆ దృశ్యం రాధ కంటబడింది. ఎందుకోగాని ఆమె కాసమయంలో ఆ అబ్బాయి మీాద కోపం కల్గింది. తను, తన భర్త కౌగిలిలో వుంటే, అతడు తన్నలా నిక్కి-నిక్కి చూడటం మొందుకని ఆమె బాధపడింది. వెంటనే భర్త కౌగిలిని విదిలించుకుంది. క్షణంలో ఆమె ముఖకవళికలు మారిపోయాయి కళ్లల్లో నీళ్లు తిరిగాయి. అందమైన ముఖం నల్లబడింది.

ఆమె స్థితిని గమనించిన భర్త ఆశ్చర్యపో లేదు. ఒక్క సారిగా ఆమెలో విజృంభించిన ఈ మార్పుకు అతనే విధంగానూ బాధపడలేదు. నెమ్మదిగా ఆమె భుజంపై చెయ్యి వేసి తనవైపుకు త్రిప్పుకున్నాడు.

''రాధా!'' అని సౌమ్యంగా పిలిచాడు.

రాధ పలకలేదు. భుజంమీాది భర్త చెయ్యిని విదిలించుకుంది.

''నీ కళ్లల్లో నీళ్ళు ఏమిటి రాధా! క్షణంక్రితం ఎంతో ఉత్సాహంగా కన్పించిన నీలో యింత మార్పా? అందమైన నీ ముఖం యిలా నల్లబడిందేం? నీ కోపకారణ మేమిటో నాకు చెప్పు రాధా!''

''నా బాధ మీా కెలా అర్థమవుతుందో చెప్పండి? నేను లోలోపల ఎంతగా క్రుంగిపోతున్నానో మీా కెలా

చెప్పను? మీ ధోరణ మీదే! మీ మాటలు మీవే! ఎదుటివాళ్ళని, ఎదురింటివాళ్ళ చేష్టల్ని గమనించలేని స్థితిలో వున్నారు మీరు..." అందామె గాద్గదికంతో.

"నీ మాటలు నాకర్థమవటం లేదు రాధా! నాకు అర్థమవ నంతటి నిగూఢత్వంలో మాట్లాడి— నన్ను మరింత కించపరచాలనా నీ వుద్దేశ్యం?..."

"అదేమీ కాదు. ఆ ఎదురింటి మేడను, ఆ కిటికీ తలుపులవద్ద నిల్చున్న అబ్బాయిని చూడండి. అతగాడు ఎప్పుడూ ఆ తలుపులు తెరచుకొని యిటే చూస్తుంటాడు. ఇందాక మీరూ నేనూ...కలిసి వున్నప్పుడు అతగాడు చూశాడు. నే నెంతగా కృంగిపోయానో మీ కేం తెలుసు? అతడికి యింతకన్నా మరో పనిలేదా? ఆ సంగతి మీ రెందుకు కనుక్కో కూడదు. అతగాడిని ఎందుకు మందలించ కూడదు?" అని కళ్ళనీళ్ళు వత్తుకుందామె.

'ఓస్! ఈ మాత్రానికేనా యింత ఆవేదన? ఊరుకో! నువ్వు కంట నీరు బెడితే చూసి నేను భరించలేను. ఆ అబ్బాయి విషయంలో నువ్వు పొరబడ్డావ్. అతగాడు యిటే, మనల్నే చూస్తూన్నాడని నువ్వెందుకు భ్రమించావ్? ఆ అబ్బాయికి మరోపని వున్నట్లు లేదని నీ కెందుకీ పిచ్చి తలంపు?"

"అవును! అన్నీ నావి పిచ్చితలంపులే!! మీరు కవులు. మీ ఊహలు, ఆలోచనలు అన్నీ యదార్థాలే! నా తలం

పులు ఏవి పిచ్చివో-ఏవి కావో నాకు బాగా తెలుసు. మీ రేం చెప్పక్కర్లే-'' అని మళ్ళీ ఏడ్చిందామె.

''అమాయకురాలా! ఎందుకే నీకీ లేనిపోని బెంగ? ఒకవేళ అతగాడు మన కౌగిలింతను చూస్తే మాత్రం పోయిందేమిటి?''

''ఆహాఁ! మీ కేం మగమహారాజులు. ఆడదాన్ని, నాకే లేనిపోని బెడదలన్నీ!... రేప్రొద్దున నే నా అబ్బాయికి లోకువ కానా! అతగాడు నా వైపు నిక్కి నిక్కి చూస్తే, నే నెలా బ్రతగ్గలను?''

''ఈ మాత్రానికే సిగ్గుతో కృంగి పోనక్కర్లేదు. నీ భర్తను నువ్వు కావులించుకున్నావ్! ఇందులో సిగ్గు పడాల్సిందేముంది?''

''నిజమే! మరి ఆ అబ్బాయి నా వైపు ఎప్పుడూ దొంగచూపులు చూస్తుంటా డెందుకు? అతగాడికి బుద్ధి చెప్పరాదా! లేకపోతే ఆ యింటివాళ్ళకి చెప్పి, అక్కడ్నించి ఖాళీ చేయించ కూడదా!''

''అబ్బే! అదేదీ కూడదు. ఏ దృశ్యమైనా చూసేందుకు అతడికి హక్కుంది. నువ్వు కావులించుకోవటం, నీ విక్కడ నిల్చోవటం, యీ మేడ, యీ ఆకాశం, యివన్నీ అతగాడు చూడగలడు. అందాన్ని ఆస్వాదించగలడు. అంత మాత్రంచేత అతడికి బుద్ధి చెప్పించట మేమిటి? అతగాడు నిన్ను చూడటం యిష్టం లేకపోతే,యిక్కడ్నుంచి ప్రక్కకు

తప్పుకో! అంతేగాని, నీ అభిప్రాయాలను అతగాడిపై రుద్దట మేమిటి?''

''అంతేలెండి! మీ రెప్పుడూ యింతే! నిత్యజీవితం కవిత్వం కాదని ఎన్నిమార్లు చెప్పినా, నా మాట విన్పించుకోరు! మీ ఆశయాలూ, మాటలూ అన్నీ వింతగా వుంటాయి. నా ఖర్మను నే ననుభవిస్తానులెండి...'' అంటూ ఆమె తన గదిలోకి చరచరా వెళ్లిపోయింది.

'పిచ్చిది! పిచ్చిపిచ్చి ఆలోచనలు చేస్తోంది. తాజ్ మహాల్ సౌందర్యం ఒకరి సొత్తా? దాన్ని ఎవ్వరూ చూడకూడదని శాసించేందుకు మనకేం హక్కుంది? ఈ ప్రపంచంలోని సౌందర్యాన్ని కళ్లారా చూసేందుకు ప్రతి ఒక్కరికీ హక్కుంది. అందమైన గులాబీలను అందరూ చూస్తున్నారు; ఆనందిస్తున్నారు. అంతమాత్రం చేత ఫలానా గులాబీ తన అందాన్నందరూ చూస్తున్నారని బాధపడినట్లు ఎరుగమే!' అనుకుంటూ ఆయన ఎదురింటి మేడలోని కిటికీవైపుచూపులు పోనిచ్చాడు.

అక్కడ రసాస్వాదకుండైన ఆ అబ్బాయి లేడు. పైగా ఆ కిటికీ రెక్కలు మూయబడి వున్నాయి. ఆయన పెదవులమీద అప్రయత్నంగా నవ్వు నిలిచింది.

రాధ తన గదిలో కెళ్ళి మంచంపై పడుకొంది. ఆ అబ్బాయి, తను భర్త కౌగిలిలో వుండటం చూసినందుకు ఆ అక్కసును భరించలేక నిజం బయట పెట్టింది, కాని,

భర్త ఆ విషయాన్ని ఏమంత గొప్పగా పట్టించుకో లేదు. ఆయన విశాలహృదయుడు, అనుభవజ్ఞుడు కనుక సరిపోయింది. మరొకరైతే యీ పాటికి ఆ అబ్బాయి వీపు చిట్లగొట్టివుండే వారు. నిజానికి ఆ అబ్బాయిపై తనకు మక్కువే! అతన్ని చూసేందుకు తను పడే ఆరాటమే, ఆ అబ్బాయిపై తన కెంత అభిమానమో తెలియబరుస్తోంది. అలా అనుకొని తను ఊరుకుంటేసరా! ఎప్పుడూ ఆ అబ్బాయి తన వైపు చూస్తూ నిల్చోవటం, తనూ అతని వైపు కోర్కెలచూపులు విసురుతూ బాల్కనీమీద వుండటం ఏ నాడైనా తన భర్త గమనించి అపోహపడితే! అప్పుడు తన గతి ఏమౌతుంది? కనుకనే తనీ దినం ఆ అబ్బాయిపై నింద మోపింది. ఏ పరిస్థితుల్లోనైనా తాను బయటపడితే ఆ నేరం ఆ అబ్బాయి మీదికే వెళుతుంది. తను నెమ్మదిగా తప్పుకోవచ్చు.

రాధ ఆ విధంగా తలపోస్తుండగా భర్త గదిలోకి వచ్చాడు. ఆయన రాక గమనించి రాధ లేచి కూర్చుంది. ఆయన ఎప్పటిమాదిరే చిరునవ్వు లొలకబోస్తూ ఆమె ప్రక్కకొచ్చి కూర్చున్నాడు.

కాస్సేపు ఎవ్వరూ మాట్లాడుకోలేదు. రాధ ఆ నిశ్శబ్దాన్ని భరించలేక పోయింది ఏదో మాట్లాడాలని ప్రయత్నించింది కాని, అందులో కృతకృత్యురాలు కాలేక పోయింది. ఉన్నట్లుండి ఆయనే మాట కదిపాడు.

"ఇంకా ఆ అబ్బాయిని గురించే ఆలోచిస్తున్నావా

రాధా?'' అన్నాడతను.

''ఊహుఁ!'' అని తల తిప్పిందామె.

''పిచ్చి పిచ్చి ఆలోచనలతో మనసు పాడుచేసుకోకు. ఎవరి మనస్తత్వం వాళ్ళది. మన ప్రవృత్తినిబట్టి వాళ్లను కూడా మారిపొమ్మనటం భావ్యం కాదు కదా!'' అన్నాడు తిరిగి.

రాధ బదులు చెప్పకుండా మౌనంగా వింటూ కూర్చుంది. ఆయన చాలాసేపు లోకచరిత్రనుగూర్చి ముచ్చటించి-అంతలో తనకోసం ఎవరో మిత్రుడు రాగా అతనితో పాటు వెళ్ళిపోయాడు.

# 3

భర్త వెళ్లిపోయాక రాధ కేమీ తోచలేదు. ఆ గదిలో అటూ యిటూ పచార్లు చేసింది. కన్పిం చిన వస్తువునల్లా సర్ది పెట్టింది. మనస్సులో ఏదో చెయ్యా లని ఉబలాటం! ఏం చెయ్యాలో స్పష్టంగా బోధపడలే దామెకు.

ఆ గదిలోనుండి బయట పడాలని వుంది. బాల్కనీ మీదికి తిరిగి వెళ్ళి, ఆ అబ్బాయి కళ్లల్లోకి చూడాలని హృదయం తొందరపడుతోంది. క్షణం క్రితం ఆ అబ్బా యిని గురించి నిందావాక్యాలు పలికినా అతన్ని చూడందే ఒక్క నిమిషమైనా వుండలే ననిపించింది. మనస్సు పెట్టే తొందర నిక భరించలేక, నెమ్మదిగా ఆ గదినుండి బయటికి వచ్చి బాల్కనీ సమీపించింది.

ఆ అబ్బాయి మళ్ళీ కిటికీవద్ద నిల్చొని వున్నాడు. తన కేసే రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు. అతను ఏవేవో సైగలు చేస్తున్నాడు. ఏమిటా మూగ సంజ్ఞలు. తనను రమ్మంటున్నాడా? వచ్చి ఒకసారి ఆలింగనం చేసుకోమం టున్నాడా? ఊహుఁ! అవేవీ కాదు. ఆ కళ్ళల్లో ఏదో భీతి తొంగి చూస్తోంది. పూలతోటవైపు చేతులు చూపిస్తా డేమిటి? అక్కడేముంది?

రాధ ఊరుకోలేక ఆ పూలతొట్టివైపు చూసింది. ఆమె ఊహించని విధంగా అక్కడో కవరు పడివుంది. ఇంకో ప్రేమలేఖ కూడా వ్రాశాడన్న మాట- అనుకొని తియ్యగా నవ్వుకుందామె.

ఆ ఉత్తరాన్ని అందుకొని కవరు చింపి, లోపలి పేజీలను బయటికి లాగింది. అందులో ఏం వ్రాశాడోనని చదివేందుకు ఉపక్రమించి-అప్రయత్నంగా కిటికీవైపు చూసింది. అక్కడ ఆ అబ్బాయి లేడు. తను ఉత్తరం అందుకునే సరికే మాయమైనట్లున్నాడు. బెదరిపోయాడు కాబోలు! అంత బెదురుపాటు వున్నవాడు- తన భర్త యింట్లో వుండగానే ఉత్తరాన్నెలా వెయ్యగల్గాడు? మొత్తానికి కొన్నివిధాల ఘటికుడే!

రాధ యిక బాల్కనీమీద నిల్చోలేక గబగబా తన డ్రాయింగ్ రూమ్‌లో కెళ్లింది. దీపాలు వెలిగించి, ఆ వెలుగులో ఉత్తరాన్ని చదువుకోసాగింది.

"ప్రాణేశ్వరీ!"

నిన్నరాత్రి నాకో స్వప్నం వచ్చింది. స్వప్నాలు రావటం అందరికి మామూలే! స్వయంభావాలే స్వప్నాలని నాకూ తెలుసు. కాని, నాకొచ్చిన యీస్వప్నం చాలా వింతైనది.

నువ్వా స్వప్నంలో ఏదో దేశపు రాకుమార్తెవు అయ్యావు. ప్రబంధాల్లోని పార్వతి వక్షస్థలాన్ని- రతీదేవి

అంగస్పోష్టవాన్ని- ఊర్వశి కనుబోయిని- లక్ష్మీదేవి సర్వాలంకారాలను నీలో యిముడ్చుకొని, వయ్యారాలు ఒలకబోస్తూ-దేవేంద్రుని నందనవనాన్నే తలదన్నే ఒక వుద్యానవనంలో ప్రణయరాగాలు తీస్తూ-హరిణంవలెనిలకడ లేక అటూ యిటూ పరుగెత్తుతూ నా కంటబడ్డావ్!

అప్పుడు నేనుయథాలాపంగా సిగరెట్ వెలిగించుకొని- తెల్లటి పొగను నీ ముఖమండలం మీదికి వదలుతూ, ఫాల భాగంమీద పడి వంపులు తిరిగిన ముంగురులు గాలికి నృత్యాం చేస్తోంటే, వాటి నలాగే వదిలిపెట్టి నిన్ను సమీపించాను.

కాని, నువ్వు సామాన్య మానవాంగనవలె ప్రక్కకు తొలగలేదు. లజ్జావదనంతో ముఖం క్రిందకు దించుకోలేదు. కాలి బొటనవ్రేలిని నేలపై ఆడించ లేదు. నన్ను ఉన్మత్తుణ్ణి చేసేందుకు నీ వక్షస్థలం మీది గుడ్డను సవరించుకోలేదు. శరీరాన్ని వంపులు త్రిప్పి, మహాభావాలతో నా గుండెల్ని పిండి చెయ్యలేదు.

నిశ్శబ్దంగా నా కళ్ళల్లో కళ్ళుపెట్టి చూస్తూ బంగారు బొమ్మవలె నిల్చుండి పోయావు. అప్పుడు నీ కనురెప్పలు దివ్యాంగనలవలె మూతలుపడలేదు.

నేను నీ సౌందర్యాన్ని చూసి సహారా ఎడారినుండి ఒయాసిస్సు చేరుకున్నంత గొప్పగా సంతోషించాను. నువ్వలా నా కళ్ళల్లో కళ్ళుపెట్టి చూస్తూంటే- మన్మథుడనైన నేను యీ రూపులో రాగా-. రతీదేవివైన నువ్వా

రూపంలో ఎదుటబడి నిల్చున్నావేమోనని భ్రమించాను. మనిద్దరమూ ప్రణయసామ్రాజ్యాన్ని ఏలేందుకు క్రొత్తగా సృష్టించబడ్డ ప్రాణులమేమోనని తలంచాను.

కాని..అప్రయత్నంగా నువ్వు నీ మృదు హస్తాన్ని నా ఒంటికి తాకించావ్. నా ఆలోచనలకి ఆనకట్టలు కట్టి, నన్ను నీ చల్లని స్పర్శతో అమరుణ్ణి చేశావు. భ్రాంతిపడిన దానివలె నా ముంగురులను, కళ్లను చెక్కిళ్ళను, వక్షస్థలాన్ని తాకి గాఢంగా ప్రణయనిట్టూర్పులు వదిలావు. నా భుజాలపై నీ రెండు చేతులూ వుంచి,రొమ్ముపై వాలిపోయావు.

ఆ సమయంలో నీ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు నా గుండెలతో సంభాషించుకున్నాయి. కోర్కెలను అణచుకోలేక చలిస్తున్న వక్షోజాలు నా హృదయంలో మూగ ఆవేదనను సృష్టించాయి.

నేనప్పుడు నీ శిరోజాలను సవరించి-ప్రణయభారంతో క్రిందికి వాలివున్న నీ ముఖమండలాన్ని నా వైపుకి త్రిప్పుకున్నాను. నువ్వు నా వైపుకి తిరిగి– నీ మనోజ్ఞబింబాన్ని నా నయన గోళాల్లో చూసుకొని మురిసి పోయావు.

'దేవీ...' అని పిలిచాను నేను.

'ఊఁ!' అని కోయిలవలె పలికావు నీవు.

'నువ్వెవరవు?'

సమాధానం చెప్పావు కాదు.

'నిన్నే దేవీ!... నీ పేరేమి?'

'ఊఁ!' అని తిరిగి కోయిలవలె పలికావే కాని, సమాధాన మివ్వలేదు నువ్వు.

నీకు మాటలు రావేమోననుకున్నాను. నీ చూపుల్నే మాటలుగా రూపొందించుకోమని ఆజ్ఞ యిచ్చావేమో ననుకున్నాను.

నిన్నక్కడి నుండి నడిపించి రాధాకృష్ణుల పాలరాతి విగ్రహం ముందుకు తీసుకొచ్చాను. అక్కడి పచ్చిక బయలు మీద నువ్వు పడుకొని నా కేసి రెప్ప వాల్చకుండా చూస్తున్నావు.

నీ ముగ్ధమోహన రూపాన్ని చూసి నేను పూర్తిగా చలించిపోయాను. నీ మీదికి ఒరిగి- నీ కళ్లల్లో కళ్లు పెట్టి 'దేవీ' అన్నాను.

నువ్వు గలగలా నవ్వావు. ఆ నవ్వు నా గుండెల్లో అమృతమై వర్షించింది.

'దేవీ! ఎందుకలా నవ్వుతున్నావ్?' అనడిగాను.

నవ్వుతూనే రాధాకృష్ణుల విగ్రహంవైపు చూపించావు నువ్వు! సిగ్గెరగని నువ్వు సిగ్గు పడుతున్నావని ఊహించుకున్నాను.

'ఆ పాలరాతి బొమ్మలు మనల్ని చూస్తున్నాయని బిడియమా?' అనడిగాను మళ్ళీ.

'ఊహుఁ!' అని తల త్రిప్పావు.

'మరి...?'

ఈ మారుకూడ నువ్వు పెదవులు కదపలేదు. వెంటనే అక్కణ్ణుంచి లేచి గంతులువేస్తూ పరుగులు తీశావ్. నిన్ను వెన్నంటుతూ నేను ముందుకు పరుగెత్తాను.

అలా ముందుకు పరుగెత్తుతూ చప్పున నువ్వెక్కడో అదృశ్యమై పోయావ్. ఎటు వెళ్ళావో నాకు అంతు చిక్క లేదు.

నీకోసం గుబురైన పొదరిండ్లు వెదికాను. వృక్షోపరి భాగాల కేసి చూశాను. కొమ్మలమీది కోయిలమ్మలను అడిగాను. పరిపూర్ణమైన యవ్వనంతో- దర్పంగా తల లాడిస్తున్న మయూరాలను ప్రశ్నించాను. మెల్లగా మలయ మారుతం మోసుకొస్తున్న పవనుణ్ని నిలదీసి 'ఎక్కడ నా సౌగంధి?' అని పృచ్ఛ చేశాను.

కాని, నీ జాడ నాకు తెలియరాలేదు. ఎటుపోయావో, ఏమయ్యావోనని దిగులుపడి తిరిగి రాధాకృష్ణుల విగ్రహం ముందుకొచ్చి కూర్చున్నాను.

అంతలో నా కళ్ల నెవరో మృదువుగా మూశారు.

'ఎవరది?' అన్నాను.

కిలకిలా నవ్వు విన్పించింది. నువ్వేనని తెలుసు కొన్నాను.

'దేవీ...' అంటూ నీ మృదుహస్తాలను నిమురుతూ ప్రక్కకు తిరిగాను.

మునుపటికన్నా మరింత సౌందర్యంతో వెలిగిపోతూ-

చిరునగవుల వర్షం కురిపిస్తూ నువ్వు కన్పించావు. నీ చిరు నవ్వుల వర్షంవల్లనే ప్రకృతి సౌందర్యవతి అయ్యిందను కున్నాను.

'దేవీ! ఇంతసేపు నన్నొంటిచేసి ఎక్కడికి కెళ్ళావ్?' అన్నాను నిన్ను నా దగ్గరగా తీసుకుంటూ.

'..............'

'నీ కోసం నే నెంత ఆరాటపడ్డానో తెలుసా?'

'..............'

'నా మాటమీద విశ్వాసం లేకపోతే విరియకాసిన ఆ మల్లెల్ని అడుగు. కుహూరవాలు చేస్తున్న ఆ కోయి లమ్మలను ప్రశ్నించు. ఏం దేవీ, పలకవు? ఇంతసేపు నన్ను మాయచేసి ఎక్కడికి కెళ్లావు?'

నువ్వు నవ్వుతూనే నా పెదవులపై చేతులుంచి తల వూపావు అలా ఎందుకు చేశావో నాకు బోధపడక నీ కేసి ఆశ్చర్యంగా చూస్తున్న సమయంలో వయ్యారంగా లేచి; నా చేతి నంది పుచ్చుకొని ముందుకు నడిచావు.

నేను మంత్రించిన వాడివలె నిన్ను అనుసరించాను. నీవు ఉద్యానవనం దాటి ఒక నదీతీరం చేరుకున్నావు. అక్క డున్న బోటులో నన్ను కూర్చోబెట్టి ముందుకు ప్రయా ణించావు.

గలగలా శబ్దం చేస్తూ బోటు ముందు కెళుతోంది. ఆ నదీతరంగాలపై అప్పుడే ఉదయించిన శీతాంశుని కరుణ

కిరణాలు పడి తళ తళా మెరిసి పోతున్నవి. నువ్వేమో ముసి ముసి నవ్వులు ప్రదర్శిస్తూనే వున్నావు. నాకేమీ బోధపడక, ఎక్కడికో ఈ ప్రయాణ మని ఆలోచించుకుంటూనే వున్నాను.

అంతలో బోటు అవతలిగట్టు చేరుకుంది. క్రిందికి దిగి ఇసుకలోగుండా నన్ను నడిపించుకుంటూ వెళ్ళావు. కొంత దూరంలో కన్పించిన ఒక స్వర్ణమంటపం దగ్గరికి నన్ను తీసి కెళ్లి అక్కడ కూర్చోబెట్టావు.

నువ్వెప్పుడైతే ఆ స్వర్ణమంటపంపై అడుగుబెట్టావో, వెంటనే అక్కడ వీణావాయిద్యాలు శ్రావ్యంగా విన్పించాయి. మనస్సు నర్తించే ఆ మనోహర ప్రకృతి సీమలో నువ్వూ నేనూ కలసి ఆ వాయిద్యాల శ్రావ్యనాదాలను వింటూ తన్మయుల మయ్యాము.

కాస్సేపటికి నువ్వు నా కౌగిలినుండి లేచావు. నా చెయ్యి పట్టుకొని ఆ స్వర్ణమంటపం నుండి క్రిందికి దిగి మళ్ళీ నదిని చేరుకున్నావు. ఆ నదిఒడ్డున నిన్ను నా గుండెలకేసి బంధించుకుందామను కున్నాను.

నువ్వు గలగలా నవ్వి తప్పించుకున్నావు. నిన్ను ఏ విధంగానైనాసరే కౌగిలిలో బంధించుకోవాలని ఆరాటపడ్డాను.

నా ఆరాటాన్ని గుర్తించావేమో, నువ్వు మరింత బింకం చూపావ్! సమీపించినట్లే సమీపించి కిలకిలా నవ్వుతూ ఆ నదీతీరం వెంట పరుగులుతీశావ్. నేనూ నిన్ను

వెంబడించాను.

అప్పుడు గాడ్పుకు నీ ఒంటిమీది దుస్తులూ అతుక్కొని, పరిపూర్ణమైన నీ యవ్వనాన్ని స్పష్టంగా చూపించాయ్!

నువ్వు గాలిలో తేలిపోతున్నావో-భూమిమీద పరుగెడుతున్నావో నాకు స్పష్టంగా తెలియలేదు. కాని, నిన్ను అనుసరిస్తూ నేను పరుగుదీస్తూనే వున్నాను.

ఆ విధంగా మన మిద్దరం చాలాదూరం పరుగెత్తాము. నాకు పూర్తిగా అలసట కలిగింది. నువ్వేమో ఎంతదూరం పరుగెత్తినా ఏ మాత్రం అలసిపోకుండా నిశ్చలంగా నవ్వుతూనే వున్నావు.

అప్పటి నా స్థితినిగుర్తించావేమో-ఘుల్ఘుల్మనకాలి అందెలను మ్రోగిస్తూ-నయ్యారాలు ఒలకబోస్తూ నడిచి వచ్చి నన్ను సమీపించావు. బిగియార నన్ను కావులించు కొని-పెదవులపై ముద్దులు కురుపించావ్!

నేనప్పుడు స్వర్గధామం చేరుకున్నంత గొప్పగా తలపోసి- నిన్ను అలాగే నా ఒంటికి పెనవేసుకున్నాను. చాలాకాలం మనం చలనం లేకుండా వుండిపోయాము. మన వేడి నిశ్వాసాలు గుండెలలో అల్లరి చిల్లరిగా మాట్లాడు కున్నాయేమో- కాస్సేపటికి తేరుకొని ఒకరి కళ్ళల్లోకి మరొకరం చూడ సాగాము.

నా చూపుల ధాటికి తట్టుకోలేక తల క్రిందకు దించుకున్నావు. నేను నీ మోమెత్తి పలకరించ బోయాను. కాని,

నువ్వు నా ఆలింగనం నుండి తప్పించుకొని మింటి కెగిరావు.

ప్రణయసౌధానికి నువ్వు వెళుతున్నావేమో ననుకున్నాను. నువ్వెట్లా మింటి కెగిరావో బోధపడ లేదు. నేనెట్లా నిన్ను చేరుకోవాలో తోచ లేదు.

అంతలో ఏదో అదృశ్య శక్తి నన్నావహించింది కాబోలు; చివాలున నింగి కెగిరాను. నిన్ను చేరుకున్నాను.

నువ్వాఆకాశమార్గం గుండా నన్ను తీసికెళుతున్నావు. మబ్బుల్ని తోసుకుంటూ- చందమామను వెక్కిరిస్తూ- తారకమ్మలతో గుసగుసలాడుతూ వేగంగా ప్రయాణిస్తున్నావు. నేను ఎప్పటికప్పుడు వెనకబడుతూ నిన్ను చేరుకోలేక పోతున్నాను.

ఉభయులం కాంతివంతమైన ఒక సౌధం చేరుకున్నాక నువ్వు ఆగావు. నేనూ ఆగాను.

'ఎవరి దీ సౌధం?' అని ప్రశ్నించాను నేను.

నవ్వావు నువ్వు- నీదే నన్నట్లు. నీ మందహాసంలోని భావాన్ని అర్థం చేసుకున్నాను.

'ఇక్కడ ఎంతకాలం నుండి వుంటున్నావ్?'

మాట్లాడ లేదు నువ్వు!

'నీకు మాటలు రావా?'

మళ్ళీ నవ్వావే కాని, బదులు పలక లేదు. ఠీవిగా నా చెయ్యి పుచ్చుకొని తిరిగి ముందుకు నడిచావు.

ఆ విధంగా యిద్దరం కొంతదూరం నడిచి విశాలమైన

ఒకభవనం చేరుకున్నాము. ఆ సౌధం మధ్య నువ్వు నన్ను విడిచి ఎటో వెళ్లిపోయావు.

నువ్వెక్కడికి వెళ్ళావో- నన్నెందుకు ఒంటరిని చేశావో తెలియక చుట్టూ చూడసాగాను.

అప్పుడు కట్టెదుట నున్న ఒక హంసతూలికా తల్పం మీద నువ్వు వంపులు తిరిగి పడుకునివున్న దృశ్యం కన్పించింది. నిన్ను చేరుకుందామని అడుగులు ముందుకు వేసేసరికి ఎక్కడో ఘల్లుఘల్లుమని శబ్దమైంది.

అదేమిటోనని వెనుతిరిగి చూశాను. నువ్వు నవ్వుకుంటూ నన్ను సమీపిస్తున్నావు

ఎదురుగా తల్పంమీద నువ్వే వున్నావు. తిరిగి నన్ను వెనుకపాటు నుండి సమీపిస్తూనే వున్నావు. నీకు రెండు రూపాలేమో ననుకున్నాను.

కాని, అంతలో ఝుమ్మని నాద మొకటి శ్రావ్యంగా విన్పించింది. అటువైపుకి వింతగా చూశాను.

ఆ శబ్దం వినవచ్చిన దిశనుండి ఎందరో సుందరీమణులు కిలకిలారవాలు చేస్తూ వస్తున్నారు. వాళ్లందరూ నిన్నే పోలివున్నారు. అదే ముఖవర్చస్సు-అదే వయ్యారపు నడక-అవేచూపులు-అన్నీ నీలాంటి రూపురేఖలనే ధరించివున్నారు. అంతమందిలో నిజమైన నువ్వెవరో నాకు బోధ పడింది కాదు.

ఒక సుందరిని సమీపించి- 'నువ్వెవరవు?' అనడి

గాను.

'కల్పనను —' అని నవ్వింది.

'నా ప్రియవు కావా?' తిరిగి పృచ్ఛ చేశాను.

'నీ ప్రియనే!' అని కులికింది.

'నువ్వు నా ప్రియవు కావు, మాయవు...' అంటూ యింకో స్త్రీని సమీపించాను.

'నీ పేరేమి?' అని ప్రశ్నించాను.

'మాయను —' అందా కలికి.

'అవును, నువ్వు మాయవే! నా ప్రేయసివి కావు' అనుకుంటూ మరో సుందరిని చేరుకున్నాను.

'నా పేరు స్వప్నసుందరి. నీ ప్రియురాలినే' అందా సొగసులాడి.

'ఊహుఁ! మీ రెవ్వరూ నా ప్రియురాండ్రు కారు. నా ప్రియకు మాటలు రావు. మాటలు నేర్వని చిలుక నా ప్రియ. మాటలురాని ముగ్ధ నా ప్రాణేశ్వరి...' అనుకుంటూ తల్పంమీద పడుకొనివున్న నీ రూపాన్ని చేరుకున్నాను.

'నేను భ్రాంతిని. నీ దాననే!' అని నవ్వావు నువ్వు.

'ఊహుఁ! నువ్వు భ్రాంతివి కావు. నా ప్రాణేశ్వరివి!' అన్నాను ఉత్కంఠతతో నేను.

నువ్వు నవ్వి ఊరకున్నావు. నేను గభాలున నిన్ను కావులించుకోబోయాను. కాని, నువ్వు నన్ను మాయచేసి అదృశ్యరాలి వయ్యావు.

నా స్థితిని చూసి అందరూ కిలకిలారవాలు చేశారు.

'ఎందుకలా నవ్వుతున్నారు?' అనడిగాను.

అందుకు వాళ్లు ఒక్కొక్కరుగా ముందుకు వచ్చి-

'నేను కల్పనను- నీ హృదయేశ్వరిని...'

'నేను మాయను— నీ దానను...'

'నేను స్వప్నసుందరిని — నీ జవరాలిని...'

'నేనే భ్రాంతిని! — నీ ప్రాణేశ్వరిని ..'

అని నవ్వుతూనే ఒక్కొక్కరుగా అదృశ్యమై పోయారు.

నాకు పిచ్చిపట్టి నట్లయింది.

'ప్రేయసీ! ప్రియతమా!! నా ప్రాణేశ్వరీ...' అని ఎలుగెత్తి అరచాను.

అంతటితో నా కల కరిగిపోయింది. చప్పున మెలకువ వచ్చింది. లేచి చూద్దునుకదా, తెల్లగా తెల్లవారింది. వెంటనే కిటికీ తలుపులు తెరచి నీ కోసం చూశాను.

అక్కడ నువ్వు సాక్షాత్కరించి వున్నావు. అప్పుడే తలస్నానం చేసివచ్చావేమో- ముడివెయ్యని శిరోజాలను గాలికి వదలి నా వైపు తల త్రిప్పి కూర్చొని వున్నావు. నిన్నా భంగిమలో చూడాలని ఎన్నాళ్ళనుండో తలపోసేవాడిని. ఆ అదృష్టం యీనాటికి పండింది. నేడు నేను ధన్యుణ్ణయ్యాను.

"........."

రాధ ఆ ఉత్తరాన్ని చదవటం పూర్తిచేసి, తిరిగి

బాల్కనీమీది కొచ్చింది. ఆ అబ్బాయి అక్కడ నిల్చొని వున్నాడు. తన కళ్లలోకి అదే పనిగా చూస్తూ, ఏదో చదువుకుంటున్నాడు. రాను రాను ఆ అబ్బాయి తనను మరింత దగ్గరగా ఆకర్షించుకుంటున్నాడు. జ్వాలైన చూపుల ద్వారా, హృదయాన్ని ఆకట్టుకునే ఉత్తరాల ద్వారా, అన్ని విధాలా తనను మంత్రించుకుంటున్నాడు. ఆ అబ్బాయి కళ్లల్లో ఎంతశక్తి వుందో కాని, తను అతని వైపుకి చూచినపుడల్లా మనస్సందుకో కామప్రవృత్తితో గిలగిలా తన్నుకుంటుంది. అతన్ని గురించిన మధుర ఊహాలతో తేలి పోతుంది. తననంత గొప్పగా ఆకర్షించుకునే శక్తి అతని కెవరిచ్చారో!

రాధాదేవి ఆఅబ్బాయిని గురించి ఆలోచించుకొంటూ అలాగే చాలాసేపు నిల్చుండి పోయింది. గదిలోని గోడ గడియారం ఠంగున ఎనిమిది గంటలు కొట్టేసరికి తిరిగి ఆమె బాహ్యప్రపంచములోకి వచ్చి, గబగబా వంటగదివైపు దారి తీసింది.

ఆమె వెళ్లిపోవడంతో - ఎదురింటి అబ్బాయి గాఢంగా నిట్టూర్చి, తనూ ఆ కిటికీ రెక్కల చాటునుండి ప్రక్కకు తప్పుకొన్నాడు.

## 4

ఆ సాయంకాలం రాధ కేమీ తోచ లేదు. భర్త ఉదయం మెయిల్లో కడప కెళ్ళిపోయాడు; అక్కడినుండి నంద్యాల కెళ్ళి, సమీపంలోని మహానంది క్షేత్రంలో జరగబోతున్న యావదాంధ్రసాహిత్యగోష్ఠిలో పాల్గొనేందుకు వెళ్లాడాయన. రెండురోజులకుగాని తిరిగిరాడు.

ఈ రెండురోజులూ తను ఒంటరిగా గడపాలి. ఇప్పటికే కొన్ని గంటలపాటు మౌనంగా కాలం వెళ్ళబుచ్చటంతో తనపై తనకే విసుగు కల్గింది. ఎవరితోనైనా ముచ్చటగా కబుర్లు చెబుదామనుకుంటే యీ మద్రాసునగరంలో వీలే పడదు. ప్రక్కవాటాలోనివాళ్ళెవరో, ఎంతమంది కాపురం చేస్తున్నారో తెలుసుకునేందుకే తనకు మాసంపట్టింది. తీరా ఆ విషయం తెలుసుకున్నాక వాళ్ళు తమిళులని తేలిపోయింది. తనకు తమిళం రాకపోవటం నేరమైంది గాని, లేకపోతే ఆ పడుచుపిల్లలతో కాస్సేపైనా మాట్లాడుతూ కూర్చొనివుంటే ఎలాగో ఒకలా కాలం గడిచేది

ఆయనగారిని తనతోపాటు మహానందిక్షేత్రానికి తీసికెళ్ళమని పోరుబెడితే, ససేమిరా వీలుపడదన్నారు. ఎన్నాళ్ళనుండో ఆ క్షేత్రాన్ని దర్శించుకోవాలనే ఆకాంక్ష మనస్సులో అలాగే నిలిచిపోయింది. శివరాత్రుల్లో ఆ క్షేత్రమందు గొప్ప తిరుణాల జరుగుతుందట! అక్కడి క్షేత్రమహాత్మ్యాన్నిగురించి ఏలూరులో తన ప్రక్కింటి అమ్మలక్కలు చెప్పుకుంటూంటే విని, తానెప్పుడు ఆ క్షేత్రాన్ని

చూద్దునా అని భ్రాంతిపడుతుండేది. ఆమధ్య పత్రికల్లో కూడా ఆ క్షేత్రంపై వ్యాసాలు వచ్చాయి. తను వాటిని చాలా ఉత్సహంతో చదివింది; కాని, తీరా సమయం వచ్చే సరికి ఆయనగారు తీవిగా ఒక్కరే వెళ్లిపోయారు. ఏం మనుష్యులో, ఎదుటివాళ్ళ అభిరుచుల్ని అర్థం చేసుకోలేరు!

ఇప్పుడు తన కర్మకాలింది; ఈ రెండురోజులు ఒక్కతే ఒంటరిగా వుండాలి. ఇంట్లో ఉన్న దొక్కతే! రాత్రిళ్ళు జడుసుకుంటుందేమో ననే భయమైనా లేకుండా ఆయన మానాన ఆయన వెళ్ళిపోయారు. ఛీ ఛీ, ఏం మగజాతో! కట్టుకొన్న భార్య కష్టసుఖాలు గమనించ లేని కఠినజాతి!!

ఆ విధంగా రాధాదేవి తలపోస్తూ యథాప్రకారం బాల్కనీమీది కొచ్చి నిల్చుంది. అప్రయత్నంగా ఆమె చూపులు ఎదురింటి కిటికీవైపుకు మళ్లాయి. అక్కడ ఆ అబ్బాయి మళ్ళీ తన దర్శనంకోసం తపస్సు చేస్తూ కన్పించాడు.

'పిచ్చివాడా!' అని నవ్వుకుందామె

ఆమె నవ్వు గమనించి ఆ అబ్బాయి తన అదృష్టం పండిదనుకొని చిరునవ్వు లొలకించాడు.

తనను చూసి ఎప్పుడూ అలా చిరునవ్వు ఒలకబోస్తాడేమిటి అనుకుం దామె పాపం! అమాయకుడు; నోరు లేని సాధువు. తనకోసం అలా కిటికీవద్ద ఎంతసే పని వేచి వుంటాడో! కాళ్ళు నొప్పు లెట్టవేమో! ఏవూరివాడో! ఏ

చక్కని అమ్మ కనిందో! అన్నీ ఆడపిల్ల లక్షణాలు. ఆ చూపులు, ఆ ముఖం అంతా స్త్రీ పోలికలే! మాట్లాడటం వినలేదు కాని, అవి కూడా అలాంటివేనేమో!

ఏది ఏమైనా ఆ అబ్బాయి వ్రాసే ఉత్తరాలు తనను గిలిగింతలు పెడుతున్నాయి. ఏవో స్వప్నసీమల్లోకి లాక్కెళ్ళుతుంటాయి. ఆ ఉత్తరాల్లో ఎంత చక్కని భావనాపటిమ వుంటుందని! మనసులోని మాటలను నిక్కచ్చిగా కాగితంపై పెట్టగల ఆ అబ్బాయి తప్పిజారి కవిపుంగవుడు కాదు కదా!

ఇప్పటికే తను భర్తతో వేగలేక పోతోంది. ఎప్పుడూ చందమామ అందం-మల్లెల గుబాళింపు-కలువల చక్కదనం వీటిని గురించే ఆయన ఉపన్యాసాలు యిస్తూంటాడు. 'నిత్య జీవితానికి వాటిని గురించిన ఆలోచనలు అక్కర్లేదయ్యా మహానుభావా!' అంటే, ససేమిరా విన్పించుకోడు. తను వ్రాసిన రచనల్ని ముందుబెట్టుకొని, చదువుతాను వినమంటాడు. విధిలేక వింటే, ఎలా గున్నాయని ప్రశ్నిస్తాడు. తనకు నచ్చినా నచ్చకపోయినా ఆయన బాధపడతాడేమోనని బాగున్నాయంటే — 'ఎక్కడ బాగు —' అని అడుగుతాడు. ఫలానఘట్టం బాగుందనో ఫలానపాత్ర గొప్పగా చిత్రీకరింపబడిందనో చెప్పేదాక వదలిపెట్టడు. అదో వ్యసనం ఆయనకు! అందరు కవిరాజులూ తప్పిజారి యింతేనేమో! వాళ్ళ వాళ్ళ భార్యామణులు తనలాగే కవిత్వ మంటే

మొహం మొత్తి చాటుగా- 'యిదేం ఖర్మమో!' అను కుంటారేమో! అంతే అయ్యుంటుంది మరి! లేకపోతే ఎందు కొచ్చిన మేళమిది?

ఆ విధంగా రాధ ఆలోచనల మయంలోపడి ఎదురింటి అబ్బాయి కేసి చూసేసరికి — అతను చేతిలో ఒక కవరు పట్టుకొని రంగంలోకి దూకేందుకు సిద్ధమౌతున్నాడు

తిరిగి మరో ఉత్తరం వ్రాశాడన్నమాట! అందులో ఏం వ్రాశాడో ఏమో! మొన్నటిదినం వ్రాసిన ఉత్తరంనిండా అదోరకమైన జబ్బు వెలిబుచ్చాడు. దీనిలో కూడా అలాం టిదే వెళ్లగక్క లేదుకదా? ఏమో! అబ్బాయిలను అలాంటి జబ్బు కావులించుకుంటే ఒకపట్టాన వదలదు మొత్తానికి యీ అబ్బాయి సాహసవంతుడూ, బుద్ధిమంతుడూనూ! ఆ మేడలో నుండి యీ మేడలోకి ఒకఉత్తరం ముక్క విసిరేందుకు ఎన్ని గుండెలుండాలని! అదే మరో అబ్బాయి అయ్యుంటే ఉత్తరం విసిరేందుకు యిష్టమున్నా- ఆ పనికి సాహసించే వాడా? ఎవరైనా చూస్తారేమో- తన చర్యల్ని పసిగట్టి నాలుగు అంటిస్తారేమోనని బెదరిపోయి- కోర్కెలను, ఆశలను తనలోనే చంపుకొని సమాధి కట్టుకుంటాడుగాని!

రాధ అలా తలపోస్తూవుండగానే ఆ అబ్బాయి కవరు ముక్కను రివ్వున బాల్కనీమీదికి విసిరేశాడు. అది వాయువేగ మనోవేగాలతో ప్రయాణించి రపీమని ఒక పూలతొట్టిలో పడింది. కాస్సేపు ఆ అబ్బాయిని ఏడ్పించా

లని ఆమె ఉత్తరం పడిన సంగతే గమనించనట్లు ఎటో చూస్తూ-అప్పుడప్పుడు ఆ అబ్బాయి ముఖకవళికల్ని గమనించ సాగింది.

నిజంగానే ఆ అబ్బాయి బెదిరిపోయాడు. ఆమె తను విసరిన ఉత్తరం సంగతి గమనించ లేదని బెంగపడి సిగరెట్ మీద సిగరెట్ వెలిగించి, గుప్పునగుప్పున పొగ వదల సాగాడు. అతని దృష్టంతా ఆమె మీదా - ఉత్తరంమీదా కేంద్రీకృతమై వున్నాయి, ఏ సమయంలోనైనా ఆమె ఉత్తరాన్ని గుర్తించి, అందుకునేట్లు చెయ్యి భగవంతుడా అనుకుంటూ- యవ్వనంలో అడుగుబెట్టినప్పటినుండీ భగవన్నామస్మరణ ఎలాంటిదో మరచిపోయిన అతను మళ్ళీ అప్రయత్నంగా దైవప్రార్థన ప్రారంభించాడు. పాపం! ఆ భగవంతుడనే వాడికి ప్రేమలేఖలు ముట్ట చెప్పే ఉద్యోగధర్మం కూడా తప్పింది కాదు!

అందుకనే కాబోలు ఆమె వుండబట్టలేక ఆ ఉత్తరాన్ని అందుకొని- క్రీగంటిచూపులతో లోని కెళ్ళిపోయింది.

ఆమె ఉత్తరం అందుకోవటం-లోపలికి వెళ్ళటం గమనించిన ఆ అబ్బాయి రెండుచేతులూ ఎత్తి తిరుపతి దేవుడు నమస్కరించి. గుండెల్లోని భయం తొలగించబడి నందుకు చిహ్నంగా, సగం కాల్చిన సిగరెట్ పీకనుతీసి విసురుగా ఆష్ ట్రేలో పడేశాడు.

రాధ గబగబా డ్రాయింగ్ రూంలో కెళ్ళి ఆత్రంగా

కవరు చింపింది. లోనుండి కాగితాల కట్టను బయటికి లాగి, ఒక్కో అక్షరాన్నే నెమ్మదిగా చదువుకో సాగింది.

"జీ హాఁ!"...

నీ సౌందర్యాన్ని గురించి ఎప్పుడైనా ఆలోచించుకున్నావా? నువ్వెంత అందంగా వుంటావో కనీసం ఊహించుకున్నావా? నీ ముగ్ధత్వం యావత్ ప్రపంచాన్ని సవాల్ చేస్తోందని తెలుసుకున్నావా?

నీ శరీరంలోని మృదుత్వం, ముఖంలోని ప్రకాశం, కళ్లల్లోని తళుకు, అమ్మో! నేను వర్ణించగల్గి వ్రాసివుంటే, ఏనాడో నాకీ రసికప్రియులు సామ్రాజ్యపట్టం కట్టివుండే వారు. కాని, నాకంతటి భాగ్యం యింకా కలగలేదు.

నిన్ను నఖశిఖ పర్యంతం చూస్తూంటే-గుండెల్లో ఏదో వెలిబుచ్చలేని తియ్యటి బాధ జనిస్తుంటుంది. నిన్ను గూర్చి పగటికలలు కంటూ ఒక్కోమారు ఉన్మత్తుణ్ణి అవుతుంటాను.

నీ రూపలావణ్యాలను తదేకంగా చూస్తూ చూస్తూ, నిల్చున్నప్పుడల్లా నా హృదయం సారంగంవలె చిందులు త్రొక్కుతుంటుంది. నేను నీ రూపురేఖలను ధరించాలని భ్రమ. నీ లోకి నేనెలా చొచ్చుకపోగలనో! కనీసం నీ దరి చేరుకోగలనో లేదో!

చిరునవ్వు మాయని నీ పెదవులను చూస్తూ- నీ రక్తంలో రక్తాన్నయి ప్రవహించాలని, నీ కనుపాపల్లో చుక్క నవ్వాలని నా కెందుకీ ఆలోచనలు కల్గుతుం

టాయి? నువ్వు నన్నింత గాఢంగా ఆకర్షించుకునేందుకు భగవంతుడు నీలో ఏయేరకపు అయస్కాంతపు ముక్కలను ప్రసాదించాడు?

నువ్వు నా వైపు రెప్ప వాల్చకుండా చూస్తూ నిల్చొని వున్న భంగిమను తిలకిస్తూ నీ చూపుల బంధనుండి నే నిక తప్పించుకు పోజాలనని తలపోస్తుంటాను. నువ్వు అప్పుడప్పుడు క్రీగంటి చూపులు వదలుతూ వక్షంమీది గుడ్డను సవరించుకుంటూవుంటే, బెదరిపోయిన నన్ను యింకా రెచ్చగొడతా వేందు కని దిగులు పడుతుంటాను.

జీ హాఁ!...

ఇహ మీదట నువ్వు వక్షంమీది పయిటను సవరించుకోకు! నువ్వు అనుక్షణమూ నా వైపు చూస్తూ అలా సవరించుకుంటూవుంటే నేను పిచ్చివాడినై పోతాను. ఈ మేడను దూకి నీ వద్దకు చేరుకుందామని భ్రమిస్తాను. నువ్వు నా దానవే ననుకుంటాను. నాపై నీకు ఎనలేని ప్రేమ అని తలపోస్తాను. నేను లేకపోతే నువ్వు బ్రతక లేవని పిచ్చిగా ఆలోచించుకుంటాను.

ప్లీజ్!... అలా పైట సవరించుకోకు. క్రీగంట నన్ను చూడకు. ఆ నడకలో ఆకర్షణ చూపకు. నన్ను ఉన్మత్తుణ్ణి చెయ్యకు.

నీ వలా చేస్తే నేను చచ్చిపోతాను. నిత్యకృత్యాలను విస్మరిస్తాను. కుంచెను బీచిలో పారేస్తాను. మనస్సును సము

ద్రములోకి విసరేస్తాను.

నిన్న రాత్రంతా నీ ఆలోచనలవల్ల జ్వరం కాసింది. ఇప్పుడిప్పుడే కోలుకుంటున్నాను ఈదినం ఆదివారం–పనికి నిషేధం!

కాని, నువ్వు అలా నా వైపు చూస్తూంటే— నీకోసం నే నిక్కడే పడిగాపులు పడాల్సివస్తుంది. జ్వరం మళ్లీ మొదలవుతుంది. ఈ వెధవ జ్వరపు దండయాత్రకు ఆగలేకపోతున్నాను.

ఒకమారు నీ మృదుహస్తం నా ఒంటిని తాకితే యీ రోగానికి రోగంపట్టి నన్ను విడిచివెళుతుంది. నీవు నా దగ్గ అగా వస్తే — యీ సర్వస్వాన్నీ వదలుకొని నువ్వే ప్రపంచ మనుకుంటాను. ఒకసారి నువ్వు నన్ను కావిలించుకుంటే యీ లోకంలో యిక నా కేమీ అక్కర్లే దనుకుంటాను!

కనీసం నీ నోట్లో విషమైనా వేసుకొని నన్ను ముద్దు బెట్టుకో! నీ మొలకు బాకులైనా కట్టుకొని నన్ను నీ ఒంటికి పెనవేసుకో! తృప్తిగా నీ కౌగిలిలో వాలిపోతాను.

నీ ఆజ్ఞ అయ్యిందే తడవుగా సముద్రంలో దూక మన్నా దూకుతాను.

కాని ఒక్కమారు...

'నావాడివిరా నువ్వు! నన్ను విడిచిపోకు!' అను.

నీ పాదాలు పట్టుకుంటాను.

జీ హాఁ!...

నా కెందుకు నీపై యింత అభిమానం కలిగింది? నీ వక్షస్థలంపై తల నిడుకొని — నువ్వు నా కళ్ళల్లోకి చూస్తూంటే — నా జుట్టును సవరిస్తూంటే — నీ పెదవులమీది చిరునగవును చూచి — నీ కనులమీది నల్లటి చారలను చూచి — నీ కనుబొమల ముగ్ధత్వం చూచి - నేను అమరుడ నవ్వాలని భ్రమిస్తున్నాను.

ఓ సురబాలా!...

నీ సౌందర్యం నన్ను దేవేంద్రుడివలె వెయ్యి కళ్ల వాడిని చేస్తోంది. నీ గుండెల్లో గుండెనై పోవా లని — నీ కనుదోయిపై రెప్పలు నవ్వాలని - నీ శిరోజాలని అలంకరించే రోజా నవ్వా లని అన్పిస్తుంటుంది.

వీటిలో ఏదీ కాకపోతే నువ్వు పరుండే పాన్పు నవ్వా లని — నువ్వు త్రాగే గ్లాసు నవ్వా లని - నువ్వు వడ్డించుకునే కంచం అవ్వా లని వుంది.

నీ కళ్లల్లో కాటుకను నేనే అయితే - నువ్వు ధరించే గాజులను నేనే అయితే - నువ్వు కట్టుకునే జాజిమల్లెచీరెను నేనే అయితే - నీ వక్షాన్ని బిందుకునే జాకెట్ ను నేనే అయితే...

ఆహా - నా కంతటి భాగ్యమా! ఆ భాగ్యం నువ్వు నాకు ప్రసాదిస్తే యీ మద్రాసునగరాన్నే కొనేస్తాను. ఈ లోకంలోని అందాన్ని త్రాసులో పెట్టి తూస్తాను. ప్రకృతి సౌందర్యాన్ని కాలిగోటితో త్రోసివేస్తాను. నువ్వే యీ ప్రపంచానికి దేవతవు; నువ్వే నిజమైన ప్రకృతివి అనిపూజిస్తాను.

ప్రపంచంలోని సౌందర్యాన్నంతా మూసలో పోసి కరిగించుకున్న సౌందర్యదేవతవి నువ్వు! నా గుండెల్లో కలవరం కల్గించి-మానసికంగా నన్ను అమరుణ్ణి చెయ్య వచ్చిన దేవకన్యవి నువ్వు!

ఓ సురకాంతా!...

నేను నీ ప్రియుణ్ణి కాగలనా! పోనీ, నీవాడి నైనా అవగలనా? నువ్వు నన్ను ఏనాటికైనా నీ ఆలింగనంలో బంధించుకోగలవా?

నాపై నీకు కరుణ కల్గకపోతే-నీకోసమని తపస్సు చేస్తాను. నువ్వు తప్ప నాకు యితర వరాలేవీ అక్కర్లే దని కోరుకుంటాను.

'నువ్వే నేను - నేనే నువ్వు' అని ఈ లోకంచేత శ్లాఘింప చేసుకుంటాను,

ప్రియా!...

నేను వెళుతున్నాను, మెరీనాబీచికి నిన్ను తప్ప కుండా అక్కడికి రప్పించుకుంటాను. నేను నీ వాడి నవుతాను.

"................"

P. S. నాకు 'జీ హాఁ?' అంటే అర్థ మేమిటో తెలియదు, అది స్త్రీలింగమో, పుంలింగమో-ఏ భాషకు చెంది నదో-ఏ ఏ సందర్భాల్లో ఉపయోగింపవచ్చునో పూర్తిగా తెలియక చాలాసేపు తికమకపడి-అయినా,

అందమైన ఆ మాటను ఎందుకు వదలిపెట్టా లని
ముద్దుగా 'జీ హా'! అని నిన్ను సంబోధించాను.
తప్పుగా అర్థం చేసుకోకుసుమా!

"............"

రాధ ఉత్తరాన్ని చదవటం పూర్తి చేసి తియ్యగా నవ్వుకుంది. ఆమె కళ్ళల్లో ఏవో క్రొత్తకాంతులు పుంజు కున్నాయి. అద్దంముందు కెళ్ళి తన అంగసౌష్టవాన్ని పరి శీలించుకుంది. వంపులు తిరిగిన తన యవ్వనం-తననే ఆకర్షిం పచేస్తోంటే, యువకుడూ-వేడిరక్తంగలవాడూ అయిన ఆ ఎదురింటి అబ్బాయి యిక ఏపాటి అనుకుందామె.

ఏది ఏమైనా అమ్మాయిల హృదయాలను ఆకట్టు కునే శక్తివంతమైన ఉత్తరం వ్రాశాడు. తన నింత గొప్పగా వర్ణించగల్గి-తనకోసం యింతగా ఆరాటపడే అబ్బాయిని యవ్వన ముదయించాక ఏనాడూ చూడలేదు. తనలోని ఏ ఆకర్షణశక్తులు అతన్నలా తలక్రిందులు చేస్తున్నాయో! తనలో ఏముందనో అంత బలీయమైన వాంఛ!!

ఆ అబ్బాయిని గురించిన ఆలోచనలనుండి ఎంతగా తప్పుకుందా- మనుకున్నా సాధ్యపడటంలేదు. అనుక్షణమూ ఆ అబ్బాయి అమాయకపు చూపులు తన ఎదుట నిల్చొని 'నా కోసం రావూ!' అని పిలుస్తున్నట్లుంటాయి.

నిజంగా ఆ అబ్బాయి ఎవరు? తనెవరు! అతనికీ తనకీ గల సంబంధ మేమిటి? అతను ఉత్తరం వ్రాస్తే ఎంతో

అప్యాయంగా చదువుకొని మురిసిపోవట మెందుకు? క్షణం తీరిక దొరికితే బాల్కనీమీది కెళ్లి అతన్ని చూడాలనే ఉత్కంఠత తనలో ఎందుకు కల్గుతొంటుంది? రాత్రిళ్ళు నిద్రలో ఆ అబ్బాయిని తను కావులించుకున్నట్లు, ఎక్కడో ఊహాలోకాల్లో తేలిపోతున్నట్లు స్వప్నాలు వస్తుంటాయి-దేనికి?

తను ఆ అబ్బాయిని ప్రేమిస్తోందా? ఏమో! లేక పోతే తన హృదయ మెందు కింతగా ఆరాటపడుతుంది? అనుక్షణమూ తనకోసం నిల్చొని వుండే ఆ అబ్బాయిని చూడాలనీ- అతని కళ్లల్లో కళ్లుబెట్టి చూసి, కవ్వించా లని వింత కోర్కెలు దేనికి కల్గుతుంటాయ్?

ఊహుఁ! తను పెళ్లయిన పడుచు. అన్నివిధాల అనుకూలుడైన భర్త కలిగిన గృహిణి. అలాంటి తను ఒక యువకుడ్ని ప్రేమించటమా? తన చర్యల నెవరైనా పసి గడితే నవ్విపోరూ? తన కిదేం పాడుబుద్ధని నిందించరూ?

ఎవరే మనుకుంటే తనకేం? ఇతరుల కోసమని తనలోని కోర్కెలను అణచుకోవటమా? తనకోసం మధన పడుతున్న ఆ అబ్బాయిని యిన్నివిధాల చిత్రహింస చెయ్య డమా? తన నింత గొప్పగా ఆరాధించుకుంటూ, మనసారా ప్రేమిస్తున్న వ్యక్తికోసం తను త్యాగం చెయ్యకపోతే, ఎందుకీ వృథాబ్రతుకు? తప్పదు. ఆ అబ్బాయి కౌగలిలో తను వాలిపోవాల్సిందే! ఆ వేడిరక్తపు అమాయకుడి అంద

మైన కళ్లను ముద్దుపెట్టుకోవాల్సిందే! అతన్ని తన స్వాంతం చేసుకోవాల్సిందే!

లేకపోతే తనకు మనశ్శాంతి వుండదు. ఊరట కల్గదు. అశాంతితో, ఆవేదనతో జీవితాన్ని గడిపేకన్నా యిదే నయంకాదా! ఆ అబ్బాయి కోర్కెను తీర్చినంత మాత్రాన తననుండి పొయ్యే దేమిటి?

తనేం ద్రౌపది కాదు. ఆమెవలె హృదయంలో కోర్కెలున్నా వాటిని అణచి పెట్టుకొని లోలోన మథన పడేంత దౌర్బల్యస్థితి తనలో లేదు తనను అర్థించినవాడికి- తనహృదయాన్ని మంత్రించుకున్న వాడికి - యవ్వనాన్ని అర్పించి అనుభవించ మనటంలో తప్పులేదు.

తను లభించకపోతే ఆ అబ్బాయి ప్రాణ త్యాగం చెయ్యొచ్చు. అప్పుడు తనెంత బాధ పడాల్సి వస్తుంది? తనకై ఒక నిండుప్రాణం బలి అయితే చూస్తూ చూస్తూ ఏ స్త్రీ భరించగలదు? తను వున్న పరిసరాల్లో- తన స్థితిలో ఏ స్త్రీ అయినా వుంటే ఆ అబ్బాయి కోర్కెను కాదనగలదా! అతన్నలా మానసికంగా హింస పెట్టగలదా? ఊహుం! అందుకు హృదయమున్న ఏ స్త్రీ సమ్మతించదు. అలా సమ్మతించిన ఆమెకు హృదయమే లేదని అనుకోవాలి.

తనకు హృదయముంది. తనకై ఆరాటపడే వ్యక్తిపై తను జాలి చూపగలదు కనుక, తప్పనిసరిగా ఆ అబ్బాయిని

కలుసుకోవాలి తను. మెరీనా బీచికి వస్తానని వ్రాశాడు. తను తప్పకుండా అక్కడికి వెళ్ళాలి. ఆ అబ్బాయితో మాట్లాడాలి. అందాక తన మనస్సు మనస్సులో వుండదు. తను తను కాదు.

ఆ విధంగా రాధాదేవి పరిపరి విధాలుగా ఆలోచించుకొని ఆ అబ్బాయి వ్రాసిన కవరును జాగ్రత్తగా తన సూట్‌కేస్‌లో భద్రపరచి తాళంవేసింది. గబగబా బాత్‌రూమ్‌లో కెళ్లి స్నానాదికాలు పూర్తిచేసి రోజారంగు చీరె కట్టుకుంది. జడలోని గులాబీలను సవరించుకొని, ఆ అబ్బాయినిఆకర్షించుకునే హంగులన్నీ పూర్తి చేసుకున్నాక తిరిగి బాల్కనీ సమీపించింది.

అప్పటికి కూడా ఆ అబ్బాయి కిటికీ వద్దే నిల్చొని వున్నాడు. అప్రయత్నంగా ఆమె పెదవులపై మందహాసం తొణికిసలాడగా గమనించి ఆ అబ్బాయి తియ్యటి నవ్వు ప్రదర్శించాడు. ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి. మూగభాషతో మాట్లాడుకున్నాయి. అంతే ఆ అబ్బాయి చప్పున ప్రక్కకు తొలగి కూనిరాగం తీస్తూ డ్రస్ చేసుకున్నాడు. చెదరిపోయిన వెంట్రుకలనైనా సవరించుకోకుండా తిరిగి కిటికీ వద్దకు వచ్చి 'ఒ-కే' అన్నట్లుగా ఆమెవైపు చూశాడు.

ఈ మారు రాధ ముసి ముసి నవ్వు ప్రదర్శించి వెనుదిరిగింది. డ్రాయింగ్‌రూమ్‌లోని హ్యాండ్ బ్యాగ్ తీసుకొని యింటికి తాళంవేసి, మేడ దిగింది. క్రింది వాటాలోని

అరవలు అప్పటికి వారంరోజుల క్రితం పుణ్యతీర్థసందర్శనార్థం వెళ్ళివుండటంతో తనే గేటు తలుపులు మూసి రోడ్డుమీదకొచ్చింది.

అంతలో ఆఅబ్బాయి క్రిందికి దిగివచ్చి యథాలాపంగా స్కూటర్ మీద కూర్చొని స్టార్ట్ చెయ్య బోతున్నాడు. ఆమెను చూసిందే తడవుగా విజయగర్వంతో తలూపి సిగరెట్ వెలిగించుకున్నాడు. ఆమె కొంతదూరం వెళ్లేసరికి స్కూటర్‌ను ముందుకు నడిపించి, వెనువెంటనే నెమ్మదిగా పోసాగాడు.

రాధ బస్ స్టాప్ చేరుకొని అప్పుడే వచ్చిన 13 వ నెంబరు బస్ ఎక్కింది. తీరిగ్గా లోన కూర్చొని అద్దంలో గుండా వెనక్కి తిరిగి చూసింది. ఆ అబ్బాయి బస్సు వెనకాలే స్కూటర్ మీద వస్తున్న దృశ్యం చూసితృప్తిగా నవ్వుకుంది. బీచ్ రోడ్డులో బస్ ఆగటం- స్కూటర్ బస్సును చేరుకోవటం ఒకేమారు జరిగాయి. రాధ క్రిందికి దిగి ఏమీం ఎరగనట్లు పేవ్ మెంట్ మీద నడవసాగింది. ఆ అబ్బాయి పేవ్ మెంట్ క్రింద స్కూటర్‌ను లాక్ చేసి, వేగంగా అడుగు లేస్తూ ఆమెను సమీపించాడు.

ఎలాగైతేనేం కాస్సేపటికి యిద్దరూ బీచిలో కెళ్ళి సముద్రంముందు కూర్చున్నారు. ఆ దినం ఆదివారమవటం మూలన ఎక్కడ చూసినా జంటజంటలుగా గుంపులుగుంపులుగా చతికిలబడి నవ్వులతో, పిల్లలతో కేరింతా

లాడుతున్నారు.

రాధ, తనకు కాస్త దూరంలో కూర్చొని వున్న ఆ అబ్బాయి కేసి చూడకుండా తరంగాల కేసి- అప్పుడే ఉదయించిన పూర్ణిమచంద్రుని కేసి చూడసాగింది. సముద్రతరంగాలపై జ్యోత్స్నకిరణాలు పడి తళతళా మెరిసిపోతూంటే, ఆ మనోహర దృశ్యాన్ని చూస్తూ ఆమె పులకితురాలైంది.

"ఓహో! ప్రకృతి ఎంత గొప్ప సౌందర్యవతి!" అకస్మాత్తుగా ఆమె కా మాటలు విన్పించాయి.

చప్పున వెనుదిరిగి చూసింది. ఆ అబ్బాయి నవ్వుతున్నాడు. కేవలం ప్రకృతి ఒక్కతేనా సౌందర్యవతి! తను కాదా అనుకొని చిలిపిగా నవ్విందామె.

"ప్రకృతి బహు చక్కగా నవ్వగలదు..." తిరిగి ఆ అబ్బాయినుండి మాటలు విన్పించాయి.

ఔను! తనే ప్రకృతి. తననే ప్రకృతి అని సంబోధిస్తున్నాడు. తను సౌందర్యవతని, చక్కగా నవ్వ గలనని అన్యాపదేశంగా పలకరిస్తున్నాడు. పాపం, తనపై ఎంత మోజు అనుకుందామె.

"చందమామకు ఎక్కడిదో ఆ అందం! ఎవరి పొందు చెంది అతనింత అందగాడయ్యాడో!?" అంటున్నాడా అబ్బాయి.

మాటలు కలపాలని ప్రయత్నిస్తున్నాడు. తను ముభావంగా వుంటే సరి; ఇంకా ఎంత చక్కని అన్యాప

దేశాలు పలుకుతాడో వినాలి. తననుగురించి ఏమని వర్ణిస్తాడో తెలుసుకోవాలి, అనుకొని రాధ పూరకే వుండిపోయింది.

"ప్రకృతి మూగ దేమిటి? పలకరించినా పలకదు. కవ్వించినా నవ్వదు. పిలిచినా క్రీగంట చూడదు..."

"..............."

"దేవీ! పలకవేం? నీకోసమే వచ్చాను. నీ చూపుల్ని మాటలుగా చదువుకొని, అనుసరించాను. నీ సమక్షంలో కూర్చొనివున్నాను. నన్ను కరుణించవా? నాపై నీ చల్లని చూపులను కురిపించవా? నీ చిరునవ్వు మోమును నాకేసి మళ్ళించవా? ఏం దేవీ! మాట్లాడవు?"

"................."

"దేవీ! నేను త్రాగే పానీయాల్లో-తినే భోజనంలో-సిగరెట్ పొగల్లో ఎక్కడ చూసినా నీ మనోజ్ఞబింబమే సాక్షాత్కరించి నన్ను మాయచేస్తోంది. ఉవ్వెత్తుగా ఎగసిపడుతున్న ఆ సముద్రతరంగాలపై నువ్వు నిల్చొని నవ్వుతున్నట్లున్నావు. కాని, నా సరసనే ప్రత్యక్షంగా వుండి మిన్నకున్నావు. నన్ను పిచ్చివాణ్ణి చెయ్యకు దేవీ!"

రాధ యిహ భరించలేకపోయింది. ఆ అబ్బాయిని అలాగే వదిలిపెడితే ఉత్తరాల్లో వ్రాసిన కవిత్వమంతా వర్షంలా కురిపించేట్లున్నాడు. తప్పిజారి ఆ మాటలు ఎవరి చెవినైనా బడితే యింకేమన్నా వుందీ! అయినా,

ఎందుకొచ్చిందీ మేళం అనుకొని ఆమె, ఆ అబ్బాయివైపుకు తల త్రిప్పింది.

"ఇటురా!" అని అతనికి వినిపించీ వినిపించనట్లుగా పిలిచింది.

ఆమె పిలుపును క్షణంలో పసిగట్టిన ఆ అబ్బాయి ఒక్క దూకులో ఆమెను చేరుకున్నాడు.

"నీ పే రేమిటి?" అని అతన్ని ప్రశ్నించిం దామె.

ఆ అబ్బాయి కళ్ళప్పగించి ఆమెలోకి చూడసాగాడు కాని, బదులు చెప్పలేకపోయాడు.

"నీ పే రేమిటి...?"

ఈ మారుకూడా సమాధానం చెప్పగలిగే స్థితిలో లే డతను. ఆమె కనుబొమల చక్కదనాన్ని తిలకిస్తూ, బాహ్యప్రపంచాన్నే విస్మరించాడు.

రాధ విసుక్కుంది. అత నలా తనవైపు చూస్తుంటే — చూసేవాళ్లు ఏ మనుకుంటారు? సినిమాలోలాగ యిద్దొక ప్రణయఘట్టం కాబోలు నని ఊహించుకొని నవ్విపోరూ!

"ఏయ్, మిస్టర్! నిన్నే... ఎందు కలా నా కళ్లలోకి చూస్తావ్?"

అప్పటికికూడ అతను మాట్లాడలేదు. దృష్టిని ప్రక్కకు మళ్ళించలేదు. ఇస్సు మని నిట్టూర్చింది రాధ. ఇహ యిలా గవుతే బాగుండదనుకొని చప్పున లేచేందుకు ప్రయత్నించింది.

అప్పుడా అబ్బాయి బాహ్యస్మృతిలోకి వచ్చాడు. ఆమె లేవటం గమనించి కంగారు పడ్డాడు.

"నాపై కోపమా దేవి?" అని బుంగమూతి పెట్టాడు.

ఆమెకు నవ్వు వచ్చింది. జాలి కల్గింది. తిరిగి అక్కడే చతికిలబడి —

"నీ పేరేమిటి?" అనడిగింది మళ్ళీ.

"రాజా" అన్నాడతను గంభీరంగా.

"ఏం చేస్తుంటావ్?"

"అందాన్ని ప్రత్యక్షంగా చూడలేని అభాగ్యులకు ఆ అందమంటే ఏమిటో చూపిస్తుంటాను" అన్నాడు.

"అంటే?......"

"ప్రకృతి సౌందర్యాన్ని నా కుంచెతో బంధించి, ప్రాణంలేని బొమ్మలకు ప్రాణాన్ని ప్రసాదిస్తుంటాను..."

"అనగా?..."

"అనగా- నేను చిత్రకారుణ్ణి! చిత్రవిచిత్రమైన బొమ్మలు వేసి చావబోయే వాళ్ళను బ్రతికిస్తుంటాను. మతి చెడినవాళ్ళకు మామూలుమతి కల్గిస్తుంటాను. భగ్నప్రేమికులకు వాళ్ళవాళ్ళ ప్రియురాండ్ల చిత్తరువులను చిత్రించి సమర్పిస్తుంటాను...."

"ఓహో! ఇంతకూ నువ్వు ఆర్టిస్టువన్న మాట .."

"అంత చులకనగా నన్ను తీసెయ్యకు, నా ప్రాణ ప్రియా!...సారీ...నీ పేరేమిటో నేను తెలుసుకోగూడదా?"

"నా పేరు తెలుసుకోవలసినంత అవసరం నీ కెందుకు కల్గింది?"

"నిన్నెట్లా సంబోధించాలో తెలియక తికమక పడుతున్నాను. కనీసం నీ పేరైనా ఉదహరించి పలకరిద్దామని ఆశగా వుంది..."

"నువ్వు కవివి కూడానా?"

"కాదు... అయినా నీ కెందుకొచ్చిందా అనుమానం?"

"నీ ఉత్తరాల్లో కవిత్వం కురుస్తోంది. అందుకని అడిగాను..."

"నా ఉత్తరాల్లో కవిత్వ ముంటుందని మొదటి సారిగా నువ్వొక్క దానివే రిమార్క్ చేశావ్?"

"అంటే నా లాగే యితరులకు కూడా అలాంటి ఉత్తరాలు వ్రాశావన్న మాట?"

"ఆడవాళ్లకున్న సహజమైన జబ్బు నీలో కూడా వుందన్న మాట. బాగుంది. ఇతర్లకి కూడా అలా వ్రాయవలసిన అదృష్టం నా కెందుకు కల్గుతుంది?"

"ఏం? ఆ అదృష్టం నీ కెందుకు పట్టలేదు?"

"దేనికైనా అవసరం కల్గితేనే అదృష్టం ఆవహిస్తుంది. నీ అవసరం నాకు కల్గింది కనుక— నీ కొక్క దానికే ఉత్తరాలు వ్రాశాను. అందరికీ యిలాగే వ్రాస్తుంటానని తప్పుగా అర్థం చేసుకోకు!"

"నన్ను గురించి ఏమైనా తెలుసా నీకు"?

"ఎందుకు తెలియదు? భాగవతంలాంటి గ్రంథం చెప్పగలను నిన్ను గురించి..."

"ఏమని చెప్పగలవో కాస్త చెప్పుకో చూద్దాం!"

"నువ్వు అపరరతీదేవివి! రంభ, మేనక ఊర్వశి యిత్యాది సౌందర్యవతులను నీలో రూపొందించుకున్న దానివి. నీ ఉచ్ఛ్వాస నిశ్వాసాలే యీ ప్రపంచానికి మలయ మారుతాన్ని ప్రసాదిస్తున్నాయి. నీ చిరునవ్వులవర్షంవల్లనే వెన్నెల కాస్తోంది యీ ప్రపంచంలో! నీ పలుకులే కోయిలల గానాలు! నువ్వే నిజమైన ప్రకృతివి ..."

"ఇహ చాలించు నీ ఉపన్యాసం. ఈ మాటల నన్నింటినీ ఎక్కడ బట్టీపెట్టావ్? ఏ పుస్తకంలోనుండి సంగ్ర హించావ్?"

అని రాధ కిలకిలా నవ్వింది. ఆ అబ్బాయిసైతం నవ్వకుండా వుండలేకపోయాడు.

ఆ తర్వాత చాలాసేపటివరకు యిద్దరూ మాట్లాడుకో లేదు. మౌనం వహించి క్రీగంటిచూపులతో ఒకరి నొకరు చూసుకోసాగారు.

అంతటి నిశ్శబ్దాన్ని ఆ అబ్బాయి భరించలేక పోయాడు. నెమ్మదిగా మాట కదిపాడు.

"ఆకాశం వున్నట్లుండి మబ్బు పట్టింది. నవ్వుతూ పరుగెత్తిన చందమామను ఏ కారుమేఘమో కౌగలించు

కుంది. క్షణంలో వర్షం కురియదు కదా!''

రాధ బదులు పలక లేదు. ఆ అబ్బాయి అంతటితో వూరుకోలేదు.

''అదుగో! కారు మేఘాలు యిటే వురకలేస్తూ వస్తున్నాయి. అక్కడ వర్షం కురుస్తున్నట్లుంది. అందరూ వెళ్లిపోతున్నారు తను ప్రియురాండ్ర భుజాలపై చేతులు వేసుకొని నవ్వుకుంటూ...''

అని అతను అంటూవుండగానే జినజినమని వర్షం కురియటం ప్రారంభించింది. అప్పటికే చాలమంది పరుగెత్తి బస్ స్టాప్ వద్దకి చేరుకున్నారు.

ఉన్నట్లుండి అకస్మాత్తుగా వర్షం కురిసేసరికి రాధకేమి పాలుపోలేదు. ఏం చేయాలో తోచక అటూయిటూ కంగారుగా చూడసాగింది.

''దేవి అనుగ్రహిస్తే క్షణంలో నా స్కూటర్ యీ వర్షం నుండి రక్షిస్తుంది...'' అంటున్నాడా అబ్బాయి.

అంత కంగారులోనూ ఆమెకు నవ్వు వచ్చింది. ఎంత ధైర్యం? ఒకపరాయి స్త్రీని అందరూ చూస్తూండగానే తన స్కూటర్ మీద తీసికెళతా నంటున్నాడు. గడుసు వాడే, అనుకుందామె. అలాగే యిద్దరూ వర్షంలో తడుస్తూ మౌనంగా స్కూటర్ దగ్గరికి చేరుకున్నారు. ఆ అబ్బాయి గబగబా స్కూటర్ స్టార్ట్ చేసి ఆమెవైపు జాలిగా చూశాడు.

రాధ యిహ ఏమీ ఆలోచించ లేక పోయింది. గభా లున స్కూటర్ వెనక వైపు కూర్చొని— "ఊఁ! పోనియ్ మరి-" అంది.

ఆ అబ్బాయి విజయగర్వంతో చిన్నగా యీల వేసి, రివ్వున స్కూటర్‌ను ముందుకు పోనిచ్చాడు. అలా కొంతదూరం వెళ్లాక ఆమె తొలిసారిగా ఆ యువకుడి భుజం తట్టి——

"ఇటు జాం బజార్ వైపు——" అంది.

ఆమె స్పర్శకు పులకితుడై-ఏవో పగటికలలుకంటున్న ఆ అబ్బాయి చటుక్కున స్కూటర్‌ను ఎడం చేతివైపు టర్నింగ్ త్రిప్పాడు. ఒకయింటి ముందు కెళ్లాక ఆమె స్కూటర్‌ను ఆపమంది. వెంటనే అతను బ్రేక్ వేసి- ఆమె క్రిందికి దిగేందుకు చేయి నందించాడు.

రాధ క్రిందికి దిగి ఆ యింటి తలుపులవద్దకెళ్లి కాలింగ్ బెల్ నొక్కింది. లోపలి నుండి సుజన బయటికి వచ్చి —

"ఓహ్ఁ!- రాధాదేవా! ఏమిటే యింత వర్షంలో వచ్చావ్?" అనడిగింది.

"అదంతా తర్వాత చెబుతానుగాని, ముందు నన్ను లోపలికి వెళ్ళనివ్వు-" అని రాధ లోపలికి నడిచింది.

సుజన ఇంకా బయటే వర్షంలో నిల్చొనివున్న రాజాని వింతగా చూస్తూ- తనుకూడా లోపలికి వచ్చింది.

"ఆ అబ్బాయి వెళ్ళిపోయాడా?" అనడిగింది రాధ,

సుజనను.

"ఏ అబ్బాయి?"

"ఆ స్కూటర్ వాలా!"

"ఊహుఁ! వెళ్ళినట్లు లేదు"

"చచ్చాంపో! ముందు అత న్నిక్కడినుండి వెళ్ళమని చెప్పు"

"ఇంతకీ ఆ అబ్బాయి ఎవరే?"

"అదో పెద్ద కథ లే! సవిస్తరంగా చెబుతాను గాని, ముందు అతగాడు వెళ్ళాడో లేదో చూసిరా!"

సుజన తిరిగి బయటికి వచ్చేసరికి—యీలోగా రాజా ఏం ఆలోచించుకున్నాడో ఏమో స్కూటర్‌ను స్టార్ట్ చేసి ముందుకు తోలాడు. రాజా వెళ్లిపోవటం గమనించి సుజన నవ్వుకుంటూ లోపలికి నడిచింది.

"ఏం వెళ్లిపోయాడా?" అనడిగింది రాధ.

"ఆఁ!"

"అమ్మయ్య! ఇప్పటికి కాస్త గుండెదడ ఆగింది. నేనా స్కూటర్ మీద రావటం ఎవ్వరూ చూసివుండరుకదా!"

"నువ్వాఅబ్బాయి స్కూటర్ మీద వచ్చావా?"

"అవును —"

"అమ్మో! ఏదో గొప్ప విశేషమే వుందన్నమాట! ఎక్కడినుండి వచ్చావ్?"

"బీచినుండి-వర్షం కురియగానే ఏమీ తోచలేదు.

ఉన్నపళంగా ఆ అబ్బాయి స్కూటర్ మీద యిక్కడికి తీసుకొచ్చాను.''

''మొత్తానికి నాకన్నా గడుసుదానివే! ఎవరో ఆ అబ్బాయి కాని, చాలా అందంగా వున్నాడు'' అని నవ్వింది సుజన.

''అందగాడు కనుక నే ఎప్పటికప్పుడు క్షమిస్తూన్నాను. నన్ను ప్రేమిస్తున్నా నంటూ వెంటబడ్డాడు...''

''ఏమి టేమిటీ, అతగాడు నిన్ను ప్రేమిస్తున్నాడా?''

''ఆఁ! ఇప్పటికి మూడుఉత్తరాలుకూడ వ్రాశాడు.''

''సరి-సరి, కథ చాలా వుం దన్నమాట. ముందు యీ టవల్‌తో తల తుడుచుకొని, ఆ చీరె మార్చుకో. సావధానంగా అన్నివిషయాలు చెబుదువు గాని. కాఫీ తెప్పించమన్నావా?''

''ఇప్పు డేమీ అక్కర్లేదు. కాస్సేపటికి యిద్దరం కలిసే భోజనం చేద్దాం —''

''అమ్మాయిగారికి యీ దినం నాపై వల్లమాలిన అభిమానం ముంచుకొచ్చిన ట్లుందే! మీ ఆయన ఊరిలో లేడా ఏమిటి?''

''లేడు —''

''ఎక్కడి కెళ్ళాడో?''

''మహానంది కట! ఏదో అఖిలాంధ్ర సాహిత్యగోష్ఠి అంటూ యీ ఉదయమే వెళ్ళిపోయాడు''

"అందుకే కాబోలు అమ్మాయిగారు యిలా వేంచేశారు—"అని తిరిగి నవ్వింది సుజన.

రాధ యిం కేమీ మాట్లాడకుండా డ్రాయింగ్ రూమ్‌లో కెళ్లి చీరె మార్చుకునివచ్చింది. తనకూ ఆ అబ్బాయికీ మధ్య అంతవరకు జరిగిన విశేషాల నన్నింటినీ సుజనకు వివరించి చెప్పి గాఢంగా నిట్టూర్చింది.

"సుజా! ఇదీ కథ. పైకి ఆ అబ్బాయినిగురించి నేను మరోవిధంగామాట్లాడుతున్నప్పటికీ-నా హృదయంలోఅతను తిష్ఠ వేసి కూర్చున్నాడే! ఎందుకోగాని ఆ అబ్బాయివైపుకు దినదినానికి నేను దగ్గరపడుతున్నాను. అదేమిటోగాని క్షణం అతను కన్పించకపోతే నా ప్రియమైన దేదో శత యోజనాల దూర మైనట్లు ఫీలౌతుంటానే" అంది రాధ.

"బాగుం దీవరుస. ఆ అబ్బాయి నిన్ను హిప్నటైజ్ చేస్తున్నాడేమో"

"అంతే కావొచ్చు. లేకపోతే అతన్ని చూడా లని నా మనస్సు ఎప్పుడూ తహ తహ లాడుతుంటుంది, ఎందుకు? అతగాడిని చూడగానే మనస్సు కుదుటబడుతుంది. ఎంత విసుగు వున్నా అతని ముఖం చూసేసరికి శాంతి కల్గుతుంటుంది."

"మంచివాడే! ఆడవాళ్ళని ఆకర్షించుకునే శక్తుల్ని ఎక్కడ సంపాదించాడో?"

"ఏమో మరి! ఆ ఉత్తరాలను ఎంత తియ్యగా

వ్రాస్తాడని! వాటిని చదువుతుంటే మనస్సెక్కడో మధుర సీమల్లో విహరిస్తుంటుంది. నన్ను ఎంత చక్కగా వర్ణించ గలడని!..."

"మొత్తానికి నీ హృదయాన్ని తన వైపుకి మంత్రించు కున్నాడన్న మాట!"

"అన్నమాటేగా మరి."

"అయితే ఆ అబ్బాయిని యిక్కడికి పిలిపించి మాట్లాడనా!"

"ఏమని?"

"మహానుభావా! మా చిన్నదాని మనస్సును దేనికి, ఎలా హరించావయ్యా అని?"

"ఊరుకోవే, నీ పరిహాసాని కేంగాని- నా మనస్సు వెర్రెత్తి పోతోంది. నేను యీ రాత్రంతా కన్పించకపోతే ఆ అబ్బాయికి పిచ్చిపడుతుందేమో!"

"అబ్బ! ఎంత జాలి అతగాడిమీద."

"అవునే! నువ్వు నా లాంటి స్థితిలోనే వుండివుంటే యిలా మాట్లాడేదానివి కావు. అసలు నా కున్న నిగ్రహం కూడా నీ కుండేది కాదు. సమయం చూసి ఏ రాత్రో అతగాడితో వుడాయించే దానివి."

"ఏం, అంత ఆకర్షించుకుంటాడా అతను?"

"అందుకేగా ఇంత యాతనపడుతున్నాను. మనస్సును చిక్కబట్టుకొని ఊరకే వుండి పోదామంటే చేత కాదు.

పరిస్థితులకు లొంగిపోయి అతన్ని చేరుకుందా మనుకుంటే ధైర్యం చాలదు. ఏం చెయ్యాలో బోధపడటంలేదే ..."

"అయితే అభాగ్యురాలివే నువ్వు. అందే అందాన్ని అంది పుచ్చుకోవాలి గాని, ఎందుకీ లేనిపోని బెడదలు అన్నీ? నీ సుఖం కోసం- నీ తృప్తికోసం ఒరు లెవ్వరో చూసిపోతా రని భయపడటం దేనికి?"

"అవుననుకో! కాని, అలా అనుకొని ముందడుగు వెయ్యలేంగా"

"కనుకనే మనం మానసిక దుర్బలుల మనిపించు కున్నాం. అందమైనవాడు, ఆశించినవాడు, అహర్నిశలూ నీ కోసం ఆరాటపడే పడుచువాడు లభించినప్పుడు చూస్తూ ఎలా వదలుకుంటావ్?"

"ఏమో, నాకు భయమేస్తోంది..."

"పోవే పిచ్చిదానా! నీ స్థితిలో నేనే వుండివుంటే ఏనాడో ఆ అబ్బాయిని నా వెచ్చని కౌగలిలో బంధించు కునేదాన్ని. అతని వేడి నిశ్వాసాల్ని నా గుండెల్లో దాచుకునే దాన్ని"

"అవును. ఎంతకైనా నువ్వు సమర్థురాలివే! నీ కేం, పెళ్ళి కాని పడుచువు. స్వేచ్ఛాజీవివి. ఎవరి అదుపాజ్ఞలూ లేవు. నాకో? పెళ్ళయిందిగా! ఆయన వున్నారు"

"ఉంటే మాత్రమేం? ఆయనకూ కోర్కెలుండవూ? హృదయ ముండదూ?"

"ఉంటే?..."

"ఉంటే-తనకు నచ్చింది ఎక్కడైనా కన్పిస్తే వెంట బడడూ! అందమైనది, ఏ పూని కొంపలోనైనా అగుపిస్తే డబ్బిచ్చి, అవసరం తీరేదాక ఉపయోగించుకోడూ?"

"ఆయన కేం మగమహారాజు"

"అలాగే మనంకూడా. అందమైనవాడు ఆశిస్తే- నీ హృదయం అతనివైపుకి ఆకర్షింపబడితే తప్పకుండా అత గాడిని అనుభవించవే! నీ కోర్కెలు నీవి; నీ ఆశలు నీవి. వాటిని నీ భర్త కోసమని- ఒరులు చూస్తారని బలిపెట్టు కోవటం దేనికి? మనస్సు బండచేసుకొని బ్రద్దలు కొట్టుకోవట మెందుకు?"

"ఊహుం! నా కంత ధైర్యం లేదు."

"అయితే అఘోరించు. మరి అతగాడిని గురించి ఎందుకూ వాగుతావ్?"

"మనస్సును చిక్కబట్టుకోలేక..."

"సరి. సరి— ఇహ నాకు చెప్పకు? నువ్వు వట్టి చేతకాని దానివి. అందే అందాన్ని అనుభవించలేని అభాగ్యు రాలివి! ఆ అబ్బాయి నీ నుండి దూరమయ్యాక 'అయ్యో! సమయం మించిపోయిందే!' అని అఘోరిస్తావ్. మధ్యన నా కెందుకీ లేనిపోని బెడద?"

"అబ్బ! కోపగించుకోకే! చీటికి మాటికి అలా కోప గించుకుంటే ఎట్లా? నాకు మాత్రం ఆ అబ్బాయిని పొందా

లని లేదా?''

''ఉంటే సరి — సంతోషించాం. ఇహ పద పోదాం! రాజమ్మ వడ్డించింది...'' అని సుజన లేచింది.

తప్పనిసరి అవటంవల్ల రాధకూడా లేచి డైనింగ్ హాలువైపు సుజనతోపాటు వెళ్లింది. భోజనాలు పూర్తయ్యాక యిద్దరూ హాల్లోకి వచ్చారు. కాస్సేపు పిచ్చాపాటి మాట్లాడుకున్నాక రాధ వెళ్లిపోతానంది.

''ఈ రాత్రికి యిక్కడే వుండిపో. తెల్లారి వెళు దువుగాని!'' అంది సుజన.

''ఊహుఁ! వెళ్ళాలి. ఏమిటో మనస్సు వెర్రెత్తి పోతోంది.''

''పిచ్చిదానా! ఎందుకలా నీలో నువ్వు మధనపడుతావ్? మనసులోని కోర్కెలు నిన్నలా వెర్రెత్తింప చేస్తున్నట్లున్నాయి. ఇంతరాత్రిలో యింటి కెళ్ళి ఏం చేస్తావు? మీ ఆయన కూడా లేడుగా! ఒంటరితన మెలా భరించగలవు?''

''ఏమో కాని నాకు వెళ్లాలనే వుంది. ఇహ క్షణం కూడ యిక్కడ వుండలేను...''

''బాగుంది నీ వరుస. ఆ అబ్బాయి మనస్సులో ప్రవేశించి బలవంతం చేస్తున్నాడు కాబోలు. సరే పద, తప్పుతుందా మరి!'' అని సుజన లేచింది.

రాధ కూడా ఆమెతోపాటు బయటికి వచ్చాక

యిద్దరూ రోడ్డుమీద పడ్డారు. కొంతదూరం పేవ్ మెంట్ మీద నడిచాక —

"ఏమే బస్ స్టాపింగ్ కు వెళదామా!" అనడిగింది సుజన.

"వద్దు. ఏదైనా టాక్సీ పిలు. ఆ బస్సుకోసం వెయిట్ చేసేకన్నా నడుస్తూ వెళ్ళటమే మంచిది..."

అంతలోనే ఒకటాక్సీ అటువైపుగా వచ్చింది. సుజన కేకపెట్టి టాక్సీని ఆపుచేసింది. ఇద్దరూ అందులో కూర్చు న్నాక—

"ఎంగె పోను మమ్మా?" అనడిగాడు టాక్సీడ్రైవర్ తమిళంలో.

"రాయపేట —" అని సుజన రాధవైపు తిరిగి—

"ఏదైనా పిక్చర్ కన్నా వెళదామా?" అంది.

"నాకే పిక్చరూ చూడాలని లేదే! ఊరకే నన్ను విసిగించకు. అదుగో, ఆ అబ్బాయి మన టాక్సీ ముందుగా స్కూటర్ మీద వెళుతున్నాడు చూడు. ఇందాకా ఎక్కడో నాకోసం కాచుకొని వున్నట్లున్నాడు; మనం టాక్సీ ఎక్కటం కూడా చూసి వెంటపడ్డాడు. అతనికి నేనంటే ఎంత మోజే!"

"ఔనౌను. అంతే అయ్యుంటుంది. ఇంతకీ నువ్వు అదృష్టవంతురాలివి. పెళ్లయినా— భర్తవున్నా, మరో అందగాడి చేత వలపించుకొన్నావ్. పెళ్ళి కాని దాన్ని—

నా వెంట ఎవరూ పడరేమే!''

అని సుజన అన్నదానికి రాధ ఫకాలున నవ్వింది. ఆమెతోపాటు సుజనకూడా కిలకిలా నవ్వి బయటికి చూసింది. ఆ అబ్బాయి టాక్సీ వెంబడే స్కూటర్ మీద వస్తూ-అప్పుడప్పుడూ కారులోకి చూస్తున్నాడు. అతని సూటి చూపులనుండి సుజన తప్పించుకొని—

''ఏమే నే నో తమాషా చేస్తాను, చూస్తావా?'' అనడిగింది.

''ఏమిటది?'' రాధ ఉత్కంఠతతో అడిగింది.

''ఈ అబ్బాయిని చూస్తూంటే కాస్సేపు ఏడ్పించాలనిపిస్తోంది. టాక్సీని సందుగొందులు త్రిప్పించి యితగాడిని ముప్పతిప్పలు పెడదాం...''

''అబ్బ! ఊరుకోవే. నీ కోనంగిబుద్ధిని పోనిచ్చావు కాదు. అత న్నలా ఏడ్పించటంవల్ల మన కొరిగే దేమిటి?''

''ఏమిటా! కాస్సేపు వుండు, చూద్దువుగాని'' అని సుజన, టాక్సీడ్రైవర్ కి తమిళంతో కొన్ని సూచనలిచ్చింది.

శరవేగంతో వెళుతున్న టాక్సీ వెంటనే వేగం తగ్గించి కుడిచేతివైపు టర్నింగ్ తిరిగింది.

''అబ్బబ్బ! నువ్విలా అతన్ని ఏడ్పించావంటే నేనూరుకోను. ఇక్కడే దిగిపోతాను. తెలిసిందా!'' అని బెట్టుసరి చేసింది రాధ.

"అమ్మో! అతడిపై ఎంత అభిమానమే! సరే నీ యిష్టం" అని సుజన డ్రైవర్ వైపు తిరిగి—

"నేరా హైరోడ్ మేలా పో—" అంది.

డ్రైవర్ కి వాళ్ళ తెలుగు సంభాషణ అర్థం కాక తిరిగి హైరోడ్ మీదికి కారును తోలాడు.

కాస్సేపటికి రాధ యింటిముందుకొచ్చి కారాగింది. అప్పుడే ఎదురింటి మేడలోని అబ్బాయికూడా స్కూటర్ తో పాటు వచ్చి గేటుబయట నిల్చున్నాడు. రాధ అతనివైపుకు అర్థనిమీలిత నేత్రాలతో చూసి ముసిముసి నవ్వు ప్రదర్శించింది.

"హుఁ! యిప్పటికి అమ్మాయిగారి మనస్సు కుదుట బడిందన్నమాట. సరే, ఇహ నేను వెళతాను, రాధా! ఒంటరిదానివి. వర్షం వెలిసి, వెన్నెల కురువబోతోంది. మనస్సు మరింత వెర్రెత్తి ఆ అబ్బాయి ఒడిలో కెళ్ళి కరిగిపోయేవు సుమా!" అని సుజన నవ్వుకుంటూ టాక్సీలో కెళ్లి చతికిల బడింది.

వెంటనే అక్కడ్నుంచి టాక్సీ కదిలిపోయింది.

సుజన వెళ్ళిపోయాక రాధ వెనుదిరిగి చూసింది. అప్పటికి కూడా ఆ అబ్బాయి గేటువద్దే నిల్చొని తన వైపు తదేకంగా చూస్తున్న దృశ్యం కన్పించింది. ఆమె మనస్సులో తియ్యగా నవ్వుకొని గబగబా మేడ ఎక్కింది. దీపాలు వెలిగించి బాత్ రూమ్‌లో కెళ్ళి ముఖం కడుక్కొని డ్రాయింగ్ రూమ్ కొచ్చింది. ఒటిమీది చీరెను, జాకెట్‌ను తీసివేసి నైట్ డ్రెస్‌కు చెందిన నిలువెత్తు బ్లూగౌన్ తొడుక్కుంది.

తిరిగి బాల్కనీ మీదికొచ్చేసరికి ఎదురింటి అబ్బాయి కిటికీతలుపులు తెరచి అక్కడ యథాప్రకారం సాక్షాత్క రించివున్నాడు. తన రాక గమనించి కళ్ళు పెద్దవిచేసి చూడసాగాడు. ఆ చూపుల్లో-నీలంగౌన్ లో మరుగుబడ్డ తన యవ్వనం ఎక్కడకన్పిస్తుందో చూద్దామనే పిచ్చిఊహ కల్గినట్లుంది.

రాధ చాలాసేపు అక్కడేనిల్చుని - ఆ అబ్బాయి కళ్ళల్లోకి చూస్తూ- అతను వ్రాసిన ఉత్తరాలను జ్ఞాపకానికి తెచ్చుకుంటూ_బీచిలో అతను మాట్లాడిన మాటలు మననం చేసుకుంటూ వుండిపోయింది.

అప్పటికి చాలా ప్రొద్దు పోయిందేమో వీధంతా నిశ్శబ్దంగా వుంది. రోడ్డువెంట జనం ఎవ్వరూ రాకపోకలు సాగించటం లేదు. రెండు గంటలక్రితం కురిసి ఆగిన వర్షంవల్ల చల్లనిగాలి చెంపల్ని తాకుతూ సుఖ స్వప్నాల్లోకి లాక్కెళు

తోంది. ఎంతసేపని తనిక్కడ నిలిచిపోవటం? ఒంటరిగా ఆ అబ్బాయి కళ్ళల్లోకి చూస్తూ, అతనిలో కోర్కెలు రేపే చూపుల్ని వదులుతూ, మానసికంగా - దైహికంగాకూడ తను మథనపడట మెందుకు?

ఆ విధంగా ఆమె తలచి ఆఖరుమారుగా ఆ అబ్బాయి వైపుకి చూసి బాల్కనీమీద దీపం ఆర్పేసింది. ఆ చీకట్లో మెల్లిగా అక్కడ్నుంచి తప్పుకొని బెడ్ రూమ్ చేరుకుంది. పడకను సర్దుకొని దీపా లన్నీ ఆర్పివేసి పడుకొంది.

కాని, ఎంత ప్రయత్నించినా నిద్ర రావటంలేదు. ఆ చీకట్లో కోరికలు రెక్కలు కట్టుకొని తనను ఎక్కడికో తీసి కెళ్ళా లని ప్రయత్నిస్తున్నాయి. ఆ అబ్బాయి చూపులు తనను వెంబడిస్తూ-ఒంటినిండా ప్రాకుతూ-పాపభీతి లేని ఆలోచనలకు దగ్గరిదానిని చేస్తున్నాయి.

ఒంటరితనం - పరిపూర్ణమైన యవ్వనం - గదిలోపల చీకటి-బయట పండువెన్నెల-ఎదురింటి మేడలో మనస్సు హరించే అందగాడు-మోజు కలవాడు-తియ్యగా మాట్లాడ గలవాడు - తనకోసం ఆరాటపడే పడుచువాడు - తనవా రెవ్వరూ లేని ఏకాంతసమయం... అందుకే హృదయం బరు వెక్కుతోంది. కోర్కెలతో సతమత మౌతోంది. ఈ ఒక్క రాత్రి తనా అబ్బాయి కౌగిలిలో వాలిపోతే-ఆ వెచ్చటి కౌగిలిలో కరిగిపోతే- ఆ అందగాడి పెదవులకు పెదవు లందిస్తే-ఎవరు చూస్తారు?...

వెంటనే రాధ పడకమీదినుండి లేచింది. నెమ్మదిగా బాల్కనీ సమీపించి లైటు వేసింది. అప్పటికికూడ ఎదురింటి అబ్బాయి నిద్రపోయినట్లు లేదు. కిటికీగుండా లోపల వెలుగుతున్న లైటుకాంతులు బయటికి ప్రసరిస్తున్నాయి. ఆవిధంగా తనకోసం ఎన్ని అహోరాత్రులు తపస్సు చేస్తున్నాడో! తను బాల్కనీమీదికొచ్చేసరికే లోపల ఏం చేస్తున్నాడో, వెంటనే కిటికీని సమీపించాడు. తను కన్పించిన ఉత్సాహంతో చిరునవ్వు లొలికిస్తున్నాడు.

అప్రయత్నంగా రాధకు నవ్వువచ్చింది. ఆ అబ్బాయి తనకోసం పడుతున్న ఆరాటానుభూతులకు జాలిపడింది. ఎంత అమాయకుడు! తను ఒక్కక్షణం కన్పించకపోతే ఎంతగానో ఆరాటపడుతున్నట్లు చూపులద్వారా కనబరుస్తాడు. తను అతని కళ్ళల్లో కళ్ళుపెట్టి చూడకపోతే దీర్ఘంగా నిట్టూరుస్తాడు. ఆ నిట్టూర్పు తన గుండెల్లోకి దూసుకపోయి ఏదో తెలియని మధురానుభూతుని కలిగిస్తుంది. ఎంత సుందరమైన విగ్రహ మతనిది! ఆ కళ్ళు ఎంత వింతకాంతితో వెలిగిపోతుంటాయి! ఆడదాని పెదవులు తాకని ఆ పెదవులు, చెక్కిళ్లు ఎంత సున్నితంగా వున్నాయో! ఆ అబ్బాయి తనవాడైతే!.. ఊహుఁ! ఏమిటీ ఆలోచనలు? తన మనస్సెయిలా పరుగెత్తుతోం దేమిటి? తన ఆలోచనలు అన్యథా మళ్ళా యేమిటి?

ఏమిటోగాని యీ రాత్రి యింతకుముందు రాత్రుల్లా

లేదు. ఈ రేయిలో మునుపటికన్నా కన్పించని ఏదో క్రొత్తదనంవుంది. గడచిపోయిన అన్ని రాత్రులకన్నా యీరాత్రిలో నిబిడీకృతమైన ఏదో మధురత్వం వుంది. ఇంత మంచి రేయి తన జీవితంలో మళ్ళీ తారసపడుతుందా? ఏమో! గతం తిరిగి రాదు. గడిచే ప్రతిక్షణాన్ని వృథా చేసుకోకూడదు. ఎందుకోగాని ఈరాత్రి తనలో ప్రణయోద్రేకం పొర్లుతోంది. ఈ వెన్నెల—తారకలతో ఆడుకొంటున్న సుధాకరుడు—గత ప్రణయానికి తల లాడించే ప్రేమికులవలె గాలికి అటూ యిటూ వూగే అందమైన లతిలు -- మేడమీది కిటికీవద్ద నిల్చొని ఒళ్లంతా వెయ్యికళ్ళు చేసుకొని చూస్తున్న ఆ అందగాడు—మనోజ్ఞమైన యీ వాతావరణం తనను తీయటి తలపులతో—కోర్కెల బరువుతో ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి.

ఆ రాత్రి ఎంతగా ప్రయత్నించినా రాధ నిగ్రహించుకోలేకపోయింది. జడలోని జాజిమల్లెల గుబాళింపు పరవశురాల్ని చేస్తోంది. నిండుగా కురుస్తున్న వెన్నెల-హృదయంలో క్రొత్త క్రొత్త కోరికల్ని రేకెత్తిస్తోంది. ఒంటికి పూసుకొన్న అత్తర్ల గుబాళింపు నరనరాల్లో తియ్యటి ఆశల్ని జనింపచేస్తూ—మనస్సును ఏవో కన్పించని మధురసీమల్లోకి లాక్కెళుతోంది.

ఆకాశంలోని చందమామను—ఎదురింటి కిటికీవద్ద నిల్చొన్న సుందరుడైన యువకుణ్ణి చూస్తూ ఆమె పర

వశంతో ఊగిపోయింది. ఎదలోని మధురానుభూతులకు ప్రకృతికూడతోడైంది చల్లని అందమైన వెన్నెల-వికసించిన మల్లెల వాసన, ఖరీదైన అత్తర్ల గుబాళింపు-అన్నింటికన్నా మిన్నగా ఎదురింటి అబ్బాయి కోర్కెలచూపులు-అ వన్నీ కలసి ఆమెను మదోన్మత్తురాలిని చేశాయి.

రాధ యిహ భరించ లేకపోయింది. ఏది ఏమైనా యీ రాత్రిలోత నా అబ్బాయి వెచ్చటి శరీరంతో మెలికలు తిరిగిపోవాల్సిందే! తప్పదు! లేకపోతే తను బ్రతక లేదు. క్షణం కూడా శాంతి వుండదు. ఇంత యాతనపడేకన్నా ఆ అబ్బాయి గదికే వెళ్లటం నయం! తను అక్కడికి వెళ్లటం ఇంత రాత్రిలో ఎవ్వరూ గమనించలేరు. ఒకవేళ గమనించినా నైట్ డ్రెస్‌లో వున్న తన నెవరు గుర్తుపట్టగలరు?

అలా అనుకొని రాధ తిరిగి దీపం ఆర్పేసింది. ఆ చీకట్లో మరోమారు ఆ అబ్బాయి కేసిచూసి వెనుదిరిగింది. మేడమీది తలుపులు బంధించి, మెట్లగుండా క్రిందికి దిగసాగింది.

కాని, ఎందుకో గుండెలు ఊరకే దడదడ లాడుతున్నాయి. చేయరానిపని ఏదో చెయ్యబోతున్నట్లుగా ఆరాటపడుతున్నాయి. కాళ్ళు తడబడుతున్నాయి. అడుగు ముందుకు వేసేందుకు శక్తి చాలటంలేదు. క్షణంలో తనలో ఇంత మార్పెలా వచ్చింది? ఆ అబ్బాయివద్దకి చేరుకుందామని తహతహ లాడిన తన మనస్సు-తీరా బయలుదేరాక

ఎందు కిలా పిరికి పడుతోంది? ఏమైంది తనలో! ఏ దుష్టశక్తి ప్రవేశించింది? ఆశించిన దాన్ని పొందేందుకు అడుగు ముందుకు వేసిన తనను వెనక్కి నెట్టుతోం నేమిటి? తను నేరం చేస్తోందా? లేదే! తన తృప్తికోసం- ఆనందంకోసం- తనకై ఆరాటపడి వాంఛతో సతమత మౌతున్న ఓ యువకుని దగ్గరకు పోతోంది. ఇది తప్పా? నేరమా? నరాల ఆకలి తీర్చుకోవటం దోషమా? వాంఛించిన వాడి కౌగిలిలో కరిగి పోవటం ద్రోహమా? ఏది దోషం? ఏది ద్రోహం? ఏదీ తప్పిదం కాదు. తన నిశ్చయమే యథార్థమైనది. తప్పదు- తను తప్పకుండా ఆ అబ్బాయివద్దకి వెళ్లాలి. అతని పెదవులకు పెదవు లందించాలి. ఆ అబ్బాయి వేడినిశ్వాసాల్ని తన గుండెల్లో దాచుకోవాలి.

ఆ విధంగా రాధ ఓ దృఢ నిశ్చయానికి వచ్చి మెట్లు దిగింది. కాంపౌండుగేటు మూసి గబగబా ఎదురింటివైపు నడిచింది. నెమ్మదిగా రోడ్డు బయటవున్న మెట్లగుండా పైకి వెళ్ళి, గది చేరుకుంది. గభాలున తలుపుల్ని త్రోసి లోపలి కెళ్ళింది. ఆ మరుక్షణమే రెండుతలుపులూ మూసి అక్కడే నిల్చుంది.

ఆమె రావటం-తలుపులు మూయటం-అక్కడేనిల్చో వటం గమనిస్తున్న ఆ అబ్బాయి క్షణకాలం నివ్వెర పోయాడు. తను ఎవరికోసమైతే అంతకాలంగా పగటికలలు కంటూ-అనుక్షణమూ తపస్సు చేస్తున్నాడో- ఆ సుందరి-

ఆమెకై ఆమే కరుణించి వచ్చింది. ఎదురుగా చిరునవ్వులు చిమ్ముతూ, ఠీవిగా నిల్చొనివుంది. ఆ కనుల్లో దేవలోకాలు కన్పిస్తున్నాయి. ఆ ముఖంలో రతీదేవి లాస్యం చేస్తోంది. ఆ అంగసౌష్టవంలో ప్రకృతి నాట్యం చేస్తోంది.

అతను నెమ్మదిగా అడుగులో అడుగు వేస్తూ ఆమెను సమీపించి-కళ్ళల్లో కళ్ళుపెట్టి చూడసాగాడు.

రాధ సిగ్గుపడింది. చివాలున ప్రక్కకు జరిగింది. ఆ అబ్బాయికూడ ఇటు తిరిగి-యధాలాపంగా ఆమె నయన గోళాల్లోకి చూడసాగాడు.

"ఎందుకలా చూస్తావ్?" అ నడిగిం దామె.

బదులు చెప్పలే దతను.

"ఓయ్, నా కళ్ళల్లో ఏముంది?"

"నేను...నిలిచివున్నాను..."

"ప్రక్కకు తప్పుకుంటే చెదరిపోతావ్?"

"తప్పుకోను! కాస్సేపు నన్నలాగే చూడనివ్వు..."

"దేనికి?"

"ఏనాఁ యుగాలనుండి నీ కనుపాపల్లో నా ప్రతి బింబాన్ని చూసుకోవా లని ముచ్చటపడుతూవచ్చాను. ఆ అదృష్టం యీరాత్రి పండింది."

"అయితే......"

"అందినఅదృష్టాన్ని అమాయకంగా జారవిడుచుకోను నేను. తృప్తిగా నీలోకి చూడనివ్వు..."

"చూశావ్ గా! ఇక ప్రక్కకు తప్పుకో!"

"ఉహుఁ! నన్ను శాసించకు. మిలమిలా మెరిసిపోయే నీ కళ్ళల్లోకి- తళతళలాడే నీ బుగ్గల్లోకి తదేకంగా నన్ను చూడనివ్వు. అవునుగాని, యింత అందమైన బుగ్గలు నీ కెందుకు? జామపండులా కొరుక్కు తినేదా!"

"అబ్బ! ఎంత ఆశా నీకు?"

"నక్షత్రాలనుబోలిన యీ నయనాలు దేనికి నీకు? అమృతాన్నందిచే యీ పెదవులు ఎందుకు నీకు?"

"ఊరుకో! అల్లరి చెయ్యకు..."

"కట్టలు తెగి ప్రవహిస్తూ ఉరకలేస్తున్న ఎదలోని నా భావతరంగిణిని ఆపలేవు నువ్వు. అరమోడ్పు కళ్ళతో ఎందుకలా చూస్తావు? వాలుచూపులతో నా గుండెల్ని దేనికలా తూట్లు పొడుస్తావ్"

"................."

"కళ్ళు మూసుకోకు!"

"సిగ్గేస్తోంది..."

"దేనికి?"

"నువ్వలా చూస్తూంటే..."

"సిగ్గెరగని నువ్వు సిగ్గుపడటమా? నా ప్రాణేశ్వరీ, ఇప్పుడైనా చెప్పు, నీ పేరేమో?"

"రాధను నేను..."

"ఓ రాధా! నేనంటే నీకు ప్రేమేనా?"

"ఆహాఁ!"

"నాపై నీకు మక్కువ కల్గిందా?"

"ఊఁ!?"

"ఎన్నాళ్ళకి నాపై చల్లనిచూపు చూశావు! ఈ నాటికి కదా నేను భాగ్యశాలిని..."

రాధ నవ్వుతూ ముందుకు జరిగింది. ఆ అబ్బాయి మరింత దగ్గరగా వచ్చి ఆమె రెండుచేతులూ పట్టుకున్నాడు.

రాధ ఉద్రేకపడింది. ఆ అబ్బాయి ఆమె రెండు చేతుల్ని తన హృదయానికి హత్తుకున్నాడు. ఆతడి స్పర్శకు ఆమె పులకితురాలైంది. మోహంతో పెదవు లందించింది. పెదవులు పెదవులు కలుసుకున్నాయి. కళ్లు మాట్లాడు కున్నాయి. రెండు శరీరాలు ఒకటైపోయాయి.

ఆ అబ్బాయి చాలాసేపు ఆమె నలాగే తన హృద యానికి అదుముకొని నిల్చుండిపోయాడు. అప్రయత్నంగా రాధ అతని కౌగిలినుండి బయటపడి ముందుకు నడిచింది. అత నేం మాట్లాడకుండా ఆమె ననుసరించాడు.

ఆ గదిలో కన్పించిన చిత్రవిచిత్రమైన చిత్తరువులను చూస్తూ ఆమె ఠక్కున ఆగిపోయింది. తన రూపురేఖలనే బోలిన ఒక చిత్రం అర్ధనగ్నంగా అక్కడ పడివుంది. దాని నామె అందుకొని తదేకంగా చూడసాగింది. ఆ చిత్రాన్ని ఎంతసేపు చూసినా ఆమెకు తనివితీర లేదు.

"ఎవరు వ్రాశా రీ చిత్రాన్ని?" అ నడిగింది.

"నేనే!"

"ఈ స్త్రీ ఎవరు?"

"నువ్వే!"

తనే ఆ చిత్తరువులోని స్త్రీ యని ఆమెకూ తెలుసు. కాని, అతని నోటంటే ఆ మాటల్ని వినాలనే కుతూహలంతో ప్రశ్నించింది.

"అర్ధనగ్నంగా చిత్రించావేం? ఆ విధంగా నన్నెప్పుడైనా చూశావా?"

"ఆఁ! నిత్యమూ..."

"ఎక్కడ?"

"నా హృదయమందిరంలో..."

"బాగుంది. నీ హృదయమందిరంలో నే నెలా కన్పించాను?"

"ఊహాసుందరిగా"

"నిజం?"

"నిజమే!" అని నవ్వాడా అబ్బాయి.

ఆ అబ్బాయి చిలిపినవ్వుకు మరింత ఆకర్షించబడి, "నువ్వింతవాడి వని నే ననుకోలేదు" అందామె.

తిరిగి నవ్వాడతను.

"నువ్వు నిజంగా ప్రాణం లేని బొమ్మలకు ప్రాణం పోసే కళాకారుడివి..."

"....................."

"నీ కళారాధన చూస్తూంటే — యింతవరకు నేను గడిపిన బ్రతుకు వృధా అనిపిస్తోంది."

"..................."

"నీ కింతటి గొప్పశక్తిని ఎవరు ప్రసాదించారో?"

"నువ్వే"

"నేనా?"

"ఆఁ!"

"పిచ్చివాడివి. నే నెట్లా ప్రసాదించాను నీకు?"

"నీ వాలుచూపులతో- అందమైన నీ ముఖమండలంతో-పరిపూర్ణమైన యవ్వనంతో-వంపులు తిరిగిన అంగసౌష్టవంతో నాకు ప్రేమపాఠాలు నేర్పి- చిత్రకారుణ్ణి చేశావు."

"నాపై నీ కెందు కింత మోజు కల్గింది?"

"నువ్వు అందగత్తెవి కనుక."

"అంతమాత్రం చేతనే నన్ను ప్రేమించావా?"

"కాదు. నువ్వు నా స్వప్న దేవతవి, నా కల్పనవి..."

"అంటే?"

"నీకు తెలియకుండానే నా కుంచెలో నిలిచి వివిధభంగిమలతో రూపురేఖలు దిద్దుకున్న సుందరివి. అందుకే నువ్వంటే నాకు మక్కువ ఎక్కువ."

"నాలాగ ఎందరో అందగత్తెలు యీ మద్రాసులో వున్నరుగా! వాళ్ళు నీ కుంచెలో నిలువలేదా-?"

"ఊహుఁ!"

"ఎందుకని?"

"కేవలం అందగత్తెనైనంత మాత్రాన అందరూ ఆకర్షింపబడ గలరా?"

"నాలో ఏముందని ఆకర్షింపబడ్డాను?"

"నేను కవిని కాను. అయ్యింటే నా ఎదలోని భావాల్ని విడమరచి చెప్పేవాడిని... మనం వెళ్ళిపోదామా యిక్కడ్నుంచి?......"

"ఎక్కడికి?"

"దివ్యలోకానికి! స్వప్నసీమలోకి! ఎవ్వరూ చేరుకోలేని సరికొత్త సృష్టిలోకి..."

"అక్కడ ఏం చేసుకుంటావ్ నన్ను?"

"నా ప్రాణంలో నిన్ను కలుపుకుంటాను. నా ఆయుస్సును నీకు పంచి యిస్తాను..."

"అంతేనా?"

"నా కుంచెతో తిరిగి నిన్ను సృష్టించి జీవం పోస్తాను-"

"ఊఁ! తర్వాత...."

"నీతో సంధ్యానృత్యం చేయిస్తాను. సాయంసంధ్యగా నిన్ను తీర్చిదిద్దుతాను. అరుణార్ణమైన కొండలమీద పరుగెత్తింపచేస్తాను. గలగలా పారే సెలయేళ్లలో దిగంబరిగా నిన్ను ముంచి తేలుస్తాను. అరమూతలు పడే నీ కనురెప్పలపై ముద్దులవర్షం కురిపిస్తాను. నా హృదయంలో నిన్ను ప్రేమ

నదిగా ప్రవహింప చేసుకుంటాను..."

ఆ అబ్బాయి మాటలు విని క్షణకాలం ఆమె బిడియ పడి గలగలా నవ్వింది.

"నవ్వు! అలాగే గంటల తరబడి నవ్వు. నీ నవ్వు నన్ను ఉత్తేజితుణ్ణి చేస్తోంది. నవ్విప్పుడు సొట్టలు పడిన నీ చెక్కిళ్లు నా గుండెల్ని స్పాంజ్ వలె అదిమి పెడుతున్నాయి. నీ కళ్ళల్లో కన్పించే ఆ వెలుగు నా హృదయంలో ప్రణయ దీపమై ప్రకాశిస్తోంది."

"అమాయకుడివి నువ్వు. పిచ్చి పిచ్చి ఆలోచనలు చేస్తున్నావ్. నువ్విలాగే కేవలం ఊహాలోకాల్లో పరు గెడుతూవుంటే ఏమైపోతావో తెలుసా?"

"నిన్ను గురించి తప్ప యీ ప్రపంచంలో నాకేదీ తెలియదు. ఏమైపోగలనో నువ్వే చెప్పు..."

"పిచ్చివాడి వవుతావు!"

"నీ సౌందర్యాన్ని చూసిచూసి యిప్పటికే పూర్తిగా పిచ్చివాడి నయ్యాను. తిరిగి పిచ్చిపట్టేంత మోతాదు, నా మస్తిష్కంలో లేదే!"

"నవ్వులాటకి మాట్లాడకు. నీ వాళ్లెవరూ యిక్కడ లేరా?"

"నువ్వు తప్ప— నాకీ ప్రపంచంలో ఎవ్వరూ లేరు. నువ్వే నా దైవం; నువ్వే నా సర్వస్వం; నువ్వే నా భాగ్యదేవతవి. నువ్వే నా ప్రాణానివి. ఊపిరివి. నిన్నడిచి

బ్రతకలేను. నీలోనే వుంటాను. నీ కురుల నలంకరించిన మల్లెలుగా నన్ను మంత్రించుకో! నీ జాకెట్‌గా నన్ను తొడుక్కో! చెప్పు... చెప్పు రాధా! ఏం చేసుకుంటావ్, నన్ను?''

''అబ్బ! ఊరుకుందూ! ఏమి టీ వాగుడు? ఎందుకలా ఉద్రేక పడతావ్?''

''ఇది ఉద్రేకం కాదు రాధా! ఇప్పుడు నేను నేను కాను. నా కిప్పుడు రూపురేఖలు లేవు. ఆత్మతోపాటు అవన్నీ నీలో అదృశ్యమైపోయాయ్! నేను నీ వాడి నైపోయాను. నువ్విప్పుడు పీల్చుకునే ఊపిరిని నేనే! నీ జడలో మల్లెల ఆకారంలో నేను వున్నాను. నీ ఒంటికి కప్పుకున్న యీ నీలం గౌనును సైతం నేనే! నీ సర్వస్వంలోనూ నేను వున్నాను. నన్ను చిన్నచూపు చూడకు రాధా!''

''అమాయకుడి వనుకున్నాను- అసాధ్యుడివే! ఈ కవితాధార ఎక్కడ ఒంటబట్టింది?''

''ఇది కవిత్వం కాదు రాధా! నా గుండెల్లోంచి పొంగివస్తున్న పదజాలం. నిన్నూ- నీ కళ్ళల్లో కనపడే నా ప్రతిబింబాన్ని చూసుకోగానే ధారావాహికంగా నా హృదయంలో ప్రవహించిన భావనది యిది...''

''నిజంగా పిచ్చివాడివే! రాయపేట హాస్పిటల్ దగ్గరలోనే వుంది. ఉదయమే చేరి మెదడుకు కాస్త మెడిసన్ పట్టించు...''

"అలా ఆజ్ఞాపించకు రాధా! నీ ఆజ్ఞను నేను పాలించటమే సంభవిస్తే—హాస్పిటల్‌లో మందిచ్చే ఏ నర్సునైనా చూసి-నువ్వే ఆ రూపంలో సాక్షాత్కరించావేమోనని కౌగిలించుకోగలను!"

"పరవాలేదు. దగ్గరలోనే వుంది పోలీస్ స్టేషన్. రెండో కంటికి తెలీకుండా అత్తగారింటికి చేరుస్తారు. ఆ విషయంలో బెంగపడనక్కరలేదు" అని అంతవరకు ఆపుకోనున్న నవ్వు నిక నాపుకోలేక ఆమె ఫకాలున నవ్వింది.

ఆ అబ్బాయికూడ నవ్వకుండా వుండలేక పోయాడు. ఆమెను మరింత దగ్గరగా జరుపుకొని హృదయానికి హత్తుకున్నాడు.

రాధ యిహ భరించలేకపోయింది. ఆ అబ్బాయిని బిగియార కౌగలించుకొని ముద్దులవర్షం కురిపించింది. ఆ అబ్బాయి యీ ప్రపంచాన్నే మరచిపోయి ఆమె ఆలింగనంలో కరిగిపోయాడు.

"...ఇక వదలిపెట్టు నన్ను..." అన్నది రాధ.

"....................."

"నేను వెళతా నిక..."

"అప్పుడే"

"ఊఁ!"

"నువ్వు వెళితే నే నెట్లా బ్రతకను?"

"ఏం?"

ఆ అబ్బాయి బదులు చెప్పలేక తిరిగి ఆమెను కౌగిలించుకున్నాడు. రాధ ముడివిడిన శిరోజాలను వయ్యారంగా చుట్టి-నెమ్మదిగా ఆతని కౌగిలినుండి బయటపడి గౌను సవరించుకుంది.

"నేను వెళ్ళిరానా?" అ నడిగింది తలుపువైపుకు దారితీస్తూ.

"రేపు రావాలి నువ్వు. రాకపోతే చచ్చిపోతాను. నీకోసం వేయికళ్ళతో వేచివుంటాను. తప్పకుండా రావాలి సుమా!"

"ఇంకా మోజు తగ్గలేదా?"

"ఊహుఁ! యుగయుగాలకుకూడ నీపైని మోజు నాలో ఆవగింజంతైనా తగ్గదు. నన్ను నమ్ము..."

"ఎందుకలా బెంబేలు పడతావు? ఇప్పుడు ఎవ్వరు కాదన్నారు నీ మాటల్ని?" అని రాధ గది బయటికి నడిచింది.

ఆ అబ్బాయి గభాలున తిరిగి గదిబయటికి వచ్చి, ఆ చీకట్లో మరోమారు ఆమెను కౌగిలించుకున్నాడు. ఎలాగో ఆమె అతని బిగికౌగిలినుండి బయటపడి - గబగబా అక్కడ్నుంచి కదిలి వెళ్ళిపోయింది.

జీవితంలో ఎన్నడూ పొందని సుఖనిద్రను ఆ రాత్రి పొందిం దామె.

## 6

తెల్లగా తెల్లవారేసరికి 'రాధా! రాధా!' అంటూన్న పిలుపు విని ఉలిక్కిపడి లేచింది. నిన్ననే వెళ్ళిన తన భర్త అప్పుడే తిరిగివచ్చాడేమో నని కంగారుపడుతూ వెళ్లి తలుపు తీసింది. ఎదురుగా సుజన నవ్వుతూ నిల్చున్న దృశ్యం చూశాక మనస్సు కొంతవరకు ఊరట పొందింది.

"ఏమే! యింత ప్రొద్దెక్కినా పడుకున్నావేం? నీకోసం పనిమనిషి వచ్చి గంట అయ్యిందట. తలుపువద్దే కూర్చునివుంది. విశేష మేమిటి?" అని నవ్వింది సుజన.

రాధ ఏం మాట్లాడకుండా లోపలికి నడిచింది. ఆమెతో పాటు సుజన, ఆ వెనకే పనిమనిషి సూరమ్మ లోపలికి ప్రవేశించారు. సూరమ్మ వంటగదిలోకి వెళ్లగానే- రాధ తిరిగి బెడ్‌రూంలోకి వచ్చింది.

సుజనకూడ అక్కడికి వచ్చి— "పలకవేమే! ఇంకా తూగుతూనే వున్నావా?" అనడిగింది.

రాధ పెదవులమీద క్షణకాలం మందహాసం లాస్యం చేసింది.

"నీ కళ్లల్లో ఆ నలు పేమిటి? ముఖ మలా అయ్యిందేం? రాత్రంతా ఆ అబ్బాయిని గురించి కలలు కన్నావా ఏం?"

ఆ అబ్బాయి ప్రసక్తి వచ్చేసరికి రాధ సిగ్గుపడింది. గత రాత్రి తనా అబ్బాయి గది కెళ్ళడం... మొదలైన

దృశ్యా లన్నీ కళ్ళముందు మెదిలి మధురస్మృతులతో పులకితురాలైంది.

"మాట్లాడవేమే! ఏమి టా మాగతనం?"

"అబ్బబ్బ! తెల్లారగానే నీ గోల మొదలైంది! ఏం మాట్లాడమన్నావు?"

"అమ్మో! అమ్మాయిగారికి విసుగుకూడ వచ్చిందన్నమాట! పోనిలే, ఈ దినం మే మంతా కలిసి మహాబలిపురం వెళుతున్నాం. నువ్వు వస్తావా!"

"ఊహుఁ! నేను రాను."

"దేనికో?"

"ఆయన వూరిలో లేడుగా."

"అందుకనే రానంటావు. అంతేనా?"

"మరి......"

"బాగుం దీ వరుస. సాయంకాలానికే తిరిగివస్తాం రావే; ఈలోగా మీ ఆయన ఎలా వస్తాడు"

"ఏమైనాకానీ నేను రాను సుజా! నన్ను ఊరకే విసిగించకు..."

"నిన్ను విసిగించేందుకు నే నేమీ పనికట్టుకొని రాలేదమ్మా! ఇంతకీ నువ్వు రానంటావు. నువ్వెందుకు రావో నాకు తెలుసులే. సరే కాని, యిహ నేను వెళ్ళనా మరి..."

"ప్రొద్దున్నే వచ్చావు, కాస్త కాఫీ అయినా

త్రాగి వెళ్ళు—"

"నీ ఆతిథ్యం నా కేమీ అక్కర లేదు లే. వచ్చేప్పుడు త్రాగే వచ్చాను..." అని సుజన లేచి రాధవద్ద సెలవు తీసుకొని వెళ్ళిపోయింది.

సుజన వెళ్లిపోయాక రాధ ఆమె మనస్తత్వాన్ని గూర్చి ఆలోచించుకుంటూ బాత్ రూమ్‌లో కెళ్ళి స్నానం చేసింది. సూరమ్మ అందించిన కాఫీ త్రాగి- ఆ అబ్బాయి ఏం చేస్తున్నాడో చూద్దామనే తలంపుతో బాల్కనీమీదికి వచ్చింది. అప్పటికే ఆ అబ్బాయి అక్కడ సాక్షాత్కరించి వున్నాడు. ఆ దృశ్యం చూసి రాధ తనలో తాను తియ్యగా నవ్వుకుంది. కాని, అతని కళ్లల్లోకి సూటిగా చూడలేక సిగ్గుతో తల వంచుకుని అర్ధనిమీలిత నేత్రాలతో అప్పు డప్పుడూ చూడసాగింది.

నిన్నటికీ యీ దినానికీ ఆ అబ్బాయి కళ్లల్లో చాలా మార్పు వచ్చింది. నిన్న యిదే సమయంలో తనను చూసిన చూపులు వేరు. ఈ చూపులు వేరు. లోగడ అతని కళ్ళల్లో అమాయకత్వం, జాలి పుట్టిపడేవి. కాని- నేడో! దర్పం, ఠీవి...ప్రపంచమంతా తన స్వంతం అయ్యిందన్న ధీమా కన్పిస్తున్నాయి. ఆశించినది అనుభవాని కొస్తే మగజాతి అంతా యిలాగే మారి పోతుంటుంది కాబోలు!

రాధ ఆ విధంగా ఆలోచించుకుంటూ వుండగా సూరమ్మ అక్కడికి వచ్చి- "మార్కెట్టుకు వెళ్లొస్తా

నమ్మా-" అంది.

"సరే వెళ్ళిరా! నా పర్సులో డబ్బు లున్నాయి. తీసికెళ్ళు-" అంది రాధ.

సూరమ్మ వెళ్ళిపోయాక రాధ తిరిగి ఆ అబ్బాయి వైపుకి తల త్రిప్పి- అతని చిరునవ్వు ముఖంలో కోటి స్వర్గాల్ని చూడసాగింది.

ఎప్పుడు చీకటి పడుతుందా- ఆ అబ్బాయి కౌగిలిలో తనెప్పుడు కరిగిపోదునా అనుకొన్న రాధకు ఆ దినం చీకటి పడేసరికి ఒకయుగం గడిచినట్లనిపించింది. చీకటి పడీపడక మునుపే దివ్యంగా అలంకరించుకొని- ఎవ్వరూ చూడకుండా ఆ అబ్బాయి గది కెళ్ళి తలుపులు మూసింది.

ఆమె రాక కోసం చకోరపక్షిలా ఎదురు చూస్తున్న ఆ అబ్బాయి-ఆమె వచ్చీరాగానే ఒక్క అంగలో సమీపించి వూపిరి సలప నివ్వకుండా గాఢంగా కౌగిలించుకున్నాడు. అతని బలీయమైన వాంఛకు-వేడి స్పర్శకు రాధ సర్వ ప్రపంచాన్నీ మరచిపోయి-మోహంతో పెదవులందించింది. రెండుశరీరాలు ఒక్కటై కొంతకాలం అలాగే నిశ్శబ్దంగా వుండి పోయాయి.

కొంతసేపటికి అతనామెను తన పడకవద్దకు తీసుకెళ్ళి ప్రక్కన కూర్చోబెట్టుకొన్నాడు. ఎందుకోగాని ఆ సమయంలో రాధ అతనిముందు సిగ్గుతో సర్వావయవాలను ముడుచుకొని కూర్చుంది.

"రాధా!" అని దర్పంగా పిలిచాడతను.

అతని సూటైన కళ్ళల్లోకి ఆమె చూడలేకపోయింది.

"ఇటు చూడు రాధా!" తిరిగి పిలిచాడతను.

ఆమె కళ్ళెత్తి క్షణకాలం అతని కళ్ళలోకి చూసి తిరిగి తల దించుకుంది.

"సంపెంగి పువ్వులాంటి నీ యీ ముక్కుపై తళతళా మెరిసి పోతున్న యీ బేసరి ఏ అమరాంగనది రాధా! నువ్వు కట్టుకున్న యీ చీరె ఊర్వశిదా? ఈ జాకెట్, యీ నగలు యివన్నీ ఎవరివి? సామాన్య మానవాంగనవి కావే? చెప్పు రాధా!" అన్నాడతను.

రాధ అతని మాటలతో మరింత సిగ్గుపడింది.

"ఎన్నడూ లేని సిగ్గు యీ నాడు నీలో ఎలా ప్రవేశించింది రాధా! సిగ్గుతో మరింత ఆకర్షణ చూపి నన్ను పిచ్చివాడ్ని చెయ్యాలనుకున్నావా?"

"ఊహు!" అన్నట్లుగా తల త్రిప్పిందామె.

"ఏం, నాతో మాట్లాడకూడదనే నియమంతో వచ్చావా?"

ఈ మారుకూడ ఆమె పలకలేదు. అతను మరింత దగ్గరగా జరిగి, ఆమె కురులను సవరిస్తూ-

"ఇంత చక్కని శిరోజాలను చూస్తుంటే వీటిలో నేను దాక్కొని సదా నిన్ను అంటిపెట్టుకోవాలని పిస్తోంది. నీ జడ నలంకరించిన యీ గులాబీలను చూస్తూంటే- యివే నేనుగా మారి నిన్ను అలంకరించాలని భ్రాంతికలుగుతోంది. ఏం రాధా, పలకవు!" అన్నాడు.

ఆమె నవ్వి వూరకుంది.

"మాట్లాడవేం రాధా! నువ్వు పెదవులు కదిపితే నేను అమృతజీవి నవుతానని వూరకున్నావా?"

"ఊహూఁ!"

"నీ తియ్యనైన మాటలు ఎక్కడ ఆగిపోతాయోనని నేను మాట్లాడటం లేదు..."

"నిజంగానా?"

అతని అమాయకపు ప్రశ్నలకు ఆమె తిరిగి ముసిముసినవ్వు ప్రదర్శించి, లేచింది.

"నేను వెళతా నిక" అంది.

"అప్పుడే?"

"తెల్లవారకముందే వెళ్ళాలి. లేకపోతే ఎవరైనా చూస్తారు. తిరిగి రేపు వస్తానుగా!"

"అంతవరకు నేను బ్రతగ్గలనా!"

"నీ కేవిధమైన ప్రాణహానీ కలగదులే! ఒకవేళ కల్గినా-నే నొచ్చి నిన్ను అమరుణ్ణి చేసుకుంటానుగా!"

"ఇప్పుడే వెళ్ళకు రాధా! నువ్వు వెళతా నంటూంటే నా కెందుకో బాధగా వుంది. నిన్ను విడిచివుండలేను. నన్ను వదలిపోకు..."

"నీ పిచ్చిగాని, ఎప్పుడూ నీదాననే ఎలా అవుతాను?"

"విరహసంద్రంలో పడి కొట్టుకుంటున్న నన్ను-ప్రేమ నౌకలో వచ్చి—ప్రణయ సామ్రాజ్యాధిపతిని చేశావు. నిన్నెట్లా విడిచివుండగలను రాధా?"

"అబ్బ! వూరుకో! ఎప్పుడూ, ఎందుకలా ఉద్రేక పడతావ్? రేపు వస్తాను..."

అని రాధ అతని జవాబుకు ఎదురుచూడకుండా గబగబా అక్కడినుండి వెళ్ళిపోయింది.

ఆ రాత్రికూడా ఆమె సుఖనిద్ర పొందింది—ఒళ్ళు తెలీని మైకంతో ఒరిగిపోయింది. క్రితందివంవలెనే ఎనిమిదిగంటలకుకాని ఆమె నిద్రనుండి లేవలేదు. లేవగానే వెళ్ళి తలుపులు తీసింది. అంతదాక తలుపులవద్దే చతికిలబడి వున్న పనిమనిషి సూరమ్మ లోపలికి వచ్చి, సరాసరి వంట గదిలోని కెళ్ళిపోయింది.

రాధ స్నానాదికాలు పూర్తిచేసుకుని కాఫీ త్రాగుతున్న సమయంలో మేడక్రింద కారొచ్చి ఆగిన శబ్దమైంది. కాస్సేపటికి ఆమె భర్త గదిలోకి ఎప్పటిమాదిరే చిరునవ్వుతో ప్రవేశించాడు. భర్త అంత అకస్మాత్తుగా వచ్చేసరికి రాధాదేవి మొదట్లో కాస్త కంగారుపడినా-ఎలాగో సమాళించుకొని సోఫాలోనుండి లేచింది.

"మెయిల్‌కు వచ్చారా?" అనడిగింది, ఆయనకు ఎదురుగ్గా వెళుతూ.

"ఆఁ!" అని ముక్తసరిగా ఆయన జవాబుచెప్పాడు.

"వెళ్ళిన పని అయ్యిందా?" అని తిరిగి అడిగిందామె.

ఆ ప్రశ్నతో ఆయన క్షణకాలం రాధ కళ్ళల్లోకి చూచి—"వెళ్ళిన పని ఏమిటి? అసలు పని అంటూ ఒకటి వుందనా అక్కడి కెళ్ళింది! ఏదో నలుగురు పెద్దమనుష్యుల పరిచయం లభ్యమౌతుందని వెళ్ళాను కాని..." అన్నాడు.

అసందర్భపు ప్రశ్న వేసినందుకు రాధ తనను తాను నిందించుకుంది. అకస్మాత్తుగా ఆయన రావటంవల్ల కల్గిన కంగారుతో ఆ విధంగా తను ప్రశ్నించటం జరిగింది. ఎందుకో గాని ఆయన కళ్లల్లో కళ్లు పెట్టి చూడలేకపోతోంది తను. ఆయన ఎదురుగా ఒక్క నిముషమైనా నిల్చునేందుకు ధైర్యం చాలటంలేదు. తన హృదయంలోకి ఆయన తొంగిచూసి-ఎక్కడ నిజం కనుక్కుంటాడో ననే ఆరాటం పిశాచంలా పట్టుకుంది. అందుకే ఆమె అక్కడినుండి ప్రక్కకు తప్పుకునేందుకు ప్రయత్నించింది.

"స్నానం చేస్తారా?" అనడిగింది, తల వంచుకునే.

"ఆఁ."

"సూరమ్మా! అయ్యగారికి నీళ్ళు తోడు, స్నానం చేస్తారట!" అని పనిమనిషిని కేకేసి తను డ్రాయింగ్ రూమ్ లోకి జారితీసింది.

ఆ దినమంతా ఆమె సాధ్యమైనంతవరకు భర్తముందు ఎక్కువకాలం గడపక —తన డ్రాయింగ్ రూమ్‌లోనే ఒంటరిగా కూర్చుండిపోయింది. కనీసం బాల్కనీమీది కెళ్ళి ఆ అబ్బాయినైనా చూడలేదు. తను ఆ అబ్బాయిని చూసే ప్రయత్నంలో యీ బాహ్యజగతినే విస్మరిస్తే-పొరబాటున ఆయన ఆ దృశ్యం చూసి నిజం తెలుసుకుంటాడేమో ననే భీతితో ఏకాంతంగానే గడిపిం దామె. ఆ ఏకాంతంలోనే-రాత్రి తానా అబ్బాయిగదికి ఏ విధంగా చేరుకోవాలా

అని ఆలోచించింది. కాని, ఏ విధంగా ఆలోచించినా మార్గం కన్పించలేదు. ఆవే ఆలోచనలతో ఆ దినమంతా సతమత మవుతూ బెంగపడింది.

చివరకు ఏవిధంగానైతేనేం, మామూలుగా చీకటి పడింది. చాలా ప్రొద్దుపోయాక భర్త వచ్చాడు. ఇద్దరూ కలిసే భోజనంచేసి బెడ్ రూం చేరుకున్నారు. ఆయన చాలా దూరం ప్రయాణం చేసిరావటంతో వెంటనే నిద్రాదేవి ఒడిలో ఒరిగిపోయాడు. రాధాదేవికి అదే మంచిసమయంగా తోచింది. ఆ అబ్బాయిమీది ప్రేమతో - తన ఎదలో మారుడు పెట్టే తొందరపాటుతో - విచక్షణాజ్ఞానాన్ని కోల్పోయి - క్షణికసుఖంకోసం - కట్టుకున్న భర్త ప్రక్కన గాఢ నిద్రలో మునిగివుండగా - లేచి దొంగచాటున తప్పటడుగులు వేసుకుంటూ ఆ అబ్బాయి గది చేరుకుంది.

ఆమె రాదేమో నని నిరాశపడివున్న ఆ అబ్బాయి, ఊహించని విధంగా ఆమె సాక్షాత్కరించినందుకు మహదానందభరితుడై, మామూలుప్రకారం ఆమెను చేరుకొని గాఢంగా కౌగిలించుకున్నాడు.

"వచ్చావా! వచ్చావా! నువ్వు రావేమో నను కున్నాను."

"ఎందుకొచ్చిందా అనుమానం?" అ నడిగిం దామె.

"నీ భర్త వచ్చాడుగా?..."

"వస్తే?..."

"అందుకనే రావనుకున్నాను."

"పిచ్చివాడివి. నీ వద్దకి రాకుండా ఎలా వుండగలను? ఎప్పుడు చీకటి పడుతుందా - ఎప్పుడు నీ దగ్గరికి రెక్కలు కట్టుకొని వద్దామా అని ఆరాటపడ్డాను. నాకు తెలియక అడుగుతాను. నువ్వెందు కిలా నన్ను ఆకర్షించుకున్నావు?"

"అదే ప్రశ్న నేనూ నిన్ను అడగాలను కున్నాను. నిన్ను చూడందే బ్రతక లేనని పించింది. ఒక్క క్షణంకూడా నన్ను విడిచి పోకుండా ఇక్కడే వుండిపో!"

రాధ అతని మాటలు విని గాఢంగా నిట్టూర్చింది.

"అదెలా సాధ్యమౌతుంది? నాకు పెళ్లయింది. భర్త వున్నాడు. ఆయన్ను విడిచి నీ వద్దకు వస్తే లోకం ఏ మనుకుంటుంది?"

"ఏ మనుకుంటుంది?"

"ఆ మాత్రంకూడా తెలియని అమాయకుడవా నువ్వు? నేను నీ దగ్గరికి వస్తే యీ లోకం నిందిస్తుంది. కులట అంటుంది. నీతి లేనిది అని ఆడి పోసుకుంటుంది."

"ఊహుఁ! ఎప్పటికీ అలా అనుకోదు. నువ్వింకా పాత కాలంలోనే వున్నావ్! వలచిన వాడిని చేరుకుంది- మన సిచ్చినవాడికి యవ్వన మర్పించింది — భాగ్యశాలి అనుకుం టుం దీ లోకం. నీ కెందు కొచ్చిం దీ భయం—" అంటూ అత నామెను తిరిగి తన హృదయానికి పెనవేసు కున్నాడు.

"నీ చిత్తరువును పూర్తి చేశాను, రా! చూద్దువు

గాని-" అని అత నామెను తను డ్రాయింగ్ రూమ్‌లోకి తీసి కెళ్ళి చిత్రించిన ఆమె చిత్రాన్ని చూపించాడు. అర్ధనగ్నంగా వున్న తన ప్రతిబింబాన్ని ఆ చిత్రఫలకంలో చూసుకొని అతని కళానైపుణ్యానికి అచ్చెరువొందింద-మె.

"నువ్వు కేవలం రసికుడవే ననుకున్నాను. గొప్ప చిత్రకారుడివి కూడా!" అందామె.

"అంతేకాదు. ముమ్ముందు నన్ను గురించి మరింత కూడా తెలుసుకోగలవ్. ఎలా వుందీ చిత్రం...?

"గొప్పగా వుంది. నా గుండెలు పగిలి, ప్రేమ వాహిని పొంగేలా వుంది దీన్ని చూస్తూంటే! నిజంగా యీ చిత్రంలోని సౌందర్యం నాకుందా? లేక నువ్వు రంగులు పూసి- జీవకళ ప్రసాదించావా?"

"అవేవీ కాదు. నిజంగా నిన్నే అక్కడ ముద్రించాను. నీ సౌందర్యం ఎంత గొప్పదో నీకు తెలియదు. నువ్వు నన్నెంత ఆకర్షించుకున్నావో చెప్పేందుకు నాకున్న భాష చాలదు. నిజంగా యీ నాటికి నీతోపాటు నేనుకూడా ధన్యుణ్ణయ్యాను..."

"ఏ విధంగా?"

"నీకున్న యీ సౌందర్యాన్నంతా మూసలో పోసి కరగించి రంగులుగా మార్చి -- నా హృదయమనే కుంచెతో ప్రాణం పోశాను. నీ లాంటి సౌందర్యవతిని రేపటి దినం యావత్ ప్రపంచం చిత్రరూపంలో చూడబోతోంది.

ఇంతటి కళా వైదగ్ధ్యపూరితమైన యీ చిత్రాన్ని యీ దేశ ప్రజలకు అందించి నేను కృతార్థుణ్ణయ్యాను. ఈ నాటికి నా ఆశయం పండింది. ఇహ నాకే చింతా లేదు. ఆశించింది పొంద గల్గాననే నిశ్చింతతో ఎక్కడైనా తృప్తిగా వుండగలను..."

అతని వాగ్ధోరణికి ఆమె ఆశ్చర్యపోయింది. అతని కంఠంలోనూ — మాటల్లోనూ వచ్చిన మార్పును పసిగట్టలేక, అదంతా తనపైని మోహాధిక్యతచేత అతనలా మాట్లాడుతున్నాడని భ్రమించింది. కొంతసేపటికి అతనివద్ద శలవు తీసుకుని నెమ్మదిగా తన గది చేరుకుంది.

రాధ తిరిగి వచ్చేసరికి భర్త యింకా గాఢనిద్రలోనే మునిగివున్నాడు. ఆమె చడీ చప్పుడూ కాకుండా తన పడక చేరుకొని పడుకొంది. కాని, ఎంత ప్రయత్నించినా ఆ రాత్రి నిద్ర పట్టలే దామెకు.

# 8

సూర్యోదయమైంది.

రాధ పడకనుండి లేస్తూనే బాల్కనీమీది కెళ్ళి, యథాప్రకారంగా ఆ అబ్బాయి కిటికీ వద్ద నిల్చున్నాడో లేదోనని చూసింది. కాని, ఆమె ఆశించినట్లు అక్కడి కిటికీ తలుపులు తెరచుకోబడలేదు. ఆ అబ్బాయి యింకా నిద్రపోతున్నాడేమో ననుకొని తనకు తాను సంతృప్తి పరచుకుంది.

కాని, ఆ దినం సాయంకాలం దాక వీలుచిక్కినప్పుడల్లా బాల్కనీమీది కెళ్లి చూసింది. అయినప్పటికీ అక్కడి కిటికీ తలుపులు తెరచుకో బడలేదు. ఆ అబ్బాయి దర్శన భాగ్యం లభించలేదు. దాంతో ఆమె తల తిరిగి పోయింది. మనస్సు అశాంతి పూరితమైంది. గుండెల్లో ఏదో దడ- వెలిబుచ్చలేని ఆరాటం... నిర్వచించలేని ఆవేదన ఆమెను చుట్టుముట్టి మరింత నిస్సహాయురాల్ని చేశాయి.

పూర్తిగా చీకటి పడింది. రాత్రి గడిచిపోయింది. తిరిగి తెల్లవారింది. కాని, ఆ కిటికీ తలుపులు తెరచుకోబడ లేదు! తన ఆశలవాటిక భగ్నమైంది. తన హృదయచోరుడు కన్పించటంలేదు. ఎక్కడి కెళ్లాడు? 'క్షణమైనా నిన్ను విడిచి వుండలేను-' అన్నాడే! అలాంటివాడు కొన్ని లక్షల క్షణాలు తన సౌందర్యాన్ని చూడకుండా- ఎక్కడి కెళ్లాడు? అతని

కోసం-అతని ఒక్క చూపుకోసం-మాటకోసం తన హృదయము తహతహ లాడుతోం దిప్పుడు. ఈ విరహవేదనను ఎలా అనుభవించగలదు?

ఆ విధంగా రాధ ఆ అబ్బాయిని గురించి దీర్ఘంగా ఆలోచిస్తుండగా, పనిపనిపి సూరమ్మ అక్కడికి వచ్చింది. ఆమె నా సమయంలో చూసిన రాధ మనస్సులో తళుక్కున ఏదో ఆశా రేఖ పొడసూపింది. వెంటనే ఆమెను దగ్గరగా పిలిచి —

"సూరమ్మా! నాకో సహాయం చేసిపెడతావా?" అనడిగింది.

"చెప్పండమ్మా!" అంది సూరమ్మ తన మామూలు ధోరణిలో.

"ఇదిగో, ఆ ఎదురింటి మేడ చూశావా? ఆ మేడలో ఓ అబ్బాయి నెలరోజులనుండి వుంటున్నాడు. ఇప్పు డతను అక్కడ వున్నాడో లేడో కనుక్కొని రాగలవా?" అంది.

'అలాగే' నని సూరమ్మ వెళ్ళిపోయి అయిదు నిముషాల్లో తిరిగివచ్చింది. ఆమె ఏం చెబుతుందో నని రాధ ఒళ్లంతా చెవులుచేసుకుని ముందుకు వచ్చింది.

"ఆ గదిలోని మనిషి మొన్న అర్ధరాత్రే గది ఖాళీచేసి వెళ్లాడటమ్మా!" అని తాపిగా చెప్పింది సూరమ్మ.

ఆ మాట వినేసరికి రాధ తలపై పిడుగు పడినంత పనైంది. ఊహించని వర్తమానం తెలిసింది.

"ఎక్కడికి కెళ్ళాడో తెలుసుకున్నావా?" అంది ఎలాగో పొంగుతున్న దుఃఖాన్ని ఆపుకుంటూ.

"ఎక్కడికి కెళ్ళాడో యింటివాళ్లకు తెలియదుటమ్మా! అసలు అత నే ఊరివాడో-పేరేమో కూడా వాళ్ళకు యింత వరకూ తెలియదట. ఉన్న పళంగా మొన్న అర్ధరాత్రి గది ఖాళీచేసి, తాళంచేతులు వాళ్ల కిచ్చి వెళ్లిపోయాడట" అని వివరంగా చెప్పింది సూరమ్మ.

"సరే! ఇహ నువ్వెళ్లు-" అని రాధ గబగబా బెడ్ రూమ్ చేరుకుంది. గభాలున తలుపులు మూసుకొని పడకపై పడుకొని తలగడలో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడ్చింది.

ఆ అబ్బాయి వెళ్లిపోయాడు - తన యవ్వనాన్ని, హృదయాన్ని హరించుకొనిపోయాడు. ఇప్పు డిక తన కేమిటి దారి? తన నంత గొప్పగా సంతృప్తిపరచిన ఆ కళా మూర్తిని తనెలా మరచిపోగలదు? ఇంతకూ అత నెందుకు వెళ్లిపోయినట్లు? అర్ధరాత్రి-ఎవ్వరూ చూడకుండా రహస్యంగా ఎందు కెళ్ళాడు. తనతో ఎన్నో మాటలు చెప్పాడే! అవన్నీ తనను వంచించేందుకు పలికాడా? తనను నయవంచన చెయ్యటంవల్ల అతని కొచ్చే ప్రయోజన మేమిటి?

రాధాదేవి ఆ విధంగా పూర్తిగా బేలమనస్కురాలై తనలో తాను కుమిలి కుమిలి ఏడ్చింది. చాలా ప్రొద్దుపోయాక భర్త వచ్చి తలుపు తట్టేవరకూ ఆమె యీ సర్వ

ప్రపంచాన్నీ మరచిపోయి, ఆయన పిలుపుతో తిరిగి బాహ్య ప్రపంచంలోకి వచ్చి —తన కన్నీళ్లను, ఆవేదను భర్త గమనించకుండా వుండేందుకు శతవిధాలా ప్రయత్నిస్తూ వచ్చి తలుపు తీసింది.

సాయంకాలం అయిదుగంట లైంది.

రాధాదేవి మళ్లీ బాల్కనీమీది కొచ్చి, ఎదురింటి మేడ మీదికి దృష్టి నిల్పింది. అక్కడి కిటికీతలుపులు బంధించబడే వున్నాయి. తిరిగి నిరాశ చెంది నిట్టూర్చింది.

గత మూడురోజులనుంచీ ఆ కిటికీతలుపులు తెరచుకోబడలేదు. అక్కడ ఎల్లప్పుడూ నిల్చొని తనకై ఎదురు తెన్నులు చూసే అందమైన ఆ అబ్బాయి దర్శనభాగ్యం కల్గటంలేదు. ఎక్కడి కెళ్ళాడో, ఏమైపోయాడో? తనకు మాటైనా చెప్పకుండా వెళ్ళాడు. కనీసం ఉత్తరం ముక్కయినా వ్రాశాడుకాదు.

ఛీ-ఏం మనుష్యులో! అవసరం తీరేదాక సవాలక్ష కబుర్లు చెబుతారు. పడరాని పాట్లు పడతారు. ఆ అవసరం కాస్తా తీరాక మొహం మొత్తి యిటు వైపేనా కన్నెత్తి చూడరు. పలకరించినా ముభావంగా వుంటారు. తప్పించుక తిరుగుతారు. ఏం హృదయముమ్మా యీ మగవాళ్లది!

ఈ మగరాయుళ్లు యింతగా ప్రవర్తించినా అదేంఖర్మమో ఆడవాళ్ళకు వాళ్లపై ఆవగింజంతైనా మోజు తగ్గదు. వాళ్ళు తమనుండి దూర మయ్యేకొద్దీ-వాళ్ళకోస పడిచస్తారు.

"నువ్వు అందకత్తెవు కావు—" అంటే, అవు నని ఒప్పుకుంటారు.

"నిన్ను తన్న బుద్ధేస్తోందంటే-" 'ఊఁ! కానియ్' అంటారు.

"నాకు సిగరెట్లు కావాలి. కొనుక్కొచ్చిపెట్టు——" అంటే, అంతఃపురం నుండి ఎండమొఖ మెరుగని ఆడవాళ్ళు కూడా — 'అలాగే తెస్తా'మని బయలు దేరుతారు.

కన్నీళ్ళవర్షాన్ని హృదయంలోనే కురిపించుకొని, ఆ బరువునలాగే యావజ్జీవితం భరిస్తుంటారు. వాళ్ల రాకకోసం చకోరపక్షిలా ఎదురు చూస్తారు. వచ్చేవరకు తిండితినకుండా అర్ధరాత్రిదాక పస్తులు వుంటారు. వచ్చాక, వాళ్లు తినగా మిగిలింది తింటారు. లేకపోతే-తినకపోయినా తిన్నట్లే నటిస్తారు. పడుకోమంటే పడుకుంటారు. లెమ్మంటే లేస్తారు.

మగవాళ్ళ చేతుల్లో ఆడవాళ్ళ జీవితాలకి ఎంత దుర్దశ పట్టిందమ్మా!——

ఇప్పుడు తన గతి ఏమైంది? అన్నివిధాలా అధఃపతనమైంది. ఆశించిం దొకటి. జరిగింది మరొకటి. ఆ అబ్బాయి తన హృదయంలో శిశిరవసంతాలు కురిపించినట్లే కురిపించి-అగ్నిభాండం పేల్చాడు. తీరని ఆవేదనకు, ఆరాటానికి లోనుచేశాడు. ఒక్క-క్షణం అతను కన్పించకపోతే బ్రతకలేని మానసిక బలహీనురాల్ని చేశాడు.

అతను లేకపోతే తను ఎట్లా బ్రతగ్గలదు? ఇంతకీ అతను ఎక్కడికెళ్ళినట్లు? ఏమైపోయినట్లు?తన నింత విరహావేదనకు లోను చేసి వెళ్లటంలో అతని అభిప్రాయ మేమిటి?

తనను చూడకుండా ఒక్క క్షణమైనా బ్రతకలేనన్నాడే! 'నన్ను విడిచి పోకు' అని కన్నీళ్ళవర్షం కురిపించాడే! అంత గాఢమైన ప్రేమను వెలిబుచ్చిన అతను చెప్పకుండా ఎందు కెళ్ళాడు? తన అవసరం తీరేదాకా కల్లబొల్లి కబుర్లు చెప్పి మాయచేశాడా? అవసరం కాస్తా తీరాక పలాయన మంత్రం పఠించాడా? అదే నిజమయితే తనెలా భరించగలదు? తన కిక దారి ఏమిటి? నిర్జీవంగా యిలా బ్రతకవల్సిందేనా? గత మధురస్మృతులను తలచుకుంటూ తనలో తాను కుమిలి పోవాల్సిందేనా? చివరకు తన బ్రతుకు ఎంత హీనంగా దిగ జారిపోయింది?

ఆ విధమైన ఆలోచనలతో సతమతమవుతూ రాధ బాల్కనీనుండి వెనుదిరిగి, హాల్లోని సోఫాలో చతికిలబడి, తిరిగి ఆ అబ్బాయిని గూర్చి-అతను తనకు వ్రాసిన ఉత్త రాలను, చెప్పిన మాటలను జ్ఞాపకానికి తెచ్చుకోసాగింది.

రాధ ఆ అబ్బాయిని గురించిన ఆలోచనల్లో మునిగి వుండగా సుజన గబగబా లోపలికి వచ్చింది. వచ్చీ రాగానే రాధ ముఖకవళికల్ని గమనించి, తనెంత ఉత్సాహంగా వచ్చిందో అంత నిరుత్సాహ పడింది. నెమ్మదిగా ఆమెను సమీపించి భుజం తట్టి పిలిచింది.

కాని, రాధ తిరిగి చూడలేదు. ఆ వచ్చిం దెవరో తెలుసుకోవాలనే ధ్యాసైనా కల్గలేదామెకు. మూర్తీ భవించిన శోకదేవతలా కూర్చొనివున్న ఆమెను చూసి సుజన

లోలోన బాధపడింది.

"రాధా! నేను వచ్చానే—"అంది ముందుకు వచ్చి.

రాధ ఏం పలకకుండా సుజన కళ్ళల్లోకి క్షణకాలం చూసి తిరిగి తల దించుకుంది.

"దేనికే అలా వున్నావ్?" అనడిగింది సుజన మళ్ళీ.

"ఏమీ లేదు...ఊరకే..." అని తడబడుతూ సమాధాన మిచ్చింది రాధ.

"వూరకే ఏమిటి? ఏదో జరిగివుండాలి. లేకపోతే, నీ ముఖం ఎందుకట్లా వాడిపోతుంది? ఉదయంనుండి ఏడ్చావా? కళ్ళు ఎరుపెక్కి వున్నాయేం?"

రాధ ఏం మాట్లాడలేక శుష్కహాసం చేసి వూరకుంది.

"ఏమిటే! నాతో చెప్పరానంత రహస్యమైనదా నీ బాధ?"

"వూరుకోవే! గాయపడ్డ నన్ను మరింత గాయపరుస్తావెందుకు?"

"నేను నీ మానసిక గాయాన్నేమీ కెలికేందుకు రాలేదమ్మా! నీ బాధ నాతో చెప్పుకొని కొంతవరకు రిలీఫ్ పొందమంటున్నాను. ఆ అబ్బాయిని గురించేనా కలత పడుతున్నావ్?"

తిరిగి అ అబ్బాయి ప్రస్తావన వచ్చేసరికి రాధ గతుక్కుమంది. ఆమె ముఖం వెనువెంటనే నల్లబడింది. కళ్ళనీళ్ళ పర్యంతమై ఎలాగో సమాళించుకొని ముఖం

చాటు చేసుకుంది.

"చెప్పవే! ఎందుకట్లా ఏడ్పును దిగమింగుకుంటావు? ఎప్పుడూ చిరునవ్వులు చిందిస్తూ అక్కడ నిల్చొనే ఆ అబ్బాయి యీ రోజు కన్పించడేం? ఆ కిటికీ తలుపులు మూసి వేశారేం? ఏం జరిగింది?"

"అతను వెళ్లిపోయాడు."

"ఎక్కడికి?"

"ఏమో!"

"బాగుంది. నీ కోసం బెంగపడి యిక్కడ్నుంచి పారిపోలేదు కదా!"

"బెంగపడ్డది నేను; అతను కాదు."

"సరి. సరి. అనుకున్నంతా అయ్యిందన్న మాట. నేను ముందే చెప్పానుగా; సమయం జారవిడుచుకున్నాక బాధపడతావని. ఇప్పుడైనా తెలిసివచ్చిందా?"

"ముందు నీ నోటికి తాళం వేసుకో! ఇదంతా నువ్వు చేసిన పనే! నీ మూలంగానే నేనింతగా బాధపడుతున్నాను. నీ మాటలు విని ఆ అబ్బాయికి శరీరాన్ని, హృదయాన్ని అర్పించాను. అవసరం తీరాక, మోజు తగ్గాక అతను, తన దారింట తాను వెళ్ళిపోయాడు. ఇప్పుడు నాకు తప్పింది కాదీ దుఃఖం..." అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుందామె.

అప్పటికి సుజన పరిస్థితినంతా ఆకళించుకొని - రాధ బేలతనానికి దిగులు పడింది. "ఊరుకోవే! ఎందుకట్లా

ఏడుస్తావ్? గతించినదన్ని గూర్చి దుఃఖపడకు...'' అని అనునయవాక్యాలు పలికింది.

రాధ ఆమె మాట లేవీ విన్పించుకోలేదు. వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

''ఇదుగో, యిటు చూడవే! నీ కేమైనా పిచ్చి పట్టిందా? ఒకటి రెండు దినాల పరిచయంమూలంగా నే యింతగా బాధపడితే ఎలా? అమాయకురాలివి! ఈ సంగతి నీ భర్తకి తెలిస్తే ఏమాతుంది? తెలిసి తెలిసీ నీ జీవితాన్ని నాశనం చేసుకోకు! అయిం దేదో అయిపోయింది. గుట్టు చప్పుడు కాకుండావుండు-ఏం, తెలిసిందా?''

''ఈ శ్రీరంగనీతులు నావద్ద వల్లించకు సుజా! నా హృదయం ఎంతగా గాయపడిందో నీ కేం తెలుసు? నే నెంతగా కుమిలిపోతున్నానో నీ కెట్లా అర్థ మవుతుంది? అతన్ని నేనెంత గాఢంగా ప్రేమించానో నువ్వెట్లా తెలుసుకోగలవ్?''

''అయితే యిప్పుడు నువ్వు చెయ్యగల్గిం దేమిటి? ఈవిధంగా ఏడుస్తూకూర్చుంటే నలుగురూ ఏమనుకుంటారు?''

''ఎవ రేమనుకుంటే నా కే మిక?''

రాధ ఆ విధంగా మాట్లాడేసరికి సుజన యిహ ఏమీ చెయ్యలేకపోయింది. ఆమె మనస్సు మనస్సులో లే దని-ఆ సమయంలో త నేం మాట్లాడినా ప్రయోజనం వుండబో దని గ్రహించి మిన్నకుంది.

రాధ చాలసేపు అలాగే ఏడ్చి ఏడ్చి సోఫాలో

ఒరిగిపోయింది.

"వెళ్ళి ముఖం కడుక్కో, మీ ఆయన వచ్చే వేళయింది. ఈ స్థితిలో నిన్ను చూశాడంటే గొడవవుతుంది.." అంది మెల్లగా సుజన.

రాధ ఏం మాట్లాడకుండా లేచి, బాత్‌రూంలో కెళ్ళి ముఖం కడుక్కొని వచ్చింది.

సుజన యిహ తనక్కడ ఎక్కువసేపు వుండటం బాగుండదనుకుంది. తనక్కడ వుండటంవల్ల రాధ వూరకే బాధపడవచ్చుకూడా అనుకుని, సోఫాలోనుండి లేచింది.

"నేను వెళుతున్నాను రాధా! ఊరకే దిగులుపడి కృంగిపోకు. జీవితంలో ఎప్పుడూ వెనక్కి తిరిగిచూడకూడదు. ఈలాంటి సంఘటనలు ఒక్కొక్కరి జీవితంలో ఒకోసారి సంభవిస్తుంటాయి. ఈ ఆటుపోటుకు నిలబడగలిగే స్థయిర్యం లేనివారు పతనమైపోతారు. అయినా మగవాళ్ళను నమ్మి-వాళ్ళను గొప్పగా ప్రేమించటం స్త్రీజాతిదే తప్పు. వాళ్ళ వలె మనమూ అవసరాలకోసం ఏ ఎండ కా గొడుగు పడు తుండాలి" అని సుజన రాధవద్ద సెలవుతీసుకొని అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

సుజన వెళ్లిపోయాక రాధ ఆమె మాటల్ని గురించి తనలో తాను తర్కించుకుంది. సుజన ఆశయాలు వేరు; తన ఆశయాలు వేరు. ఆమెకూ తనకూ చిరకాలస్నేహ మున్నా-యిద్దరి ఆశయాలూ ఏనాడూ ఒకటవలేదు. ఆమె

మనః ప్రవృత్తికి తన ప్రవృత్తికి శతయోజనాల దూరంవుంది.

తను ప్రేమించగలదు. ప్రేమించిన వాడి కోసం బాధపడగలదు. కాని, సుజన తామరాకుమీద నీటిబొట్టు లాంటిది. అవకాశం దొరికినప్పుడు, అవసరం కల్గినప్పుడు-ఎటుపడితే అటు పోతుంది. ప్రేమించటం ఆమెకో ఆట వంటిది. ఎవరినిపడితే వారిని క్షణాలమీద ప్రేమిస్తుంది. అలాగే వాళ్లని నిమిషాలమీద విడిచిపెడుతుంటుంది. కనుకనే తన యెడ అంత తేలిగ్గా మాట్లాడగల్గింది!

ఆ విధంగా ఆమె చాలాసేపు ఆలోచించుకుంటూ కూర్చుంది. అంతలో బయట కారాగిన చప్పుడైంది. భర్త వస్తున్నాడేమో నని, తనముఖంలో విచారచ్ఛాయలు కన్పించకుండావుండేందుకు ప్రయత్నించింది.

కాని, ఆమె ప్రయత్నం పూర్తవకమునుపే ఆయన వచ్చాడు. వచ్చీరాగానే ఆమె చేతిలో మల్లెపూలదండ పెట్టి- "అదేమిటి రాధా! ఇంకా స్నానం చెయ్యలేదా? టయిమైంది" అన్నాడు.

అప్పటికి ఆమెకు గుర్తువచ్చింది. ఉదయం ఆయన బయటికి వెళుతూ, గోల్డెన్ స్టుడియోలో-క్రొత్తగా రిలీజ్ కాబోతున్న పిక్చర్ ప్రీవ్యూకు వెళదామని చెప్పాడు. ఇంత దాక తన కా విషయమే గుర్తురాలేదు.

"లేలే! త్వరగా ముఖమైనా కడుక్కో, బయట కారు సిద్ధంగా వుంది" అన్నాడాయన తిరిగి.

ఈలాంటి స్థితిలో తనా సినిమాను చూసి ఏ విధంగా సంతోషించగలదు? "మీరు వెళ్లండి. నేను రాలేను" అంది రాధ, ఎలాగో ధైర్యం చేసి

"ఏం, ఒంట్లో బాగా లేదా?" అనడిగాడు, నివ్వెర పోయి.

"ఊహుఁ!"

"మరి?"

"ఏమీ లేదు. ఈసారికి మీరొక్కరే వెళ్ళిరండి."

ముక్తసరిగా ఆమె యిచ్చిన సమాధానం విని ఆయన, యింకేమీ ప్రశ్నించకుండా, అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు. కొంతసేపటికి బయట కారు స్టార్ట్ అయిన శబ్దమైంది.

భర్త వెళ్ళిపోయాక తిరిగి రాధ బాధపడింది. ఈయన ఎంత మంచివాడు. తనంటే ఎంత ప్రేమ యీయనకు! తన నింత గొప్పగా ప్రేమిస్తున్న వ్యక్తిని మోసగించి, దగా చేసి వెళ్ళిన ఆ అబ్బాయికోసమా తను వ్యథ చెందుతున్నది? పెళ్ళయిన యీ మూడుసంవత్సరాల్లో ఏనాడూ తను ఆయన మాటకు ఎదురుచెప్పలేదు. అలాంటిది నేడు జరిగింది. ముందు యిహ ఏం జరుగబోతుందో!

ఆ రాత్రి ఆమె భోజనం చెయ్యలేదు. ఆలోచనల భారంతో అలాగే సోఫాలో కూలిపోయివుండగా, చాలా ప్రొద్దుపోయాక భర్త వచ్చాడు. ఆయన మామూలుగా తన గదిలో కెళ్లి డ్రస్ మార్చుకొని తిరిగి హాల్లోకి వచ్చాడు.

తప్పనిసరి అవటంవల్ల రాధ లేచి ఆయన్ను భోజనానికి పిలిచింది.

"స్టుడియోలో డిన్నర్ యిచ్చారు రాధా! నేను భోజనం చేశాను. నువ్వింకా తినలేదా?" అ నడిగాడు ఆయన.

తను భోజనం చెయ్యలేదని చెబితే ఆయన బాధ పడతాడేమో నని, తినకపోయినా తిన్నట్లే అబద్ధం చెప్పిందామె. కాని, ఆయన ఆమె ముఖకవళికల్ని గమనించి యింకా భోజనం చెయ్యలేదనే గ్రహించాడు. ఆమె దగ్గరగా వచ్చి-"రాధా!" అని పిలిచాడు.

ఆమె యిటుతిరిగి ఆయన కళ్ళల్లోకి చూసింది.

"ఒక్క మాట అడగనా? ఎందు కలా వున్నావ్?"

బదులు పలకలే దామె.

"ఒంట్లో బాగా లేదా ఏమిటి?"

"..................."

"నీ కళ్ళల్లో నీ ళ్లేమిటి రాధా?"

ఆయన ప్రశ్నలకు ఆమె సమాధానం చెప్పలేక, పొంగివస్తున్న దుఃఖానికి ఆనకట్టలు కట్టుకోసాగింది. కాని, అందులో సఫలీకృతురాలు కాలేకపోయింది.

"ఏమిటి రాధా! దేనికి ఏడుస్తున్నావ్? ఏమైంది?" తిరిగి అడిగాడు ఆయన.

ఆమె ఏం పలకకుండా వెక్కి వెక్కి ఏడుస్తూ-

అక్కడ్నుంచి ప్రక్కకు తప్పుకొని తనగదిలో కెళ్ళిపోయింది. ఆయనకు రాధ ప్రవర్తనలో వచ్చిన మార్పుకు కారణ మేమిటో బోధపడలేదు. గాఢంగా నిట్టూర్చి ఆమెను అనుసరించాడు.

రాధ పడకపై పడుకొని కన్నీరు మున్నీరుగా ఏడ్వ సాగింది. తలగడలో ముఖం దాచుకొని ఏడుస్తున్న ఆమెను చూసి జాలిపడ్డా డాయన. ఆమె ప్రక్క కూర్చొని తల నిమురుతూ– "తప్పు రాధా! ఘోరకే గుండెలు పగిలేలా ఏడ్వకు. నువ్వేం తప్పిదం చేశావని యింతగా ఆరాట పడుతున్నావు?" అన్నాడు.

"................"

"గత రెండురోజులనుండి అకస్మాత్తుగా నీలో గొప్ప మార్పు వచ్చింది. ఎందుకలా బేలమనస్కురాల వయ్యావు."

"నన్నేమీ ప్రశ్నించకండి. నా మన స్సేమీ బాగోలే దిప్పుడు."

"అందుకే అడుగుతున్నాను. నీ హృదయం గాయ పడేటంత గొప్ప తప్పిదం నా మెడ ఏమైనా జరిగిందా?"

"ఉహుం!"

"మరి, దేని కింతగా మధన పడుతున్నావు?"

"ఒరులకు చెప్పరానిది నా బాధ..."

"నాకు సైతం చెప్పరానంత బాధను అనుభవిస్తు న్నావా? నిన్నెవరైనా ఏమైనా అన్నారా? తెలిసో

తెలియకో నేనేమైనా నీ మనస్సు కష్టపెట్టానా? చెప్పు రాధా, ఎందుకలా వున్నావు?"

"ఊరుకోండి! నా యెడ మీ రెందుకింత సానుభూతి చూపుతారు? మీ రెంత విశాల హృదయులైనా-నా యందు జాలి చూపకూడదు. మిమ్మల్ని వంచించాను నేను. నేను దోషిని. నాతో మాట్లాడకండి" అంటూ ఏడ్చిందామె.

అత నామెను మరింత దగ్గరగా తీసుకొని, చెదరిపోయిన ముంగురుల్ని సవరించాడు. "పిచ్చిదానా! ఎందుకలా ఉద్రేకపడతావు! నువ్వు తప్పిదం చేశావని — అది క్షమించరాని దని దేనికి తలపోస్తున్నావు? పరిసరానుగుణ్యంగా అవసరం నిమిత్తం ఎంతటి వారైనా పొరబాట్లు చెయ్యకపోరు. అంతమాత్రంచేత మనంయితరుల్ని వంచించామని అనుకోవటం దేనికి? ఇంతకీ జరిగిం దేమిటో చెప్పు..." అన్నాడు.

"ముఖస్తంగా చెప్పలేను. నన్ను మన్నించండి..." అంటూ ఆమె అక్కడ్నుంచి లేచి గదిబయటికి నడిచింది.

ఆయనకు ఆమె మనఃప్రవృత్తి ఏమిటో— ఎందుకలా బేలగా దుఃఖిస్తోందో అర్థం కాక చకితు డయ్యాడు.

# 10

ఆ రాత్రికూడా ఆమె కంటికి రెప్పల్ని దూరం చేసుకుంది. ఉదయంనుండీ భోజనం చెయ్యలేదేమో చాలా నీరసపడింది.

ప్రక్కన భర్త గాఢంగా నిద్రపోతున్నాడు. పాపం, అమాయకుడు. ఆయన కేం తెలుసు-తన హృదయాఘాటం? తను ఎంతగా తపన చెందుతోందో ఆయనేవిధంగా తెలుసుకోగలడు?

తనకోసం జాలిపడగలడు-దేనికి? తనను ప్రేమిస్తున్నాడు కనుక. కాని. తన హృదయావేదన గుర్తిస్తే సహించగలడా? తన స్వాంతం మరొకరిని చేరుకుందని తెలిసి భరించగలడా? ఏమో, ఆయనది వింతైన మనఃప్రవృత్తి!

ఏది ఏమైనా తను ఓడిపోయింది. మనస్సును నిగ్రహించుకోలేక, ఆ అబ్బాయి మోహంలో పడి పిచ్చిదయ్యింది. తను మళ్ళీ మామూలుమనిషిగా ఎప్పుడు తయారయ్యేది? ఊహుం! తనిక మామూలువ్యక్తి కాలేదు, తన హృదయం ఆ అబ్బాయివెంటనే వెళ్ళిపోయింది. కేవలం ఆ వేదనతోనే తను మిగిలిపోయింది. తనకిక శాంతి లేదు. తను యీ పరిసరాల్లో యిక ఒక్క క్షణమైనా వుండలేదు. ఆ ఎదురింటి మేడను ఎవరైనా నేలమట్టం చేస్తేనైనా బాగుంటుంది. పిచ్చి ఊహ! ఆ మేడనే కాదు, తననుసైతం నాశనం చేసినా—ఆ అబ్బాయిని గురించిన ఆలోచనలు తననుండి విడిపోగలవా? ఆ అబ్బాయి చిరునవ్వు మాయని

ఆ ముఖం తన గుండెల్లో నిలిచి—'నేను వెళ్లిపోయాను. నన్ను వెతుక్కుంటూ రా!' అని పిలుస్తున్నట్లుంది. త నెట్లా మరచిపోగలదు ఆ అబ్బాయిని? తను యిక్కడినుండి వెళ్ళిపోవాలి. ఆ ఎదురింటి మేడ కన్పించని మరో కొన్ని యోజనాల దూరం వెళ్ళిపోవాలి. లేకపోతే తనిక్కడ, యీ ఆలోచనల వలయంలో పడి కుల్లిపోగలదు.

ఆ విధమైన ఆలోచనలతో చివరకు ఆమె ఒక నిర్ణయానికి రాగల్గింది. బయట జినజిన మని వర్షం కురుస్తోంది. ఆకాశంలో అప్పుడప్పుడు మెరుస్తున్న మెరుపుకాంతులు గదిలో పడుతున్నాయి. గాడ్పుకు అటూఇటూ వూగుతున్న కిటికీరెక్కలను మూసివేసి- బల్లసొరగులో నుండి కాగితం, కలం తీసుకుంది. మనస్సును చిక్కబట్టుకొని భర్తకు ఆఖరి ఉత్తరం వ్రాసేందుకు వుపక్రమించింది.

"................"

"గత నాలుగురోజుల నుండీ నాలో వచ్చినమార్పును మీరు గమనించారు. నే నెందు కలా విచారవదనంతో వున్నానో-దేనికోసమై ఆరాటపడుతున్నానో తెలుసుకోలేక-నా బాధ ఏమిటో బయటికి చెప్పుకొని కొంతమటుకైనా వూరట పొందమన్నారు. నిజంగా నా బాధఏమిటో విన్నాక మీరు బాధపడతారు. ఒరులకు చెప్పరానిది నా బాధ...

"మీయెడ నేను ద్రోహం చేశాను. మీ మంచి తనాన్ని అన్యథా వినియోగించుకున్నాను. ఒక్కొక్కప్పుడు

తమవాళ్ళ మంచితనం వాళ్ళ వాళ్ళ జీవితాల్ని విచ్ఛిన్నం చేస్తుంటుంది. అలాగే మీ మంచితనంవల్ల నే నీనాటికి యీస్థితికి దిగజారిపోయాను. ఈ విధంగా నా బాధను వెలిబుచ్చేందుకు ప్రయత్నిస్తున్నందుకు నన్ను గురించి మరోలా భావించకండి.

"నేను ప్రతిక్షణం బాల్కనీమీంది కొచ్చి నిల్చునేదాన్ని. దూరంగా కన్పించే నీలాకాశంలోకి–లైట్‌హౌస్ కాంతుల్లోకి చూస్తూ నిల్చొనివుంటున్నా నని మీరు తలపోసేవారు. కాని, నే నా అబ్బాయిని చూసేందుకే అక్కడ నిల్చునేదాని నని గ్రహించలేకపోయారు. ఒకటి రెండుమార్లు ఆ అబ్బాయినిగురించి నేను నిందావాక్యాలుపలికాను. కావలిసే నే నా విధంగా అతన్ని మీముందు నిందించా నని గుర్తించలేకపోయారు. ఆ అబ్బాయి మధ్య - నా మధ్య సాగుతున్న చూపుల కలయికను మీరు గమనించారేమో ననే భ్రాంతితో నే నా విధంగా ప్రవర్తించటం జరిగింది.

"ఏది ఏమైనా నే నా అబ్బాయిని గాఢంగా ప్రేమించాను. పరిస్థితుల ప్రాబల్యానికి లొంగిపోయో–మానసిక దుర్బలురాల నయ్యో–నాకోసం ఆ అబ్బాయి పడుతున్న బాధను చూసి భరించలేకో–స్త్రీ సహజమైన జాలి నాలో వుండటంవల్లో–అతడితో సంబంధబాంధవ్యాలు కల్పించుకున్నాను.

"నా కా అబ్బాయితో సంబంధ ముం దని మీరు

తెలుసుకున్నప్పటికీ– విశాల హృదయులు కనుక నన్ను క్షమించగలరని తెలుసు. కాని, మీ మంచితనం యీ సంఘానికి అక్కర్లేదు- ఈ నా కృత్యంవల్ల మిమ్మల్ని చిన్న చూపు చూస్తుంది. మీ గౌరవ మర్యాదలను మంటగలుపుతుంది. బయట తలెత్తుకోకుండా చేస్తుంది. వ్యక్తిగతంగా నాకు చెందిన యీ విషయాన్ని సైతం మీపై రుద్ది నానా అల్లరి చేస్తుంది.

''అందుకే నేను వెళ్ళిపోతున్నాను. అయినప్పటికీ మీపైని అభిమానం నాకేనాడూ పోదు. మిమ్మల్ని సదా-తలచుకుంటూ — నా హృదయ పీఠంలో ఆరాధించుకుంటూ వుంటాను. నన్ను నమ్మండి. అయితే, అతన్ని కూడా మీకన్న గాఢంగా ప్రేమిస్తున్నాను. అతను, నన్ను ఆకర్షించుకున్న మార్గాలు చాలా కట్టుదిట్టమైనవి. అందుకే నేను అతన్ని మరచి పోలేను. నా అవసరం తీరాక- నా పైని మోజు తగ్గాక ఆ అబ్బాయి తన దారంట తాను వెళ్ళి పోయాడు. కనీసం ఒక్కమాటైనా చెప్పకుండా వెళ్లాడే అని మాత్రమే యీ నాడు వ్యథచెందుతున్నాను.

''ఇన్నాళ్ళకి నేను తెలుసుకోగల్గిందేమిటంటే —

''ఎవ్వరినీ ప్రేమించకూడదు!

ఎవ్వరికీ మనసీయరాదు'' —అని.

''నిజం! ప్రేమించి, మన సిచ్చిన నేను యీ నాడు ఎంతగా బాధపడుతున్నానో- ఏ విధంగా విపులీకరించి

చెప్పను? ప్రేమించటం నేరమైంది. మనసిచ్చి, జాలిపడటం దోషమైంది. పరిస్థితి యీ విధంగా వక్రిస్తుందని— నా హృదయం పగులుతుందని— తీరని ఆవేదనకు గురి అవుతానని— ఏ నాడూ తలపోయలేదు నేను అలాంటిది జరిగింది. నిశ్శబ్దంగా సాగిపోతున్న నా జీవితనదిలో తుఫాన్ చెలరేగింది. ఇహ నే నెట్లా బ్రతకను? ఏ విధంగా మనశ్శాంతి పొందగలను?

"నా జీవితాన్ని నేనే చేజేతులా విచ్ఛిత్తి గావించుకున్నాను. మధురంగా మ్రోగే నా హృదయ వీణను తునాతునకలు చేసుకొన్నాను. గుండెను బండచేసుకొని కన్నీళ్ల వర్షంతో కుమిలిపోయాను.

"కనుక నే యీ పరిసరాలనుండి నేను శాశ్వతంగా దూరమై పోతున్నాను.

"నన్ను క్షమించండి. నే నెక్కడికి వెళ్ళానోనని ఆరా తీసేందుకు ప్రయత్నించకండి. సజీవంగా ఇహ ఏ నాడూ మీ కంట బడను నేను...

—రాధ."

ఆమె కన్నీళ్ల వర్షంతో ఉత్తరాన్ని పూర్తి చేసింది. ఆసాంతం మరోమారు దాన్ని చదువుకొని దీర్ఘంగా నిట్టూర్చింది. మడత బెట్టిన ఆ ఉత్తరాన్ని తన భర్త గుండెలమీద పెట్టి కన్నీళ్లు వదలి తుడుచుకుంది.

ఆఖరి మారుగా బాల్కనీమీది కొచ్చి— తన జీవితంలో యింతమార్పుకు కారణభూత మైన ఎదురింటి మేడమీది కిటికీ తలుపులకేసి క్షణకాలం దృష్టి నిల్పింది. కాస్సేపటికి గతస్మృతుల వలయం నుండి తేరుకొని- మనస్సును దిటవు పరచుకొని వెనుదిరిగింది.

బయట హోరుమని గాలివాన కురుస్తోంది. అప్పుడప్పుడు ఆకాశంలో పెద్దగా శబ్దంచేస్తూ ఉరుములు వురుముతున్నాయి. మేఘాలు గర్జిస్తున్నాయి. ఆ అర్ధరాత్రిలో- కన్ను పొడుచుకున్నా కన్పించని కటిక చీకటిలో- ప్రళయ భయంకరంగా కురుస్తున్న వర్షంలో- మూర్తీభవించిన శోక దేవతలా రాధ, పేవ్‌మెంట్ మీదికి నడిచివచ్చి-ఆ చీకట్లో- వర్షంలో ఎటో వెళ్ళిపోయింది.



## ఊర్వశి

జగదేకసుందరి, దేవవేశ్య అగు ఊర్వశి ఆనాడు కుబేరుని భవనండి దేవలోకానికి తిరిగివెళ్తోంది. ఆమె చెలికత్తె చిత్రలేఖ-రంభ, మేనక, తిలోత్తమాది అప్సరసలుకూడా వెంటరాగా అందరూ విలాసంగా నడుస్తూ వెళ్ళసాగారు.

విశ్వవిఖ్యాతి గాంచిన ఆ దేవవేశ్య లందరూ కలిసి పోతోంటే-సౌందర్య మంతా ఒకే వెలుగై ఆవిధంగా తరలి పోతోందేమో నన్న భ్రాంతి కల్గుతోంది. వాళ్లు నడుస్తు న్నప్పుడు కల్గుతున్న మువ్వల సవ్వడివల్ల దేవసభలో నాట్య ప్రదర్శన ప్రారంభ మైనదేమో నన్న సంశయం ఉత్పన్న మౌతోంది.

అంతటి సౌందర్యాంగనలు ఎందుకోగాని ఆ దినం మూకీభావం వహించి నెమ్మదిగా నడవసాగారు. ఎవ్వరూ ఏ మాటలూ లేకుండా నిశ్శబ్దంగా నడుస్తూండటంతో మాట కారియైన ఒక అప్సరసకు విసుగు వేసింది. ఆమె వూరుకోలేక అందరికన్నా ముందు నడుస్తున్న ఊర్వశిని సమీపించి—

"ఎందుకే అంత తొందరపాటు? ఎవరిని వరించేందుకు అలా విస విస వెళుతున్నావ్?" అనడిగింది.

ఆ అప్సరస మాటలకు ఊర్వశి చిరునవ్వు చిల కరించిందే కాని మాట కదపలేదు.

"మాట్లాడితే నీ నోటిముత్యాలు రాలిపోవులే! అయినా మా అందరికన్నా నువ్వే అందగత్తెనని మురిసిపోకు. ఆడదానికి అందమే ఒక ప్రబలశత్రువు—" అన్నది తిరిగి ఆ అప్సరస.

ఊర్వశి మళ్ళీ నవ్వించే కాని మాట్లాడలేదు. ఆ అప్సరస చిరుకోపం ప్రకటించి ఊర్వశిని వదలి రంభదగ్గరకి వచ్చింది.

"చూడవే! ఊర్వశి ఎలా బింకంగావుందో! మాట కదిపినా మాట్లాడదేం? తనంత గొప్ప సౌందర్యవతి ముల్లో కాల్లోకూడా లేదనా ఆ నిర్లక్ష్యం?" అన్నది.

అందుకు రంభ నవ్వి- "పోనీలేద్దూ! నీ కీ దినం ఊర్వశిపైనే మనసుపోయిందా ఏం? అభిమానవంతురాలు ఆమెను పట్టుకొని దుయ్యబడతావేమే?" అంది.

"దుయ్యబట్టడం కాదే! ఎంతకూ ఎవ్వరూ మాట్లాడకుండా వుంటే- ఎందుకో మనసు వికారానికి లోనైంది. మనలో అందరికన్నా చిన్నది ఊర్వశేకనుక ఆమె ప్రేమకు పాత్రులవ్వాలని ఎందరో తపస్సు చేస్తూ, నిరీక్షిస్తుంటారు. వాళ్ళ సంగతి ప్రస్తావించి యీామెను కాస్తవుడికిద్దా మని

చూశాను. కాని నామాట కారితనం ఏమాత్రంపనికిరాలేదు!''

''ఊర్వశి కేవలం తపస్సులకు, వ్రతాలకు లొంగుతుం దనుకున్నావా?''

''మనలాగే కాదా?''

''ఊహూ! ఆమెకొక గొప్ప చరిత్ర వుంది. ఆమె సామాన్య అప్సరాంగన కాదు. నారాయణ దేవులు సృష్టించి యిచ్చిన అతిలోకసుందరి ఊర్వశి.''

''ఈమెగారిని సృష్టించవలసిన అవసరం నారాయణ దేవుల కెందుకు కల్గింది!''

''అదా నీఅనుమానం. ఒకప్పుడు నారాయణుడుతపస్సు చేసుకొనేసమయంలో మన దేవరాజు వారి తపోనిగ్రహాన్ని పరీక్షించేందుకై నన్ను, మేనకను, తిలోత్తమను పంపాడు. మే మంతా వెళ్ళి ఆయన ముందేనోన్ని నాట్యవిద్యలను ప్రదర్శించి-ఆయనను మావైపు త్రిప్పుకుని తపోభంగం చేసేందుకు ప్రయత్నించాం. కాని నారాయణ దేవులు మా ఆటపాటలకు లొంగనూలేదు, కోపించనూలేదు. మరో మహర్షి అయ్యుంటే అదేక్షణంలో మమ్మల్ని కఠినంగా శపించేవాడు. ఆయన కరుణామూర్తి గనుక వెంటనే తన తొడనుండి ఒక సుందరిని సృష్టించి-'ఈమెను మీతోపాటు తీసికెళ్ళండి, అన్నివిధాల మీకు సహాయకారిగ వుంటుంది-' అన్నాడు. ఆమే యీ ఊర్వశి, ఈమె జగదేకసౌందర్యాన్ని గాంచి మేము సిగ్గుపడి తలలొంచుకొని, మారుమాట లేక తిరిగి

వచ్చాము. కనుక యీమె సామాన్య తపోధనులకు లభ్య మవుతుందనుకోకు!''

''ఊర్వశి జీవితకథ చిత్రంగా వుందే!''

''అవును. అందరి జీవితగాథలు చిత్ర మైనవే. కాని ఎటొచ్చీ కొందరివి చరిత్రప్రసిద్ధి కెక్కాయి. మరికొందరిని మాటుమణగిపోయాయి. ఇంతటితో యీ సంభాషణకు స్వస్తి పలుకుదాం——''

అని రంభ ఆ అప్సరాంగనకుడిహస్తం పట్టుకుంది. ఆమెకూడా మారు మాటాడలేక చిరునవ్వులు వొలికిస్తూ ముందుకు నడిచింది.

ఆ విధంగా తిరిగి అందరూ మౌనం వహించి వడి వడిగా వెళ్ళసాగారు. ఊర్వశి యథాలాపంగా తన చెలికత్తె చిత్రలేఖతోసహా అందరికన్నా ముందునడుస్తూ వెళ్ళసాగింది. ఎందుకోగాని వున్నట్లుండి ఆమె ఎదలో కొన్ని విచిత్రాను భూతులు కల్గాయి. భయమన్నది ఎరుగని అ అప్సరస గుం డెలో క్షణకాలం భీతి తొంగిచూసింది. ఆ వెనువెంటనే తిరిగి హృదయం ఏదో తెలియని మధురానుభూతిలో పర వశం ఐపోయింది. అకస్మాత్తుగా తనలోకల్గిన యీ ద్వంద్వ అనుభూతులకు కారణం ఆమె ఎటూ ఆలోచించుకోలేక స్తబ్ధురా లైంది.

అంతలో విపరీతంగా ఎక్కడినుంచో భయంకరశబ్దం విన్పించింది. ఊహించని విధంగా అంతటి గొప్పశబ్దం విన్పించే

సరికి ఊర్వశితోపాటు అందరూ భయభ్రాంతులై ఎక్కడి వారక్కడే నిల్చుండి పోయారు.

మరుక్షణంలో వాళ్ల ఎదుట వికృతంగా నవ్వుతూ- భయంకరుడూ, క్రూరుడూ అయిన ఒక రాక్షసుడు వచ్చి నిల్చున్నాడు. వాడి ఆకార వికారాదులను చూసేసరికి ఆ అప్సరాంగనల గుండెలు దడదడ లాడాయి. ఆ నీచుడు ఏం చేస్తాడోననే భీతితో అందరూ ఒకచోట చేరి ఒకరి నొకరు కౌగలించుకున్నారు.

వాళ్ళ భయభ్రాంతులను చూసి ఆ రాక్షసుడు మరింత క్రూరంగా నవ్వాడు. వాడి నవ్వు ఆకాశమంతటా ప్రతిధ్వనించింది. కర్ణకఠోరమైన వాడి నవ్వును విని సహించలేని మేనక- 'ఛీ! ఛీ' అంది.

"ఊరుకో! నీ నిర్లక్ష్యం వాడు చూశాడంటే ప్రాణాలు తీస్తాడు!" అన్నది నెమ్మదిగా తిలోత్తమ.

"ఇంతకీ ఎవడే వీడు?" అనడిగింది తిలోత్తమను, రంభ భయపడుతూనే.

"కేసి అనేదానవుడు, వీడు. హిరణ్యపురవాసి. బహు క్రూరాత్ముడు. వీడి కంటికి నచ్చిన అప్సరసనల్లా ఎత్తుకపోయి నానాహింసలూ పెడుతుంటాడు. వీడిది గుండె కాదు. బండ-"

"అమ్మో! ఇప్పుడు మనగతేమిటి?" అని కెవ్వున కేక పెట్టిందొక అప్సరస, పూర్తిగా భయవిహ్వాలమై.

ఆ అప్సరస పెట్టిన కేకకు- కేశిదానవుడు మరింత

నిర్లక్ష్యంగా ఆకాశం పగిలేలా క్రూరహాసం చేశాడు. నెమ్మదిగా అడుగులో అడుగు వేస్తూ వాళ్లను సమీపించాడు. వాడు దగ్గర పడేకొద్దీ అప్సరసలు వెనుకడుగు వెయ్యసాగారు.

"ఓహ్హో! చక్కని చుక్కల్లారా! దేనికా బెదరుపాటు? క్షణకాలం ఓపికపట్టండి. స్వయంవరంలో ఎవరు గెలుస్తారో చూస్తాను-" అని మళ్ళీవాడు వికృతంగా నవ్వసాగాడు.

"స్వయంవర మంటున్నాడు, ఏమిటే?" అనడిగింది చిత్రలేఖ, సహజన్మను.

"ఏమో! చూడు, వాడెట్లా అందర్నీ చూస్తున్నాడో! అవి కళ్లు కావు, నిప్పురవ్వలు..."

"మద్యం సేవించాడేమో, తూలుతున్నాడు కదా?"

"అవును-"

"అమ్మయ్యో! నన్నే చూస్తున్నాడేమో!" అని మరింత భీతి చెందింది చిత్రలేఖ.

ఆ దానవుడు మరి కొంచెం ముందుకు వచ్చి అందరి వైపుకూ నిశితంగా దృష్టి సారించి పగలబడి నవ్వసాగాడు.

"ఓహ్హో! మీరంతా దేవవేశ్యలా? ఆ వెయ్యికళ్ల పిరికివాడి సుధర్మసభలోని నాట్యకత్తెలా? పాపం! ఆ గడ్డాల మునులముందు మీ జగదేక సౌందర్యాన్ని వంపుసొంపులు త్రిప్పి నిష్ప్రయోజనం చేసుకుంటున్నారు కాబోలు! వలచి వచ్చినవాడిని- నా వెంట రారాదూ! హిరణ్యపురంలో

మీకు కావలసిన సర్వసౌఖ్యాల్ని కల్పించి- స్వర్గాన్ని మరపింప చేస్తాను-'' అన్నాడా దానవుడు.

''ఛీ! దుర్మార్గుడా! దేవాంశసంభూతులం- అబలలం- పైగా ఒంటరి కత్తెలము అయిన మా పైనా నీ వాచాలత్వం? మర్యాదగా మా దారి కడ్డు తొలగు-'' అన్నది ఎలాగో ధైర్యాన్ని పుంజుకున్న రంభ.

ఆ మాటలకు వాడు వికృతంగా నవ్వి- ''ఆహా నువ్వేనా రంభవు! ఏమోనను కున్నాను. అందానికి తోడు ఆవేశాన్ని కూడా అలంకరించు కున్నావే! బాగు- బాగు- అయినా ఆలోచనలవల్ల- దీర్ఘకాలంవల్ల నీకు ముసలితనం వచ్చినట్లుంది. నా శృంగార క్రీడకు నువ్వు పనికిరావు. ప్రక్కకు తప్పుకో!'' అన్నాడు.

రంభ గాఢంగా నిట్టూర్చి, నెమ్మదిగా ప్రక్కకు తప్పుకుంది. తర్వాత ఆ దానవుడు ఒక్కొక్కరినే సూటిగా చూస్తూ- ఊర్వశిని సమీపించాడు.

ఆ దుర్మార్గుడి క్రూరహాసానికి- వికృతాకారానికి పూర్తిగా భయవిహ్వలమైన ఊర్వశి కెవ్వున కేక పెట్టింది. ఊర్వశి ఆ రక్కసుని చూసి భయపడేసరికి- ఆమె ప్రియసఖి చిత్రలేఖ కలవరపడింది. భయంవల్ల కుప్పగా కూలిపోతున్న ఊర్వశిని పట్టుకొని ఆ రాక్షసునివైపు కోపంతో చూసింది.

''దుర్మార్గుడా! ఒంటరిగా నున్న అబలలపైనా నీ ప్రతాపం చూపేందుకు వచ్చావు? ఈ సంగతి మా దేవరాజుకు

తెలిస్తే క్షణంలో నిన్ను యమపురికి పంపిస్తాడు. జాగ్రత్త! ఇప్పటికైనా మించిపోయింది లేదు. నా దారికి అడ్డు తొలగి మర్యాదగా వెళ్ళిపో!'' అన్నదామె.

అందుకు వాడు మాట్లాడకుండా ఊర్వశివైపే దృష్టి నిల్పాడు. ఊర్వశి కేమీ బోధపడక ఆ క్రూరుడి కేసే భయంతో చూడసాగింది. మాయా ప్రభావమువల్ల ఆమె ఎవరైందీ తెలుసుకొన్న ఆ క్రూరుడు విజయగర్వంతో తల వూపాడు,

''ఓహోఁ! నువ్వేనా అందాలరాశి ఊర్వశివి! నీ జగదేక సౌందర్యాన్ని అనుభవించాలని ఎన్నాళ్ళనుండో ముచ్చట పడుతున్నాను. ఆడబోయిన తీర్థ మెదురైనట్లు-నీకై నువ్వే నేడు తారసపడ్డావ్. ఎందుకట్లా బెదరు చూపులతో నన్ను చూస్తావ్? దేనికా భయం నీకు? రా, నాతోపాటు రా!...''

అని వాడు ఊర్వశిని సమీపించబోయాడు. అప్పుడు వాడి కళ్ళల్లోని కాముకత్వాన్ని- ముఖంలోని క్రూరత్వాన్ని చూసి అబలలైన ఆ అచ్చరలంతా ప్రక్కకు తప్పుకున్నారు. కాని చిత్రలేఖ మాత్రం ఊర్వశిని వదలి పెట్టలేదు.

వెంటనే ఆ దానవుడు వాళ్ళదగ్గరగా వచ్చి అందరూ చూస్తూండగానే ఊర్వశీ చిత్రలేఖలను చెరపట్టి- వికటంగా నవ్వుతుంటూ ఆక్కడినుండి వెళ్ళిపోయాడు.

రంభాది అప్సరసలు చేసేదేమీ లేక ఆర్తనాదం

చెయ్యసాగారు. అంతవరకూ-ఆ సంఘటన నంతా దాపు నుండి తిలకిస్తున్న నారదముని చప్పున బయటపడి-ఏమీ తెలియనివాడివలె వాళ్ళని సమీపించాడు. నారదముని రాక గమనించి ఆ అచ్చర లంతా యథావిధిగా ఆయనకు నమస్కరించారు.

"రంభాది అప్సరసలా! దేవలోకానికేనా ప్రయాణం?" అ నడిగా డాయన.

"అవును మునీంద్రా!" అంది మేనక.

"అ దేమిటి! ఎన్నడూ కళాహీనం పొందివుండని మీ ముఖాలు నల్లబడ్డాయేం? ఏం జరిగింది?" అ నడిగా డాయన ఎంతో ఆత్రంగా.

"జరగవలసిం దంతా జరిగింది స్వామీ! కేశిదానవుడు మన ఊర్వశిని చిత్రలేఖతోపాటు చెరపట్టి తీసికెళ్ళాడు..." అంది రంభ భయంగా.

"ఆ! ఎంతపని జరిగిందీ! నారాయణముని వరప్రసాదిని-మీ ప్రియసఖి అయిన ఊర్వశిని ఆ దిక్కుమాలిన రాక్షసుడు చెరపట్టాడా? వా డలా స్వేచ్ఛగా మీ ప్రియసఖిని చెరపట్టి తీసికెళుతోంటే ఎవ్వరూ సహాయపడ రాలేదా? లోకంలోని విక్రమశాలు లెవ్వరూ అడ్డు రాలేదా?" అని తిరిగి అడిగాడు.

ఆ అప్సరసలు దుఃఖభారంవల్ల ఏమీ మాట్లాడలేక తలలొంచుకున్నారు. త్రికాలజ్ఞుడైన ఆ మహాముని యథా

ర్థము గ్రహించుకొని తనలో తాను నవ్వుకున్నాడు.

"పాపం! మీ ఆవేదన చూస్తూంటే నాకు జాలి కల్గుతోంది. ఇప్పుడే వెళ్ళి దేవేంద్రుడితో యీ విషయ మంతా చెప్పి - ఆ రక్కసి పీచ మడగించి - మీ సఖిని మీకు దక్కేట్లు చేస్తాను. అయినా మీరు ఆర్తనాదం చేస్తూనే వుండండి—మీ మొర ఆలకించి ఏ వీరవిక్రముడైనా సహాయం చేసేందుకు రావొచ్చు..."

అని నారదముని నెమ్మదిగా అక్కడినుండి నిష్క్ర మించాడు. ఆయన వెళ్ళిపోవడంతో తిరిగి ఆ అచ్చర లంతా ఆర్తనాదం చెయ్యసాగారు.

గంగా యమునా నదులు కలిసే చోటుకు సమీపంలో ప్రతిష్ఠాన మనే నగర మొకటుంది. దాని ఏలిక పురూరవ చక్రవర్తి. ఆయన చంద్రుని కొడుకైన బుధునికి ఇళ యను నామెయందు జన్మించినవాడు. గొప్ప బలపరాక్రమశాలి. సకల శాస్త్రవిద్యా పారంగతుడు. జన్మవల్లను - రూపం వల్లను-ఆత్మ ఔన్నత్యంవల్లను అన్నిలోకాలలోనూ కీర్తి గడించినవాడు. ఎన్నోమార్లు దేవాసురయుద్ధాలలో దేవ సైన్యానికి నాయకుడై దానవులను ఓడించి, సురనాథుని గౌరవాదరణలను పొందినవాడు. దేవేంద్రుడే ఆయనకు ప్రియమిత్రుడు కావటంతో అప్పుడప్పుడు స్వర్గలోకానికి వెళ్ళివస్తుండేవాడు. ఆయన పాలనలో అతివృష్టి; అనావృష్టి దోషాలు లేకపోవడంవల్ల ప్రజలంతా సంతుష్టులై-సకల ఐశ్వర్యములతో తులతూగుచుండెడివారు.

దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయు ఆ మహారాజు-ఆ నాడు ప్రాతఃకాలంలో యథావిధిగా. సంధ్యావందనాదులు తీర్చుకొని తిరిగి తన సోమదత్తరథంపై అంతఃపురానికి బయలుదేరాడు.

అ దేసమయంలో ఆకాశమార్గాన రంభాది అప్సరసలు తమ ప్రియసఖి ఊర్వశిని చిత్రలేఖతో పాటు చెరపట్టి తీసి కెళుతున్న కేశిదైత్యుడ్ని చూసి ఆర్తనాదం చేయసాగారు. ఆ ఆర్తనాదం అకస్మాత్తుగా పురూరవచక్రవర్తికి విన్పిం

చింది. ఆయన చుట్టూ చూశాడు. కాని మనుష్యు లెవరూ కన్పించలేదు. అయినప్పటికీ ఆర్తనాదం వినవస్తూనేవుంది. ఆయన యీ వింతకు ఆశ్చర్యపోతూ ఆకాశంవైపు దృష్టి సారించాడు. కొంతసేపటికి అంతరిక్షం నుండే ఎవ్వరో ఆర్త నాదం చేస్తున్నట్లుగా గ్రహించి రథసారథి సూతునివైపు తిరిగి—

"సూతా! ఆకాశంలో ఎవ్వరో స్త్రీలు ఆర్తనాదం చేస్తున్నారు. వెంటనే మన రథాన్ని అటువైపు మళ్ళించు-" అన్నాడు.

సూతుడు తక్షణమే రథాన్ని వాయువేగంతో ఆకాశం పైకి మళ్ళించాడు. పురూరవుడు గొప్ప తపోమహిమ గలవాడు కావటంవల్ల ఆయన రథం ఆకాశంపైకూడా ప్రయాణించేది.

కొంతదూరం వెళ్ళేసరికి స్త్రీల ఆక్రందన స్పష్టంగా వాళ్ళకి విన్పించసాగింది.

"అయ్యో! రక్షించండి - రక్షించండి - సురపక్ష పాతులుగాని, ఆకాశగమనులుగాని ఎవ్వరైనా వచ్చి కరుణించండి..." అని ఆ అచ్చరల ఆర్తనాదాన్ని మరింత స్పష్టంగా పురూరవచక్రవర్తి విన్నాడు

ఆ ఆర్తనాదం వినేసరికి ఆయన మనస్సు కలవర పడింది. ఆకాశగమనులు దేవతలే గనుక ఏ దానవునివల్ల వారికి కీడు మూడిందో నని తలపోయసాగాడు.

అంతలో రథం ఒకచోట ఆగింది. పురూరవుడు ఆలోచనలనుండి తేరుకొని చుట్టూ చూశాడు. కన్నెదుట రంభ, మేనక, తిలోత్తమ యిత్యాది అప్సరాంగనలు చింతాక్రాంతవదనులై నిల్చొని వుండటం గమనించి, రథం దిగి వారిని సమీపించాడు.

ప్రియసఖి విరహంతో ఆవేదనకు లోనైన ఆ దేవ వేశ్యలు పురూరవ చక్రవర్తి రాకను గుర్తించి-సురపక్షపాతీ, ఆకాశగమనశాలి అయిన ఆ రాజర్షికి సాదరంగా ప్రణమిల్లారు.

పురూరవుడు వారిని మరింత దగ్గరగా సమీపించి "ఓ అప్సరాంగనలారా! సూర్యోపాసన సల్పి తిరిగి వెళ్తున్న నాకు- యిట ఎవరిదో ఆక్రందన విన్పించగా శరవేగంతో వచ్చాను. మీ ముఖకవళికల్నిబట్టి ఆ ఆర్తనాదం చేసిన వారు మీరేనని స్పష్టంగా తెలుస్తోంది. మీకొచ్చిన ఆపద ఏమిటి? ఎందుకలా చింతాక్రాంతవదనలై వున్నారు? ఏం జరిగింది? త్వరగా చెప్పి నా హృదయారాటాన్ని తీర్చండి-" అన్నాడాయన.

ఆయన పల్కులనాలకించిన రంభ ముందుకు వచ్చి- "పురూరవచక్రవర్తీ! దానశీలీ! ఓ దేవతాపక్షపాతీ! తిరిగి మాకు రాక్షస విజృంభణవల్ల కీడు మూడింది-" అన్నది.

"ఏమిటీ! రాక్షస విజృంభణమా?"

"అవును ప్రభూ! మేమంతా మా ప్రియసఖి

ఊర్వశితో పాటు కుబేర భవనం నుండి తిరిగి దేవలోకం వెళు తూంటే మార్గమధ్యంలో హిరణ్య పురవాసియైన కేశిదాన వుడు కన్పించి- మమ్మల్ని అడ్డుకొన్నాడు. వాడు బహు క్రూరుడు. చేతచిక్కిన అప్సరసనల్లా ఎత్తుకపోయి, నా నా హింసలు పెడుతుంటాడు. అట్టి నీచుడు అకస్మాత్తుగా మా ముందు నిలిచేసరికి మేము పూర్తిగా భయభ్రాంతుల మయ్యాము. అప్పుడు వాడు మా చెలి ఊర్వశి జగదేక సౌందర్యాన్ని గాంచి, కామపీడితుడై, ఆమెను చిత్రలేఖతో పాటు చెరపట్టాడు దేవలోకానికే అలంకార ప్రాయమూ- దేవరాజుయొక్క సుకుమార కోమలాయుధము అయిన మా నెచ్చెలి ఊర్వశికీ నాడు యిట్టి దురవస్థ ప్రాప్తించిందికదా అని మిక్కిలి విచారిస్తున్నాం...'' అన్నది రంభ.

''రంభా! విచారించకు. సత్వరమే ఆ కేశిని పరిమార్చి మీ ప్రియసఖిని మీ కప్పగిస్తాను. ఆ రాక్షసుడు ఏవైపుగా వెళ్ళాడు?''

''ఈశాన్యదిక్కుగా ప్రభూ!''

''మంచిది. అబలలను చెరపట్టే ఆ నీచుని గర్వ మణిచి, మీ చెలితో పాటు తిరిగివచ్చి కలుసుకుంటాను. అంత వరకు మీ రంతా హేమకూటశిఖరాన వుండండి...''

అని పురూరవుడు తన సోమదత్తరథాన్ని అధిష్టించి వి ల్లంబులు అందుకొన్నాడు. క్షణంలో రథం ముందుకు కదిలింది. శరవేగంతో ఈశాన్యదిక్కుగా ప్రయాణించి-

రెప్పపాటు కాలంలో ఊర్వశిని చెరపట్టి వేగంగా వెళ్ళిపోతున్న ఆ దానవుణ్ని చేరుకుంది.

వికటాట్టహాసం చేస్తూ-నిరాటంకంగా సాగిపోతున్న ఆ దైత్యుడు అకస్మాత్తుగా తన వెనక ఏదో శబ్దం విన్పించేసరికి వెనుదిరిగి చూశాడు.

ప్రచండమార్తాండునివలె వెలిగిపోతూ, కోపంతో ఎర్రబడిన నయనాలతో తీక్షణంగా తనవైపే చూస్తూ-విల్లెక్కు పెట్టివున్న పురూరవచక్రవర్తి కన్పించాడతనికి. అనుకోనవిధంగా యుద్ధసన్నద్ధుడై వచ్చిన పురూరవుని చూడగానే ఆ రాక్షసుడి గుండెలు దడదడ లాడాయి. అయినా లేని ధైర్యాన్ని తెచ్చుకొని మరోమారు వికటంగానవ్వుతూ ముందడుగు వేశాడు.

అంతలోనే పురూరవుని రథం అతని దారికడ్డుగావచ్చి నిల్చుంది. పరిస్థితి రానురాను విషమిస్తోందని తెలుసుకున్న ఆ రాక్షసుడు కనుబొమలు చిట్లించి పురూరవునివైపు క్రూరంగా చూశాడు.

"ఏయ్! ఎవరు నువ్వు?" అని గర్జించాడు.

పురూరవుడు ఏమీ మాట్లాడలేదు.

"నా దారి కడ్డు తొలగు. ఇంతవరకూ నన్ను అడ్డగించినవాడు ఈ సమస్తలోకాల్లో ఎవ్వడూ లేడు. తెలియక చేసిన నేరమని నిన్ను క్షమిస్తున్నాను. మర్యాదగా అడ్డు తొలగిపో! లేదా క్షణంలో నిన్ను, నీ రథాన్ని ముక్క-

ముక్కలు చేస్తాను..." అన్నడా దానవుడు.

అప్పటికి కూడా పురూరవుడు ఏమీ మాట్లాడక-అలాగే రథంలో నిల్చుండి పోయాడు. తనింతగా భయపెడుతున్నా- లవలేశమైనా భీతి చెందని ఆ రాజర్షిని చూసి లోలోన కలత పడ్డాడా దైత్యుడు.

"అడ్డు తొలగవేం? నా మాటలు నీ చెవి కెక్కటం లేద-? లేక నా ప్రక్కనున్న యీ సౌందర్యవతులను చూసి నోట మాటరాక అలాగే నిల్చుండి పోయావా? ఈ మారుకూడా మన్నిస్తున్నాను. ఊఁ, యికనైనా ప్రక్కకు వైదొలగు..."

ఆ దైత్యుడి మాటలకు పురూరవుడు నిర్లక్ష్యంగా నవ్వాడు. అది గమనించి రాక్షసుడు మరింత కోపోద్రిక్తుడయ్యాడు.

"ఎంత పొగరు నీకు? ముల్లోకాధిపతులు దండెత్తి వచ్చినా- భయపడని నా ముందా నీ నిర్లక్ష్యం? నేనెవరో తెలుసా నీకు?"

"ఆఁ! నువ్వెవరో నాకు తెలియకపోవడ మేమిటి? హిరణ్యపురవాసివి నువ్వు. కేశి అను నామధేయుడవు. ఒంటరిగా నున్న అబలలను చెరపట్టి పారిపోతున్న పిరికిపందవు-" అన్నాడు పురూరవుడు.

"ఏమన్నావ్? నేను పిరికిపందనా? అహాఁ! నా ప్రతాపం నీకింకా తెలీదు కాబోలు"

"దేవసంగ్రామంలో ఎన్నోమార్లు కాలికి బుద్ధి చెప్పిన నీ ప్రతాపాన్ని గురించా గొప్పగా చెప్పుకుంటున్నావ్?"

"ఇంతకీ ఎవడవురా నువ్వు?"

"ప్రతిష్ఠానగర చక్రవర్తిని-పురూరవుణ్ణి"

"ఓహ్హాఁ! ఓ సామాన్య మానవయువకుడవా నువ్వు? అందుకే యింతగా మిడిసిపోతున్నావ్. అయినా నా దారి కడ్డు ఎందుకు నిలిచావ్?"

"ఈ అప్సరాంగనలను నీ కబంధహస్తాలనుండి తప్పించేందుకు-"

"అబ్బో! ఆర్తజనరక్షకుడివై-యీ వేశ్యల చెర విడిపించేందుకు వచ్చావా? అల్పాయుష్మంతుడవు; ఒక భీకర దానవునితో ఎలా పోరాడగల ననుకున్నావ్? ప్రాణాలమీద ఏమాత్రమైనా ఆశ వుంటే తక్షణమే పారిపో! లేదా కీటకం వలె నిన్ను నలిచివేస్తాను-"

"ఇహ నీ ప్రేలాపన చాలించి-మర్యాదగా ఆ అప్సరాంగనలను నా స్వాధీనపరుచు. ఒంటరికత్తెలపైనా నీ ప్రతాపం చూపేది? నువ్వెంత బల పరాక్రమసంపన్నుడవైనా యిలాంటి దుండగచర్యలకు పూనుకొనటం క్షేమకరం కాదు..."

"అహో! నువ్వా నాకు హితవు చెప్పవచ్చినవాడవు. ఓ సామాన్య మానవుడవు నాకే నీతులు చెప్పదలిచావా? వట్టిమాటలతో కాలయాపన దేనికి? కాచుకో, ఒకే దెబ్బకు

నిన్ను యమపురి కంపిస్తాను——''

అంటూ ఆ దానవుడు రెచ్చిపోయి ముందు వెనుకలు ఆలోచించక, వివేకశూన్యుడై-ఆ విక్రమశాలిపై యుద్ధానికి సన్నద్ధు డయ్యాడు.

చూస్తూ చూస్తూండగానే పోరు అధిక మైంది. ఉభయులూ తీవ్రంగా ఒకరిపై నొకరు బాణప్రయోగం చేసుకో సాగారు. ఆ విధంగా చాలాసేపు పోరు జరిగాక పురూరవుడు చివరికి ఆ రాక్షసునిపై వాయువ్యాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ దెబ్బతో కేశిదానవుడు కొన్ని యోజనాలదూరం గాలిలో కొట్టుకపోయాడు.

అంత నా రాజు ఊర్వశీ చిత్రలేఖల నిద్దరినీ సమీపించి, వారిని తన రథంపై ఎక్కించుకున్నాడు. తిరిగి రథం హేమకూటపర్వతంవైపు ప్రయాణించసాగింది.

ఊర్వశి దర్శనస్పర్శనాదులవల్ల పురూరవుని హృదయంలో ఏవో వింతకోర్కెలు జనించాయి. అంతవరకు ఆయన ఊర్వశి జగదేకసౌందర్యాన్నిగూర్చి వినటమేకాని చూసింది లేదు. ఆ సమయంలో ప్రత్యక్షంగా ఆమెను వీక్షిస్తూ-మధురస్వప్నాల్లో తేలిపోయాడు.

ఆ విధంగా రథం ముందుకు సాగిపోతూనేవుంది. కానీ ఎంతసేపటికీ ఊర్వశి మూర్ఛనుండి తేరుకోలేదు. పురూరవుడు ఆ గంభీరనిశ్శబ్దాన్ని భరించలేకపోయాడు. 'ఊర్వశి గొప్ప సౌందర్యవతే కాని ఎంత పిరికిది-' అని ఆమెపై

జాలిపడ్డాడు.

"ఓ సుందరీమణీ! రాక్షసకులాంతకుడుగా దేవేంద్రు డుండగా - ఒక రాక్షసాధమునకా యింత భీతి చెందావ్? ఇంకను భయపడట మెందుకు? కళ్ళు తెరువు-" అన్నాడు పురూరవుడు, ఊర్వశివైపు చూస్తూ.

ఆ మాటలకు ఊర్వశిలో ఎలాంటి సంచలనమూ కల్గ లేదు. పురూరవుడు నిరుత్సాహపడ్డాడు. ఆ అన్నులమిన్నతో కొన్ని మాటలైనా మాట్లాడని తన జీవితం వ్యర్థ మను కున్నాడు. ఆ వుద్దేశ్యంతో ఊర్వశి ప్రియసఖియైన చిత్రలేఖ నుద్దేశించి –

"పాపం! నీస్నేహితురాలు చాలా దిగులుపడినట్లుంది. భయంచేత యీామె శరీరం ఎంతగా వణుకుతోందో చూడు-" అన్నాడు.

ఆయన మాటలు విని చిత్రలేఖ సిగ్గుపడింది. వెంటనే ఊర్వశి భుజంపట్టి వూపుతూ-

"చెలీ! ఎందుకే యింత పిరికిపడ్డావ్? నువ్వు దేవ లోకంలో దేవతలతో మెలగినదానవు కాదా? సామాన్య యువతివలె భీతి చెందా వేమిటి? ఒక రాక్షసుడు పట్టుకొని పోయినంతమాత్రాన యింతగా భయపడవలెనా? ఆ దురా త్ముడు గాలికి కొట్టుకొనిపోయి ఎంతసే పైందనుకున్నావ్? ఇంకను కళ్లు తెరవవేమి?" అన్న దామె.

అప్పటికి ఊర్వశి మూర్ఛనుండి కాస్త తెప్పరిల్లింది.

నెమ్మదిగా కళ్ళు తెరచి తలెత్తి చూసింది. తన ప్రక్కగా చిరునవ్వులు చిందిస్తూ పురూరవుడు కన్పించగానే ఆమె సిగ్గుపడింది. కేశిదానవుడు తనను చెరపట్టబోయినపుడు భయంచేత తను స్పృహతప్పింది. ఆవల ఏం జరిగిందో తనకు తెలియదు. 'ఇంతకీ ఆ క్రూరుడేమైనాడు? ఆ దురాత్ముని బారినుండి తన నెవ్వరు రక్షించారు? ఇప్పుడు తనీ రథంలో ఎక్కడికి వెళుతున్నట్లు' అని పరిపరివిధాల ఆలోచించుకొ సాగిందామె.

ఊర్వశి స్పృహనుండి తేరుకోవటం - తనవైపు ప్రియంగా చూసి సిగ్గుపడటం గమనించిన పురూరవుడు మహదానందభరితుడయ్యాడు. తన మనసులోని ఉత్సాహాన్ని ఆపుకోలేక చిత్రలేఖవైపు తిరిగి —

''నీ చెలి యిప్పుడిప్పుడే తేరుకుంటోంది. భయం తీరి తలెత్తి చూస్తున్న యీమె-చంద్రోదయమై చీకట్లు విచ్చిపోవు రాత్రివలె- పొగ అణగారగా ధగ ధగా వెలిగే అగ్నిజ్వాలవలె- గట్టు విరగబడి కలగిపోయి తిరిగి తేరిన గంగవలె కన్పిస్తోంది'' అన్నాడాయన.

ఆ మాటలు విన్న ఊర్వశి తనలోతాను నవ్వుకుంది. పురూరవుడి ఆంతరంగికాన్ని అర్థంచేసుకొని- ఏమీ తెలియనట్లు మౌనంగానే వుండిపోయింది.

ఊర్వశి యింకా పూర్తిగా స్పృహనుండి తేరుకోలేదని భావించిన చిత్రలేఖ తిరిగి ఆమె భుజం వూపుతూ—

"ఊర్వశీ! లేవే! మనల్ని పట్టుకున్న పీడ విరగడై చాలా సేపైంది-" అన్నది.

ఊర్వశి నెమ్మదిగా చిత్రలేఖవైపు తిరిగి ఏమీ తెలియనట్లు చూసింది ..

"చిత్రా" అని ప్రియంగా పిలిచింది.

"ఏమిటే-" అనడిగింది, చిత్రలేఖ.

"మనల్ని ఆ రాక్షసుడు పట్టుకొని పోయాడుకదా! సురనాథుని కీ విషయం తెలిసి ఆయన వచ్చి మనల్ని రక్షించాడా?"

"మనల్ని రక్షించింది దేవేంద్రుడు కాదు ఊర్వశీ! దేవేంద్రు సంతటి వాడైన యీ మహానుభావుడు మన అప కారిని పారద్రోలి మనల్ని రక్షించాడు. ఈయన ప్రతిష్ఠాన నగర చక్రవర్తి; పురూరవ నామధేయుడు. మన యింద్రు నకు ప్రియమిత్రుడు. గొప్ప పరాక్రమవంతుడు గనుక దేవా సురయుద్ధాలలో దేవపక్షాన నాయకత్వం వహిస్తూంటాడు.."

చిత్ర పల్కులు నాలకించిన ఊర్వశి క్రీగంట పురూ రవునిపై దృష్టి నిల్పింది. తొలిచూపులోనే ఆయనపై అను రక్తి ఏర్పడిం దామెకు.

అదేసమయంలో పురూరవుడు సైతం ఆమెవైపు చూశాడు. ఉభయుల చూపులూ కలుసుకున్నాయి. ఒకే మారు ఆ యిద్దరి హృదయపీఠాలపై మన్మథుడు అధిష్ఠించాడు.

ఊర్వశి ఆ రాజర్షి కళ్ళల్లో కళ్ళు పెట్టి చూడలేక

సిగ్గుతో నెమ్మదిగా తలదించుకొంది. అప్పుడు చక్కగా జనుపు తీరి తొలకరి మెరపువలె మెరుస్తున్న ఆ ఊర్వశిని చూస్తూ పురూరవుడు పలువిధాల ఆలోచించుకోసాగాడు.

"ఈ ఊర్వశి నారాయణఋషివల్ల జన్మించి నప్పుడు యీామె సౌందర్యాన్ని చూసి అప్సరసలంతా సిగ్గుపడి ఉండటంలో ఆశ్చర్యమేముంది? కానీ యింతటి సౌందర్యాం గనను ఒకముని పుంగవుడు సృష్టించాడనే మాటకూడా నమ్మదగినదిగా లేదు. వేదాలను ఆవృత్తి చేయ్యటంలోనూ-తప మాచరించటంలోనూ ఆ మునిపుంగవునకు మరొకరు సాటిరా రను మాట వాస్తవమే కానీ- ఇట్టి అందగత్తెను ఆయన ఎలా సృష్టించగలడు? మన్మథుడో, చంద్రభగ వానుడో, వసంతఋతువో- వీరిలో ఎవరైనా సృష్ట్యధి కారము వహించి- భావనచేత యీా లలనను సృష్టించి వుండవచ్చు. అంతేకాని తప మాచరించుకొను ఒకఋషి యీా అన్నులమిన్నను సృష్టించాడనటం నమ్మశక్యము కాని మాట. ఓహో! ఏమి యీా సౌందర్యము? నా కన్నులు మిరుమిట్లు గొల్పుచున్నవి. ఇంతటి గొప్ప సౌందర్యాన్ని చూసేందుకు నా కున్న రెండుకళ్లూ చాలటంలేదు. ఇట్టి భామినిని చూసిన రాక్షసుడు కాదు, ఎవ డూరకొనగలడు?' అనుకొని పురూరవుడు తనలో మన్మథవికారాలు రేకెత్తగా ఆమెపైని మోహంతో ఎన్నో రీతుల తలపోయ సాగాడు.

అప్పుడు ఊర్వశి చిత్రలేఖతో- "సఖీ! మన

స్నేహితురాండ్రు యిప్పు డెక్కడున్నారు? వారి కెలాంటి ఆపదా సంభవించ లేదు కదా-?'' అనడిగింది.

చిత్రకు ఆ సంగతి తెలియదని ఊర్వశికి తెలుసు. కాని తనే స్వయంగా పురూరవునితో మాట్లాడేందుకు సిగ్గు పడి- ఆయన తన మాటల్ని వినేట్లుగా చిత్రను ప్రశ్నించింది.

''ఆ సంగతి నా కెలాం తెలుస్తుంది? అభయప్రదాత మహారాజునే అడిగి వివరాలు కనుక్కో-'' అని సమాధానం చెప్పింది, చిత్రలేఖ.

ఊర్వశి మనోగతాభిప్రాయాన్ని గుర్తించిన పురూరవుడు ఆమెవైపు తిరిగి——

''సుందరీ! నీ విరహంతో రంభాది అప్సరస లంతా దుఃఖ సముద్రంలో మునిగివున్నారు. ఎప్పుడో ఒకసారి అకస్మాత్తుగా నిన్ను చూసిన వారెవరైనా నిన్ను విడిచి వుండలేరే! అలాంటిది నిరంతరమూ నీతోపాటు తిరిగే స్నేహితురాండ్రు నీ వియోగాన్ని ఎలా భరించగలరు? అదుగో, అటుచూడు. నీ సహచరులంతా హేమకూట పర్వతంపై గ్రహణము పట్టివిడిచిన చంద్రుని బోలివున్న నీ ముఖమండలాన్ని ఎంత మక్కువతో చూస్తున్నారో-'' అన్నాడాయన.

ఊర్వశి ఆయన మాటలు విని ''ఈ మహారాజు ఎంత తియ్యగా మాట్లాడుతాడు! ఈయనను చేరినకదా జీవితము ధన్యత నొందేది. క్రూరుడైన దానవుడు తనను

చెరపట్టి తీసికెళ్లడం కూడా, మహోపకారమే అయ్యింది. లేకపోతే యిట్టి అందగాడిని, తియ్యగా మాట్లాడగలవాడిని- గొప్ప బలపరాక్రమవంతుని చూసే భాగ్యం తనకు లభ్యమయ్యేదా? ఏది ఏమైనా అపకారం చెయ్యబోయిన ఆ రాక్షసుడు తనకు ఉపకారమే చేశాడు'' అని తలపోయ సాగిందామె.

ఆమె ఆలోచనలకు వెంటనే చిత్రలేఖ అడ్డుపడి—

''ఏమే, మహారాజు మాటలు విన్నావా?'' అన్నది.

''ఆఁ!''

''ఇప్పటికైనా మనస్సు ఫూరట పొందిందా?''

''ఊఁ! సరేకాని నువ్వు కొంచెం ప్రక్కకు జరుగు-''

''ఊహుఁ! వీలు లేదమ్మా-'' అని ముసిముసి నవ్వు ప్రదర్శించింది చిత్రలేఖ.

ఆ విధంగా ముగ్గురూ వేడుకగా మాట్లాడుకుంటూ హేమకూట పర్వతం సమీపించసాగారు.

* * *

అక్కడ హేమకూటపర్వతాన్ని చేరుకున్న రంభాది అప్సరసలు ఎంతసేపటికీ పురూరవుడు రాకపోయేసరికి మరింత చింతాక్రాంతు లయ్యారు.

''ఆ రాజర్షి మన హృదయబాధను తీర్చగలడో, లేడో?'' అన్నది మేనక, రంభతో.

"ఈ విషయంలో నువ్వేమీ సంశయపడకు మహేంద్రుడే దేవాసురయుద్ధాలలో ఆయనను సబహుమానముగా ఆహ్వానించి సర్వసేనాధిపత్యమునకు పట్టము కడుతూవుంటాడు. పురూరవుడు సామాన్య చక్రవర్తికాదు సుమీ-" అన్నది రంభ.

"ఏమో! దానవులు బహు క్రూరులు. మాయామంత్ర తంత్ర ప్రతిభావంతులు. ఒక్కోమారు మన దేవరాజే వారిముందు ఆగలేకపోయి ఎన్నిమార్లు పరాజయం పొందలేదు?"

"నీ వన్నదీ నిజమే! కాని పురూరవుడు గొప్ప తపోధనుడు. ఆయనముందు నీచులైన దానవులు ఆగలేరు. కనుకనే దేవేంద్రుడు ఆయనకు ప్రియమిత్రుడయ్యాడు —"

వారిద్దరు యిలా మాట్లాడుకుంటూవుండగా కొండపై ఏదో రథం వస్తున్న సవ్వడి స్పష్టంగా విన్పించింది. అందరూ ఆతురతతో రథం వస్తున్నవైపుగా దృష్టి సారించి, అటే చూడసాగారు.

"అదుగో! పురూరవుని రథమే కాబోలు యిటే వస్తోంది. జింక గురుతు వేసిన ధ్వజము గల రథము సోమదత్తమే! పురూరవుడు తాను పూనిన పనిని సాధింపక పూరకే వట్టిచేతులతో వచ్చేడివాడు కాదు. ఊర్వశీ చిత్రలేఖల చెర విడిపించి, వారితోపాటే వస్తుంటాడు" అన్నది సంతోషాతిశయంతో రంభ.

"అవును. నీ మాట నిజమే! మహారాజు చిత్రలేఖతో కూడా ఊర్వశిని వెంటబెట్టుకొని విశాఖానక్షత్రయుక్త చంద్రునివలె వస్తున్నాడు-" అంది మేనక.

"ఉభయతారకమైంది. మన ప్రియసఖి తిరిగి మనకు దక్కింది. మహారాజు కూడా సురక్షితంగా వున్నాడు."

అన్న రంభ మాట పూర్తిగాక మునుపే సోమదత్త రథం వారి ముందుకొచ్చి ఆగింది. పురూరవునితోపాటు తమ స్నేహితురాండ్రను కళ్లారా చూసి, ఆ అప్సరసలంతా ఎంతో ఆనందించారు.

పురూరవుడు ఆ అప్సరాంగనల నిద్దరినీ ముందు దించి, వెంటనే తానూ రథంనుండి దిగాడు. అంత ఊర్వశి తన స్నేహితురాండ్రవద్ద కెళ్ళి వాళ్ళనందరినీ గాఢంగా కౌగలించుకొని, కంట నీరు పెట్టుకుంది.

"నా బాధ ఏమని చెప్పను? మళ్ళీ మిమ్మలనందరినీ, దేవలోకాన్ని కళ్లి చూస్తానని అనుకోలేదు. సమయానికి యీ మహానుభావుడు వచ్చి నన్ను రక్షించి, తిరిగి మీ దర్శనభాగ్యాన్ని ప్రసాదించాడు. ఈ మహోపకారి లేకపోయివుంటే- నేనా పాపాత్ముని చేత చిక్కుకొని ఎన్ని కష్టాల పాలవుదునో కదా!" అన్నది గద్గద కంఠస్వరంతో ఊర్వశి.

"నిన్ను మాకు దక్కింప చేసిన యీ రాజర్షికి- మనమే విధంగా ప్రత్యుపకారం చెయ్యగలము?" అనడిగింది

ఊర్వశిని రంభ.

ఆమె మాటలకు పురూరవుడు నవ్వి-

"నా కెలాంటి ప్రత్యుపకారమూ మీరు చెయ్య నక్కర లేదు ఇప్పుడు నేను చేసిం దేమీ లేదు అంతా మన ప్రభువైన దేవేంద్రుని మహిమవల్లనే జరిగిపోయింది" అన్నాడు.

ఆయన వినయసంపదకు ఆ అచ్చరలంతా మెచ్చి-

"పురూరవ మహారాజునకు సహస్రానేక కల్పముల వరకు పృథ్వీపాలన సౌభాగ్యం లభించు గాక!" అని దీవించారు.

*　*　*　*

అక్కడ దేవలోకంలో ఇంద్రుడు తన ఏకాంతమందిరంలో కూర్చొని యిష్టసఖులతో కలిసి నాట్యవినోదాలను తిలకిస్తూ ఆనందించ సాగాడు.

అప్పుడొక చేటిక అక్కడికి వచ్చి-

"ప్రభూ! మీ దర్శనం కోసం నారద మహామునులు విచ్చేస్తున్నారు" అని చెప్పింది.

అదే సమయంలో నారదుడు అక్కడికి రానేవచ్చాడు. వేళ కాని వేళలో- చోటు కాని చోటుకు ఆ మహాముని రావటంతో దేవరాజు కీడును శంకించి ఆ మహాత్మునికి ఎదురేగి సాదరంగా నమస్కరించాడు.

నారదుడు ఎప్పటి వలెనే ఆ సురనాథుని దీవించి-

ఆయనతోపాటు లోపలికి నడిచాడు. ఒక ఉచితాసనంపై తీరిగ్గా కూర్చొని చుట్టూ పరికించసాగాడు.

అప్పుడు దేవేంద్రుడు ఆయన దగ్గరగా వచ్చి ముకుళిత హస్తుడై —

"మహాత్మా! వూరక రారు మహానుభావులు. తా మొచ్చిన విశేష మేమిటి?" అ నడిగాడు.

"విశేషాలను వెంటబెట్టుకోనిదే వస్తానటయ్యా యింద్రా! కాస్త తీరిగ్గా కూర్చోనివ్వు. ఆవల అన్నివిషయాలూ వివరించి చెబుతాను." అన్నాడా మునిశ్రేష్టుడు.

నారదముని అలా అనగానే దేవేంద్రుడి గుండెలు దిగజారిపోయాయి. తిరిగి దేవలోకంపై దానవులు యుద్ధ సన్నద్ధులై వస్తున్నారేమో నని కలవరపడినా డాయన.

"స్వామీ! మీరు త్రికాలజ్ఞులు. త్రిలోకసంచారులు. ఈ సమస్త ప్రపంచంలో ఎక్కడ ఏం జరుగుతున్నదో మీకు తెలియనిది లేదు. మీరు చెప్పదలచుకున్న ఆ విశేష మేమిటో సత్వర మే తెలియపరచి నా హృదయారాటాన్ని తీర్చండి" అన్నాడు దేవేంద్రుడు.

అందుకు నారదమహాముని నవ్వి—

"ఇంద్రా! ఎందు కంత కంగారు నీకు? నీ యింద్ర పదవిని పొందేందుకు ఎక్కడ-ఎవ రేమి చేస్తున్నారో ననే శంకతోనే, అన్ని విషయాలను అదేదృష్టితో చూస్తుంటావు. ఇప్పుడు నీ పదవి కొచ్చిన మోసం లేదు లే! అయినా పదవి

పైన నీ కెందుకయ్యా యింత వ్యామోహం?" అని నవ్వాడు నారదుడు.

ఆ మాటలకు దేవేంద్రుడు సమాధానం చెప్పలేక సిగ్గుతో తల వంచుకున్నాడు

"పోనీలే! నీ పదవి గొడవ నాకెందుకు? ఈ దినం నేను యథావిధిగా భూలోక సంచారం చేసి తిరిగి దేవలోకానికి వస్తున్నాను. అప్పుడు మార్గమధ్యంలో ఒక సంఘటన జరిగింది!"

"ఏమిటది స్వామీ?" అనడిగాడు వుత్కంఠతతో దేవరాజు.

"అదే చెప్పబోతున్నానుగా! మన దేవవేశ్యలైన రంభాది అప్సరసలంతా కుబేరుని భవనానికి వెళ్ళి తిరిగి వస్తున్నారు. అప్పుడు త్రోవలో వాళ్ళకు అడ్డుతగిలి నాడొక రాక్షసుడు..."

"ఎవడా క్రూరాత్ముడు స్వామీ?"

"హిరణ్యపుర వాసియైన కేశిదానవుడు. వాడు గొప్ప బలపరాక్రమ సంపన్నుడు. వాడు మన అప్సరసలనందరినీ చూసి, అందరిలోకి చిన్నదీ, గొప్ప సౌందర్యవతి, దేవలోకానికే అలంకారవతి, ముఖ్యంగా నీకు యిష్టసఖి అయిన ఊర్వశిని చిత్రలేఖతో పాటు చెరపట్టి తీసికెళ్లాడు. ఆ దుస్సంఘటనను కళ్ళారా చూసిన నేను భరించలేక, ఆ వర్తమానాన్ని నీ చెవిలో వేద్దామని పరుగు పరుగున

వచ్చాను. ఇదీ యింద్రా! నీకు చెప్పదలచిన విశేషం.''

''ఎంతపని జరిగింది స్వామీ? ఈ పాటికి ఆ దానవుడు పిరికిదైన ఊర్వశిని ఏమిచేసి వుంటాడోనని నా మనసు కలవరపడుతోంది. ఈ రాక్షసజాతి క్రూరచర్యలు ఎప్పటి కప్పుడు అధిక మవుతూనే వున్నాయి. ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు?''

''రాజకీయాలు తెలియని వాడిని నన్నడుగుతా వే మయ్యా సలహా? అష్టదిక్పాలకులను, గురుదేవులను సంప్ర దించి వెంటనే యుద్ధం ప్రకటించు.''

''ఎవరిపైన స్వామీ?''

''ఎవరిపైన అని నెమ్మదిగా అడుగుతా వేమిటయ్యా? ఆ హిరణ్యపురాధీశునిపై వేగిరమే దండెత్తి వెళ్ళు...''

''తన పురంలోనివాడు చేసిన నీచకార్యానికి, రాజు ఏ విధంగా బాధ్యుడవుతాడు స్వామీ! హిరణ్యపురాధీశునిపై యుద్ధానికి వెళ్లడం కొని తెచ్చుకున్న వైరమే అవుతుంది-''

''రాజు చేసినా, భృత్యుడు చేసినా నేరం నేరమే! మన ఊర్వశిని ఆ హిరణ్యపురవాసి ఎత్తుకపోయాడు గనుక, పరోక్షంగా అందుకు హిరణ్యపురాధీశుడుకూడా బాధ్యుడే. ఊం! కానియ్! శీఘ్రమే యుద్ధనగారా మ్రోగించు-''అన్నా డా కలహభోజనుడు.

'స్వామీ! మీ సలహాప్రకారం క్షణకాలం ప్రవర్తిం చానంటే నాకీ యింద్రపదవి వుండదు, నేనూ వుండను.

దయచేసి నాకిక సెలవిప్పించండి. వేగిరమే ఆ దానవుణ్ణి సంహరించి, ఊర్వశిని విడిపించే వుపాయం ఆలోచిస్తాను'' అని పలికాడు దేవరాజు.

''అవశ్యం; అలాగే కానిమ్ము. ఏదో నాకు తోచింది చెప్పాను. దాన్నే అవలంబించమని చెప్పానటయ్యా! సరే నీ వుపాయమేదో ఆలోచించుకో! నేను నారాయణ దర్శనానికి వెళ్ళుతున్నాను...''

అని నారదమహాముని అక్కడినుండి నిష్క్రమించాడు. ఆయన వెళ్ళిపోగానే తనకు అన్నివిధాల సంతోషపరురాలైన ఊర్వశిని కేశిదానవుడు ఎత్తుకపోయాడన్న చింతచేత ఏమీతోచక చిత్రరథుడనే గంధర్వుని పిలిపించాడు, దేవేంద్రుడు.

చిత్రరథుడు రాగానే అతన్ని సమీపించి,

''ఓయీ గంధర్వరాజా! మన ఊర్వశి అలకాపురినుండి వస్తుండగా చూసి, కేశిదైత్యుడు చెరపట్టి తీసికెళ్ళాడని యిప్పుడే నారదమహాముని చెప్పాడు. ఆమె తగని పిరికి గుండె కలది. దయలేని ఆ రక్కసునిచేత చిక్కి ఏమైనదో తెలియలేదు. నువ్వు శీఘ్రమే నీ సేనతోపాటు వెళ్ళి, ఆ దుర్మార్గుని గర్వమణచి, ఆమెను తోడ్కొని రమ్ము,'' అని ఆజ్ఞాపించాడు.

చిత్రరథుడు వెంటనే ఆయనవద్ద సెలవుతీసుకొని తన సేనతోపాటు ఊర్వశిని చెర విడిపించేందుకు బయలు

చేరాడు. కాని మార్గమధ్యంలో చారులు కన్పించి,

"పురూరవుడు ఊర్వశిని తోడ్కొనివచ్చి ఆమె చెలులగు అచ్చరలతో గూడా హేమకూట శిఖరానవున్నా"డని చెప్పారు.

అంత చిత్రరథుడు ఊర్వశి సురక్షితంగా తిరిగి దక్కినందుకు సంతోషించి హేమకూట పర్వతంవైపు ప్రయాణమయ్యాడు.

అప్పుడే పురూరవుడు ఆ అచ్చరలవద్ద సెలవుతీసికొని తిరిగి తన అంతఃపురానికి బయలు దేర బోతుండగా-అంతలో ఆకాశంలో మెరపు మెరసినట్లయి- వురుము వురిమినంత గొప్ప శబ్దమయ్యింది.

అదేమిటోనని అందరూ అటే ఆతురతతో చూస్తుండగా ఆకాశంనుండి చిత్రరథుడు వచ్చి పురూరవుని ముందు నిలిచాడు. తన ప్రియమిత్రుడైన చిత్రరథుని చూడగానే పురూరవు డెంతో ఆనందించాడు. వెంటనే అతన్ని కౌగలించుకొని కుశల ప్రశ్నలు వేశాడు.

"రాజా! కేశిదైత్యుడు ఊర్వశిని బంధించి తీసికెళ్లిన సమాచారం నారదులవారిద్వారాయింద్ర దేవులకు తెలిసింది. తక్షణమే వారు నన్ను రప్పించి, గంధర్వ సేనలతోపాటు వెళ్ళి ఊర్వశిని విడిపించుకొని రావలసిందిగా ఆజ్ఞాపించారు. అందుకని నేను సేనలను వెంటబెట్టుకొని బయలుదేరాను. కాని త్రోవలో మీ విజయాన్ని కొనియాడుతూ వంది

మాగధులు కన్పించి విషయమంతా వివరంగా చెప్పారు. అందువల్లనే నే నిక్కడికి వచ్చాను-''అన్నాడు చిత్రరథుడు.

''ఏది ఏమైనా బహుకాలానికి తిరిగి మీ దర్శనం కల్గింది. చాలా సంతోషం-'' అని పురూరవుడు మందహాసం చేశాడు.

''పూర్వం యీ ఊర్వశిని నారాయణముని సృష్టించి యింద్రుని కిచ్చాడు. ఇప్పుడామె ఒక రాక్షసునికి బంధితురాలు కాగా, మీ రామెను రక్షించి తిరిగి యిచ్చారు. మీ రిప్పుడు నాతోపాటు ఊర్వశిని తీసుకొని దేవరాజువద్దకి రండి. యదార్థానికి యీ సమయంలో ఆయన కెంతో సహాయపడినవా రయ్యారు...''అన్నాడు తిరిగి చిత్రరథుడు.

''మిత్రమా! నా పైని ప్రత్యేకమైన అభిమానంవల్ల నీ విలా మాట్లాడుతున్నావే కాని- యిందులో నేను చేసిన దేముంది? ఆ సురుని నేను సంహరించటం కూడా యింద్రుని మహిమవల్లనే కదా! సింహము గర్జింపగా దాని ప్రతిధ్వని విని వులికిపాటుతో ఒక ఏనుగు చచ్చిన- అది ప్రతిధ్వని శక్తియా?''

''అవును. నీ మాటకూడా యుక్తమైనదే! వినయము విక్రమాలంకారముకదా!''

''మిత్రమా! ఈ సమయంలో నేను యింద్రుని కలుసుకోజాలను. అందువల్ల మీరే యీమెను ఆయనవద్దకి తీసికెళ్ళండి. ఆయనకు నా నమస్కృతులు తెలియచెప్పండి..''

చిత్రరథుడు పురూరవుని మనస్సును బాగా ఎరిగిన వాడవటంవల్ల తిరిగిఆయనను బలవంతం చెయ్యలేకపోయాడు. ఆ తర్వాత ఒక్కొక్కరే ఆయనవద్ద సెలవుతీసుకొని ఆకాశ గమనులయ్యారు.

ఆ విధంగా అందరూ ఆయనవద్ద సెలవుతీసుకొని వెళ్ళి పోతుండగా– తనకు మహోపకారియైన ఆ రాజర్షి సెల వడుగగోర. తానుగా అతనితో మాట్లాడేందుకు ఊర్వశి బిడియపడింది. తన చెలికత్తె చిత్రలేఖను సమీపించి ఆమె చెవిలో రహస్యంగా —

"చిత్రా!ఉపకృతి పొందికూడా మహారాజును సెల వడుగలేక పోతున్నానే! ఎందుకో ఆయనముందు పెదవి కది పేందుకు సిగ్గు ముంచుకొస్తోంది. నా మాటగా ఆయనకు చెప్పి, సెల వడుగవే" అంది.

అందుకు చిత్రలేఖ నవ్వి మహారాజువద్ద కొచ్చింది. ఆమె ఏం మాట్లాడబోతుందోనని పురూరవుడు ఆతురత పడసాగాడు.

"రాజా! మీరు అనుమతిస్తే మీ కీర్తిని తన సఖిగా చేసుకొని దేవలోకానికి తీసికెళతానని మా ఊర్వశి మీతో చెప్పమన్నది..." అన్నదామె.

"అలాగే కానివ్వమను. కాని నన్ను మరువకండి. త్వరలో మీ దర్శనభాగ్యం కలుగ చెయ్యండి. మీ కోసం వెయ్యికనులతో వేచివుంటాను .." అన్నాడు పురూరవుడు.

ఇహ ఊర్వశి అక్కడ నిలవలేక పోయింది. వెంటనే దేవలోకానికి బయలుదేరింది. కాని ఆమె కాళ్ళు ముందుకు సాగుతున్నా- మనస్సు వెనక్కు లాగుతోంది. ఆ మనస్సుకు సహాయపడేటందుకే కాబోలు ఆమె వైజయంతిమాల ఒక చెట్టుకొమ్మకు చిక్కుకుంది.

ఊర్వశి బయలుదేరింది కదా అనుకొని ముందు నడుస్తున్న చిత్రలేఖ ఎంతసేపటికి ఆమె తనను చేరుకోలేకపోవడం వల్ల వెనుదిరిగి చూసింది. ఊర్వశి తన వైజయంతిమాలను చెట్టుకొమ్మనుండి తీసే ప్రయత్నంలో వుంది. మాటిమాటికీ పురూరవునివైపు క్రీగంట చూస్తున్న దృశ్యం ఆమె కంట బడింది. ఆమె మనస్సును చక్కగా ఎరిగిన చిత్రలేఖ, క్షణంలో విషయమంతా గ్రహించి తనలో తాను నవ్వుకుంది.

"ఊర్వశీ! ఇక రావే, ఏమిటీ ఆలస్యం?" అన్నది.

అందుకు ఊర్వశి చిరుకోపం ప్రకటించి,

"అబ్బ! కాస్త ఆగవే! నా హారం యీ చెట్టు కొమ్మకు చిక్కబడింది. ఎంతలాగినా రావటం లేదు" అంది.

"నీ హారానికి వేళాపాళా తెలిసినట్లు లేదు. ఎక్కడ బడితే అక్కడ చిక్కుకోవడమే! బాగుందమ్మా," అని తిరిగి నవ్వింది చిత్రలేఖ.

"చాలించవే నీ పరిహాసం. నీ వేళాకోళానికి గూడ వేళాపాళా వున్నట్లు లేదు. ఇటు వచ్చి సాయం చెయ్యే

రాదూ!''

ఊర్వశి అభిప్రాయం గ్రహించి చిత్రలేఖ నవ్వుతూనే వచ్చి,

''ఈ హారం యిప్పుడిప్పుడే విడివడేట్లు లేదు. చాలా దృఢంగా చిక్కుకుంది, అయినా ప్రయత్నిస్తా నుండు...'' అని ఆ హారాన్ని చెట్టుకొమ్మలనుండి ప్రక్కకు తప్పించింది.

చిత్రలేఖ ఆ హారాన్ని తీసే ప్రయత్నంలో వుండగా ఊర్వశి పురూరవునివైపు తలద్రిప్పి, తృప్తిదీరా ఆ రాజర్షి కళ్ళల్లోకి చూసి చిరునవ్వులు ఒలికించింది.

వారిద్దరి సంభాషణా వింటూ రథంపై నిల్చున్న పురూరవుడు, ఊర్వశి తనను చూసేందుకు చెట్టుకొమ్మకు హారం చిక్కుకుందన్న నెపంతో కొన్ని క్షణాలు అలాగే వుండి పోవటంతో పురుషసహజమైన మన్మథ వికారానికి పూర్తిగా లోనయ్యాడు.

ఆయన చూస్తూ చూస్తూండగానే చిత్రలేఖతోపాటు ఊర్వశి వెళ్ళలేక ఎలాగో వెళ్ళిపోయింది.

అందరూ వెళ్ళిపోగా ఒంటరిగాడైన ఆ రాజర్షి తిరిగి ఊర్వశిని తా నెప్పుడు చూతునోకదా అని ఆరాట పడ్డాడు. ''ఆ సుందరి ఆకాశానికి ఎగిరినప్పుడు, తెగిన తామరతీగనుండి పోగులను రాజహంసిక లాగునట్లు, తన శరీరంనుండి మనస్సును వూడదీసి తనతోపాటు తీసికెళ్ళింది. ఇక ఎప్పుడు ఆ నయనసుందరి దర్శన మగునో, ఏమో!''

అని పలు తెరంగుల ఆమెనుగూర్చి ఆయన ఆలోచించుకో సాగాడు.

అంతలో రథం కదిలింది.

రథసారథి సూతుడు రాజాజ్ఞ ప్రకారము తిరిగి రథాన్ని అంతఃపురంవైపు మళ్ళించాడు.

పురూరవుడు అంతఃపురం చేరుకున్నాడేగాని ఆయన మనస్సు మనస్సులో లేకపోయింది. నిరంతరమూ ఊర్వశిని గూర్చిన ఆలోచనలే ఆయనను చుట్టుముట్టసాగాయి. భోజనం చెయ్యటం మాని, నిద్రపోవటం మరచిపోయి ఊర్వశి మీది చింతతో రాజవ్యవహారాలలో ఏదీ బోధపడనందున మనశ్శాంతి కోసం తన ప్రాణస్నేహితుడు, వినోదకుడైన మాణవకునితో తన ప్రేమరహస్యం చెప్పి ఆ విషయాన్ని ఎక్కడా బయటపెట్టవద్దని ఆజ్ఞాపించాడు. అతడును అల్లేనని రాజరహస్యం కాపాడుతూరాసాగాడు.

# 3

ఊర్వశి చిత్రలేఖతోపాటు తన నివాసస్థానం చేరుకుంది.

హంసతూలికాతల్పంపై మేనువాల్చి అంతవరకు జరిగిన సంఘటనల నన్నింటినీ మననం చేసుకోసాగింది తను కుబేరా స్థానంనుండి తిరిగి వస్తున్న సమయంలో, మార్గమధ్యంలో కేశిదైత్యుడు అడ్డుపడటం, వాడు తనను కామించి, చిత్రలేఖతోపాటు చెరపట్టి ఆకాశమార్గాన వెళ్ళటం, వాడి క్రూరచర్యకు తను స్పృహతప్పి పడటం, కళ్ళు తెరచేలోగా వికృతాకారుడైన రాక్షసాధమునికి బదులు నయనసుందరుడూ, స్మితాస్యుడు నగు పురూరవచక్రవర్తి! ప్రక్కనుండటం, ఒక్కొక్క దృశ్యమే ఆమె కనులముందు మెదల సాగింది.

ఆ పురుషోత్తముని చూడగానే తను సామాన్య మానవస్త్రీవలె సిగ్గుపడింది. అతని కనుల్లో కనులు పెట్టి సూటిగా చూడలేకపోయింది. ఆ రాజర్షికి ముఖస్తంగా కృతజ్ఞత చెప్పుకోలేక, చిత్రలేఖద్వారా చెప్పించింది. తొలిచూపులోనే తన కాతనిపై ఎందుకింత మోహాధిక్యత ముంచుకొచ్చింది?

ఊర్వశి ఆ విధంగా తలపోస్తూ తల్పంపై అటూ యిటూ కదలసాగింది. ఆమె ఎదలోని ఆరాటాన్ని గుర్తించిన చిత్రలేఖ చప్పుడుగాకుండా దగ్గరగా వచ్చి వెనుకపాటున ఆమె కళ్ళు మూసింది.

"ఎవరూ!" అన్నది ఊర్వశి.

చిత్రలేఖ పలకలేదు.

"ఎవరది?" అన్నది తిరిగి ఊర్వశి.

"పేరు చెప్పుకోవాలి మరి-" కంఠం మార్చి చిత్రలేఖ అంది.

పురూరవునిపై మరులుగొన్న ఊర్వశి ఆ కంఠస్వరం అతనిదే నని భ్రాంతిపడింది.

"నా హృదయచోరులా?" అన్నది లజ్జాధోరణిలో.

ఆ మాటతో చిత్రలేఖ కిలకిలా నవ్వింది. చప్పున ఆమె ముందుకు వచ్చి—

"ఎవరమ్మా, నీ హృదయచోరులు?" అంది నవ్వుతూనే.

ఈ మారు నిజంగానే ఊర్వశి సిగ్గుపడింది. తన ప్రేమమూర్తిమీది మోహంతో ఏం మాట్లాడుతున్నదో తెలీని స్థితిలోకి వచ్చిందామె.

"చెప్పమ్మా నీ హృదయాన్ని దొంగిలించిన ఆ భాగ్యశాలి ఎవరో?" అనడిగింది తిరిగి చిత్రలేఖ.

"పూరుకోవే, ఏమిటి నీ పరిహాసం?"

"పరిహాసంకాదు ఊర్వశీ! యదార్థమే. నిన్ను మదనతాపానికి గురిచేసిన ఆ రసరాజ్యచక్రవర్తి ఎవరో నేను తెలుసుకో కూడదా?"

"నా నోట చెప్పించాలని పంతమా?"

"ప్రేమరహస్యాలు ఎవరికి వాళ్ళు తను నోటంట

చెబుతేనే మధురంగా వుంటాయి ..''

''వినాలని కుతూహలంగా వుందా?''

''కాదా మరి!''

''అయితే నేను చెప్పను-''

''చెప్పకపోతే నువ్వే మరింత బాధపడతావు! నీ హృదయం పూర్తిగా స్వాధీనం తప్పాక, 'అయ్యో! నిజం చిత్రకు చెప్పకపోతినే' అని ఆరాటపడతావ్''

''ఈ మాటలతో నన్ను బేలనుచేసి నిజం చెప్పించాలని చూస్తున్నావా?''

''ఆ మాత్రం ఊర్వశి మనస్సు నాకు తెలీదా?''

''అయితే విను- నా హృదయం పురూరవచక్రవర్తిపై మరులుగొన్నది --''

ఊర్వశి ప్రేమరహస్యం బయట పెట్టేసరికి చిత్రలేఖ కిలకిలా నవ్వింది.

''ఏమిటా నవ్వు! నా మనసులోని మాట చెప్పగానే వెర్రిగా నవ్వుతా వెందుకు?''

''ఊర్వశి ఓడిపోయిందని హృదయం నవ్వమంది; నవ్వాను. మొత్తానికి నీ ఆశ అంతస్థు దాటింది-''

''ఏ విధంగా-''

''ఆయన రాజర్షి. నువ్వు దేవవేశ్యవు. ఆయన భూలోక చక్రవర్తి; నువ్వు మహేంద్రునకు సుకుమార కోమలాయుధవు. యిద్దరికీ పొత్తెక్కడ ఊర్వశీ!''

చిత్ర మాటలు విని ఊర్వశి ముఖం క్రిందకు దించుకుంది. ఆమె స్థితి చూసి చిత్రలేఖ తనలో తాను నవ్వుకుంది.

"ఏం? ఇప్పటికైనా తెలిసిందా? ప్రేమించట మంటే చాలా సులభమను కొన్నావ్ కాబోలు! అంతస్థులు, అంతరాలు అడ్డం వస్తాయనే భావం కల్గలేదు నీకు? అయినా నీకీ అనుభవం క్రొత్త గనుక ఓ మారు ప్రయత్నించి చూడు..." అని తిరిగి నవ్వింది చిత్రలేఖ.

ఈ మారు ఊర్వశి పెదవులపై మందహాసం తొణికిసలాడింది. వయ్యారంగా లేచి, హంసగమనవలె నడుస్తూ వెళ్ళి బంగారుతూగుటుయ్యాలపై కూర్చుంది. వెనుకపాటునే చిత్రలేఖ వచ్చి ఆమె సరసనే కూర్చున్నాక ఉయ్యాల అటూయిటూ వూగసాగింది.

కొంతసేపటిదాక ఉభయులూ మాట్లాడుకోలేదు. ఊర్వశి గంభీరమైన ఆ మౌనముద్రను చాలాసేపు భరించలేక పోయిండి.

"చిత్రా-" అని నెమ్మదిగా పిలిచింది.

"ఏమ్మా!"

"నే నొకటి అడగనా?"

"ఏమిటది?"

"అడిగాక నన్ను చిన్నచూపు చూడవుగా!"

"ఎప్పుడూ పరిహాసమేనా! అయినా నిన్ను చిన్న

చూపు చూస్తానని ఎందుకను కున్నావ్!''

''నా ప్రశ్నకి ప్రత్యుత్తరం యిస్తావుగా!''

''ఆఁ!''

''అబద్ధం చెప్పవుగా!''

''అబ్బబ్బ! ఏమి యక్షప్రశ్నలు! నీ ఎదలోని మాట ఏదో చప్పున బయట పెట్టరాదా?''

''ఇంతవరకు నువ్వు మాట్లాడిన మాటలన్నీ నన్ను ఏడ్పించేందుకే కదూ!''

''ఇన్ని మాటలు చెప్పి, యిదా నువ్వు అడగదలచు కున్న మాట?''

''కాదులే? ముందీ ప్రశ్నలకు జవాబు చెప్పు. అవునా? కాదా?''

''పిచ్చి ఊర్వశీ! నీ కెందుకమ్మా, యింత ఆరాటం? చిన్నదైన ఊర్వశి గడుసరిది అనుకున్నాను, కాని యింత బేలదని ఊహించుకోలేదు నీ జగదేక సౌందర్యాన్ని గాంచి మోహించని వారెవరు? నీ అపురూపలావణ్య సంపద ఎందరిని మదన తాపానికి గురిచేసిందో నీ కేం తెలుసు? దేవేంద్రుడే నీ ముగ్ధ మోహనరూపానికి తలొగ్గుతూంటే, యిహ ఆ పురూరవు డెంత? పిచ్చిపిచ్చి ఆలోచనలతో వూరకే కలత పడకు...''

''చిత్రా! నువ్వు నిజంగా చిత్రమైన దానివే!''

''నువ్వు మాత్రం సామాన్యురాలవా! నీ పేరులోనే

గొప్ప సౌందర్యం యిమిడివుంది. కనుక నువ్వూ చిత్రమైన దానివే!''

ఆ మాటతో ఊర్వశి నవ్వు నాపుకోలేక ఫకాలున నవ్వింది. ఆమెతోపాటు చిత్రలేఖ కూడా నవ్వకుండా వుండలేక పోయింది.

''ఈ పరిహాసపుమాటల కేమిగాని నేను వెళుతున్నా నమ్మా? సూర్యారాధనకు వేళైంది -'' అని చిత్రలేఖ అక్కడి నుండి వెళ్ళిపోయింది.

చిత్రలేఖ నిష్క్రమించటంతో ఊర్వశి తిరిగి పురూరవుని గురించిన ఆలోచనలతో, తియ్యటి కలలు కనసాగింది.

## 4

కాశీ రాజపుత్రి జొసీనరి తన ఏకాంతమందిరములో కూర్చొని వుంది. ఎందుకోగాని ఆమె ముఖం కళావిహీనమైవుంది. ఏదో దీర్ఘాలోచనలో సతమత మవుతున్నట్లు ఆమె ముఖ కవళికలు స్పష్టపరుస్తున్నాయి. ఆలోచనల తీవ్రతవల్ల అప్పుడప్పుడు గాఢంగా నిట్టూరుస్తోంది.

ఆ విధంగా ఆమె తనలో తాను మథనపడుతుండగా చేటి నిపుణిక ఆ మందిరంలోకి ప్రవేశించింది. దేవేరి ముఖ కవళికల్ని గమనించి, ఆమె ఎందుకో వ్యసనపడుతోందని సులభంగా గ్రహించింది. నెమ్మదిగా ఆమెను సమీపించి, 'దేవీ' అని పిలిచింది.

ఆ పిలుపుతో జొసీనరి యిటు తిరిగి చూసింది. ఎదురుగ్గా నిపుణిక నిల్చొని తనవైపు తదేకంగా చూస్తున్న దృశ్యం కన్పించాక మరోమారు గాఢంగా నిట్టూర్చింది.

"దేవీ! ఏకాంతంగా వున్నారేమిటి?" అనడిగింది నిపుణిక.

జొసీనరి మాట్లాడలేదు. నిపుణిక అంతటితో ఆగలేదు.

"దేవీ! ఏమిటా మూగవ్రతం? ఉదయం నుండి మీ చర్యల్ని గమనిస్తున్నాను. ఎందుకోగాని యీ దినం మీ ప్రవర్తనలో గొప్ప మార్పువచ్చింది. ఎందుకమ్మా, అలా వున్నారు?"

ఈ మారుకూడా ఔ సీనరి సమాధానం పలుకలేదు.

"నాతో చెప్పరానంత రహస్యమైన బాధ అను భవిస్తున్నారా దేవీ? పోనీ మీ మనోల్లాసానికి వీణ వాయించనా?"

"వద్దు-"

"అయితే నృత్య, వినోదాలను ఏర్పాటు చేయించ చనా?"

"ఊహుఁ!"

"మరి మీ సంతోషం కోసం నన్నేం చెయ్యమన్నా రమ్మా!"

"ఏమీ అక్కర్లేదు. నువ్వు కాస్సేపు వూరుకో-"

"అలాగంటే ఎలాగమ్మా? మీ మనసు మనసులో లేదని తెలిసికూడా నేనెలా వూరుకోను? దేనికోసమై మీ రింతగా బాధపడుతున్నారో చెప్పండి. మీ మానసిక వ్యధ తొలగించబడే ఉపాయం చెబుతాను-" అన్నది నిపుణిక.

ఆమె మాటలవల్ల ఔసీనరి హృదయం కొంతవరకు వూరట చెందింది. తనలోని ఆరాటాన్ని ఆమెతో చెప్పి సంశయ నివృత్తి చేసుకుందా మనుకుంది.

"నిపుణికా! మహారాజుగారు నిన్నటి నుండి ఏదో పరధ్యానంగా వున్నారు. పిలిచినా పలకరు. మాట్లాడించినా మాట్లాడరు. ఆ సంగతి నీకు తెలుసా?"

"ఎందుకు తెలియదమ్మా! వారు సూర్యోపస్థానము

సల్పి తిరిగి వచ్చినప్పటి నుండి శూన్యహృదయులవలె కన్పిస్తూ వున్నారు. ఈ మాత్రానికేనా మీ రింత ఆవేదన పడు తుండేది?''

''అవును నిపుణికా! వారు నిన్నటి నుండి చాలా పరధ్యానంగా వున్నారు. ఏదో చింతతో కొంచెం చిక్కిన ట్లున్నారు కూడా! వారి ప్రవర్తనను బట్టి చూస్తూంటే యి దంతా ఏదో యువతీ విరహమేనని స్పష్టమౌతోంది ..''

''కావచ్చు. మహారాజుగారి మనస్సు క్షణ మొక తీరుగా మారిపోతుందని లోకవిదితమే కదా! సూర్యోపాసన సల్పి తిరిగి వస్తున్నప్పుడు వారి కంటికి ఏ సుందరాంగన యైనా కన్పించిందేమో...''

''నేనూ అదే భావిస్తున్నాను. కాని నా ఊహ నిజమో కాదో స్పష్టంగా తెలియటంలేదు. నిపుణికా! నువ్వు సార్థకనామధేయురాలివి. పనులు చేసుకొని రావటంలో అతి నిపుణురాలవు. నాకో పని చేసిపెట్ట గలవా?''

''అవశ్యం! ఆ పని ఏదో తక్షణమే ఆజ్ఞాపించండి, దేవీ!''

''మహారాజుగారి మనస్సు ఎందుకు అన్యథా మళ్ళిందో- వారి హృదయాన్ని మంత్రించుకున్న ఆ భాగ్య శాలిని ఎవరో నువ్వు తెలుసుకొని రావాలి...''

''అదెలా సాధ్యమౌతుందమ్మా? మహారాజుగారి ఆంతరంగిక విషయం నే నెలా తెలుసుకొని రాగలను?''

"ఈ మాత్రపు ఆలోచన నేను చెప్పలేమిటే! మహారాజుగారి ప్రియవయస్యుడైన విదూషకుని వద్ద కెళ్ళి నీ మాయమాటలతో శ్రీవారి ఔదాసీన్యానికి కారణమేమిటో అడిగిరావే!"

"మంచి ఆలోచనే దేవీ! ఆ విదూషకుని నోటిలో నువ్వుగింజయినా దాగదు. ఇహ శ్రీవారి గుప్తప్రేమ యంతటి గొప్పవిషయం అతని నోటిలో దాగియుండ గలదా? ఇప్పుడే వెళ్లొస్తాను..."

అని నిపుణిక అక్కడినుండి వేగంగా వెళ్లిపోయింది. ఆమె కార్యార్థియై వెళ్ళగానే తిరిగి ఔశీనరి తన ఆలోచనల్లో మునిగి పోయింది.

***    ***    ***

విదూషకుడు పురూరవుని ప్రేమరహస్యం విన్నప్పటి నుండి తన నాలుకను కట్టివేసుకొని ఎవరికంటా బడకుండా తప్పించుకు తిరుగసాగాడు.

ఆ నాడు మహారాజు కొలువునుండి వచ్చేవరకు తాను ప్రాసాద ప్రాంతమందు సంచరింపదలచి ఒంటరిగా అక్కడికి చేరాడు. కాని ఎవరికంటా బడకూడ దనుకున్న అతని ప్రయత్నము వ్యర్థ మయిపోయింది.

మహారాణి ప్రియచేటి నిపుణిక విదూషకుని కోసం ఎన్నోచోట్ల గాలించి తిరిగి తిరిగి ప్రాసాదప్రాంతం చేరుకుంది.

అక్కడ ఒంటరిగా తనలో తాను ఏదో గొణుక్కుంటున్న విదూషకుని 'గతికమీద పడిన మంచులా ఇతని దగ్గర రహస్యాలు క్షణమైనా దాగవు. ఏ విధంగానైనా రాజ రహస్యం తెలుసుకోవచ్చునని-' తలచి నెమ్మదిగా అతన్ని సమీపించింది. కాని విదూషకుడు తన ఆలోచనల్లో తాను మునిగివుండి నిపుణిక రాకను గుర్తించ లేదు.

"స్వామీ! విదూషకచక్రవర్తీ! చేటి నిపుణిక నమస్కరిస్తోంది, స్వీకరించి మన్నించండి" అన్నది ఎంతో వినయంతో నిపుణిక.

ఆమెను చూడగానే విదూషకుడు కలవరపడ్డాడు. 'ఓహోహో! ఈమె సమయానికి ఎక్కడినుండి వూడిపడింది. ఈ నిపుణిక పేరుకు తగ్గట్లు చాలానిపుణురాలు. నేనీమెవద్ద నోరుజారక చాలా జాగ్రత్తగా మెలగవలసివుంటుంది. లేకపోతే యీ దుష్టచేటి నా వద్ద రాజరహస్యం కనుక్కొని ఆ వర్తమానాన్ని దేవికి అందజేసి గొడవ చేయకపోదు ..' అని విదూషకుడు తనలో భావించి ఆమెవైపు దృష్టి నిలిపాడు.

"ఓహో! మహారాణి ప్రియచేటిక నిపుణికవా! బాగుబాగు, సంగీత పారాయణం చేసి యిలా యెక్కడికి వెళుతున్నావు?" అన్నాడతను.

"మీ కోసమే స్వామీ!" అని తక్కున సమాధానం చెప్పింది నిపుణిక.

"ఏమిటీ! నా కోసమా! చాలా వింతగా వుందే!

నా వల్ల ఏమైనా బహుమతులు కావలసి వచ్చావా? లేక..."

"అదేమీ కాదు మహాత్మా! దేవిగారి ఆజ్ఞననుసరించి మీ దర్శనం కోసం వచ్చాను..."

"ఏమీ! మహారాణిగారు నా దర్శనంకోసం నిన్ను పంపారా? మరి యింతవరకు ఆ విషయమే చెప్పావు కాదేం? దేవిగారి ఆజ్ఞ ఏమిటో వెంటనే చెప్పు..."

"అయితే వినండి. 'నీవు నా మీద మిక్కిలి అభిమానము గలవాడవే అయితే- నే నింతగా దుఃఖపడుతున్నా, ఏమీ యెరుగని వానివలె నటిస్తావా?' అని మీతో చెప్పి రమ్మన్నారు....."

"ఏమి టేమిటీ! దేవి దుఃఖసముద్రంలో మునిగి వున్నదా? నా కా సంగతి యింతవరకు తెలియదే? ఆమె దుఃఖానికి కారణ మేమై వుంటుంది నిపుణికా?"

"ఆ సంగతి నా కెలా తెలుస్తుంది స్వామీ! మహారాజుగారి ప్రాణమిత్రులు మీరు. మీకు తెలియనిదేముంది?"

"అవును, నిజమే! మహారాజుగారు ఏమైనా దేవి యెడ ప్రతికూలంగా ప్రవర్తించారా?"

"అవునట! రాజుగారు రాణిని తాను వలచిన స్త్రీ పేరుతో పిలిచారట! ఎంత గొప్ప పొరపాటు జరిగిందో చూడండి-"

"ఆ! అంతపనీ జరిగిందా? దేవిని 'ఊర్వశీ' అని

పిలిచాడా? ఆ అప్సరసను చూచిన దినంనుండి వృద్ధిపట్టి దేవిగారిని దుఃఖసముద్రంలో ముంచటమే గాకుండా నా ప్రాణాలుకూడా తీస్తున్నాడు..."

"సరే, నేను వెళ్ళి రాణీగారికి ఏమని చెప్పమంటారు" అనడిగింది, నిపుణిక.

"నేను రాజుగారికీ వెఱ్ఱి కాస్త విడిచి ఎండమావుల నెంబడింపకుండా వెనుకకు మరలేట్లుగా చేసిగాని, రాణీగారి ముఖం చూడనని చెప్పు——"

"అలాగే. ఇహ నాకు సెలవా మహాత్మా!"

"మంచిది, వెళ్లు"

అని విదూషకు డనగానే ఆ చేటి వేగిరమే దేవికి రాజరహస్యం చెప్పేందుకు అక్కడి నుండి వెళ్ళిపోయింది.

అంతలో మహారాజు ధర్మాసనం నుండి లేచివస్తున్న కలకలం విదూషకునికి వినిపించింది. వెంటనే అత నక్కడి నుండి బయలుదేరి మహారాజును కలుసుకున్నాడు.

పురూరవుడుమునుపటివలెనేఊర్వశిపైనిమోహంతో యెప్పుడూ ఆమెమీద ధ్యాసతప్ప మరొకటి లేక ఆ అచ్చ రను గురించిన ఆలోచనలతో సతమత మవ్వసాగాడు. తన చెలికాడు విదూషకుడు కన్పించగానే తిరిగి అతని ముందు ఆమెను గురించి ప్రస్తావించా డాయన.

"విదూషకా! ఆ ఊర్వశిని చూసిన మరుక్షణం నుండి ఆమెపై మోహంవల్ల నేను పడుతున్న బాధ అంతా

యింతా కాదు. మన్మథుడు యెంత గొప్ప ప్రతిభావంతుడో గాని, ఆమెపైని ఆలోచనలవల్ల నా గుండెతూట్లుపడిపోతోంది''

''అవునవును. ఆమె ఆలోచనలతో నీ గుండెతూట్లు పడుతోంటే, అది చూడలేక నా ప్రాణము హరించుకపోతోంది'' అన్నాడు విదూషకుడు.

''అదేమిటి వింతగా మాట్లాడుతున్నావ్? నా మాటలతో విసిగి నేను ఊర్వశిని ప్రేమిస్తున్నానని ఎవరితోనైనా చెప్పావా ఏమిటి'' అనడిగాడు పురూరవుడు.

అప్పటికి తను ఆ దుష్టచేటిక నిపుణికవల్ల మోస పోయానని విదూషకుడు తెలుసుకున్నాడు. ''అయ్యో ఆ దాసి నన్ను పూర్తిగా వంచన చేసిందే? ఇప్పుడేం చెయ్యను?'' అని లోలోన వ్యసన పడ్డాడతను.

''పలకవేం? ఎందుకలా వున్నావ్?''

''నన్నిక మాట్లాడించకయ్యా! నేనిక పెదవి కదపను. ఎవరి మాటకూ సమాధానం చెప్పను.''

''బాగుంది. నీ విట్లా నోటికి తాళం వేసుకుంటే నాకెలా ప్రొద్దు గడుస్తుందనుకున్నావు? నా కిక ఆత్మవినోదం ఎలా కలుగుతుంది? ఊర్వశి లభిస్తుందా లేదా అని నా హృదయం పరితాపంతో కుమిలిపోతూంటే, నువ్విలామూగనోము పట్టటం భావ్యమేనా?''

''అయితే వంటయింటికి పోదామా?''

"దేనికి"

"ఆత్మ వినోదంకోసం-"

"వంటయింట్లో వినోదం కలుగుతుందా? ఈ దినం నీ మాట లేమిటో వింతగా వున్నాయ్!"

"వింతలేని మాటలతో వినోద మెట్లా కలుగుతుంది? ఆ వంటయింట్లో మంచి రుచికరములైన పంచభక్ష్యపర మాన్నాలను పెద్దపెద్ద పాత్రల్లో నింపియుంటారు. వాటి నన్నింటినీ చూస్తేనైనా నీ విరహోత్కంఠత మరచిపోయి కాస్సేపు వినోదించ గలవేమో!"

"నువ్వు భోజనప్రియుడవు గనుక, నీ కెప్పుడూ ఆ వంటయింటిమీదనే ధ్యాసంతా! ఆ పిండివంటలను చూడ గానే నీకు తృప్తి కలగవచ్చేమో కాని, ఎన్నటికీ దుర్లభ మైన వస్తువుక కాశపడివున్న నా ఆరాటాన్ని ఆ వంట యింటి వంటలు ఏ విధంగా తీర్చగలవ్?"

"ఆ ఊర్వశిని గురించి నువ్వెందుకు ఇంత ఆరాట పడుతున్నావో నాకు బోధపడ కుండావుంది. ఇంతకీ పూజ్యురాలైన ఆమె నిన్ను చూడలేదా?"

"చూస్తే మాత్రం ప్రయోజన మేమిటి?"

"అది కాదు. నిజం చెప్పు, ఆమె నిన్ను చూసిందా-లేదా?"

"చూసింది. మాట్లాడింది. కాని వుపయోగ మేమిటి?"

"అబ్బబ్బ! ఎందుకంత నిరాశ పడతావ్? ఆమె నీ సౌందర్యాన్ని చూసినట్లేటే తప్పకుండా నువ్వెక్కడున్నా వెతుక్కుంటూ వస్తుంది. ఇందులో ఏ మాత్రం సందేహం లేదు. ఊరకే కలతపడి బాధపడకు."

"ఏమో! వస్తుందన్న నమ్మకం నాకు లేదు."

"నీ కెందు కొచ్చిందా అనుమానం?"

"నా పైని అభిమానంవల్ల నువ్విలా మాటలాడుతున్నావేగాని ప్రత్యక్షంగా ఆ అన్నులమిన్న సౌందర్యాన్ని చూసినట్లేటే యిలా మాట్లాడేవాడివి కావు. ఆమె ఎంత గొప్ప అందగత్తె అనుకున్నావ్? ఆభరణాలకు అందం రావలెనంటే ఆమె శరీరాన్నే చేరవలసి వుండును. ఏదైనా అందమైన వస్తువులుంటే దాని కామెనే నిదర్శనంగా చెప్పుకోవాలి. ఇంతకుమించి ఆమెను వర్ణించేందుకు నా తరం కావటంలేదు..."

"ఓహోం! అదా సంగతి! అందుకే భూదేవేంద్రుడివైన నువ్వా ఊర్వశిని వరించింది! ఎలాగూ వరించావు గనుక యిహ చాతకపక్షివలె ఎదురు చూస్తూకూర్చో! ప్రియ సమాగమము ఫూహామాత్రాన సంభవమనుకున్నావా ఏమి?"

"నా కిక్కడ విశ్రాంతిగా లేదు. వసంతశోభతో కలకలలాండే ప్రమదావనం వెళదాం రా! అక్కడయినా మనసు పూరట పొందుతుందేమో"

అని పురూరవుడు అక్కడినుండి ప్రమదావనంవైపు బయలుదేరాడు తప్పనిసరి కావటంవల్ల యింకేమీ మాట్లాడకుండా ఆయన వెనకాలే విదూషకుడు నడిచాడు. ఇద్దరూ ఏకాంతమైన ఆ ఉద్యానవనంలోకి ప్రవేశించారు.

అది వసంతకాలం కావటంవల్ల ప్రమదావనం చాలా చక్కగా చిగిరించి పూచి గమగమ వాసనలతో నిండివుంది. మామిడి చెట్లుచిగురుటాకుల్ని ధరించి-యవ్వనవతీలాదర్శంగా కులుకసాగాయి. ఎఱ్ఱగోరింత చెట్లు, అశోకవృక్షాల పూలు వికసించి ఎల్లడలా పరిమళాన్ని వెదజల్లుతున్నాయి. తుమ్మెదలు అటు యిటు ఎగరటంతో యెక్కడచూసినా పువ్వులు రాలివున్నాయి.

చల్లని దక్షిణపుగాలి వీస్తూండటంతో - తుమ్మెదలు పువ్వులలో చేరి మకరందాన్ని గ్రోలి ఝుంకారశబ్దం చేస్తూండటంతో-మామిడిచిగుళ్ళ మెక్కి- 'కూ' అని కోయిలలు విపరీతంగా అరుస్తుండటంతో-పురూరవుని విరహతాపం మరింత అధికతర మయింది.

ఊర్వశి సౌందర్యం పురూరవచక్రవర్తిని మంత్రముగ్ధుణ్ణి గావించడంవల్ల ఆయన్నా ప్రమదా-వనం ఏవిధంగానూ రంజింపచేయలేకపోయింది. అక్కడి చల్లగాలులు ఆయన శరీరాన్ని తాకేసరికి ఎదలోని తాపం క్షణక్షణానికి అధికతరం కాసాగింది. పూలభారంతో గాలికి అటు యిటు వూగే లతల అందం ఆయన కళ్ళకేమాత్రం నచ్చ

లేదు. పైగా అవితసను చూసి నవ్వుతున్నట్లుగా భ్రమించి గాఢంగా నిట్టూర్చాడు.

"విదూషకా! ఈ ఉద్యానవనం చేరి నా హృదయారాటాన్ని కొంతవరకైనా తీర్చుకుందా మనుకున్నాను గాని నే నిక్కడికి రావటం ఏటికి ఎదురీదినట్లు పూర్తిగా ప్రయోజనశూన్య మైంది. నా హృదయేశ్వరి ఊర్వశితో పాటు కలసి వున్నప్పుడుమాత్రమే యిక్కడి వన్నీ సంతోషాన్ని కల్గిస్తా యేమో కాని యిప్పుడు భరింప లేకున్నాను. చాలాసేపు నే నిక్కడ వుండలేను. పద పోదాం" అన్నాడు పురూరవుడు తన ప్రియమిత్రుడు విదూషకునితో.

"అబ్బబ్బ! పూరుకోవయ్యా స్వామీ! ఇక్కడికి వచ్చేవరకు ప్రాణం తీశావ్. తీరా వచ్చీరాగానే వెళ్ళిపోదామంటున్నావు. నీకు పూర్తిగా ఊర్వశిపిచ్చి పట్టినట్లుంది. ఆమెను గురించి ఎందు కలా తపించిపోతావ్? ఈ వసంత ఋతువులో ఆమెకుకూడా నువ్వు తలపు కొస్తే-నీలాంటి విరహబాధపడి అక్కడ క్షణమైనా నిల్వగలదా? తప్పకుండా వచ్చి నిన్ను చేరుకోకపోదు. ఊరకే కలతపడకు. అదుగో మన లతామండపం ఎంతమనోహరంగా కన్పిస్తోందో చూడు. తుమ్మెదల రాపిడివల్ల పువ్వులు తొడిమలు వీడి, క్రింద రాలి, పూలపాన్పు పరచినట్లు ఎంత మనోజ్ఞంగా వుందో! అక్కడ కాస్సేపు కూర్చొని విశ్రాంతి తీసుకుందువు రా! నీలోని కలత లన్నీ పటాపంచ లవుతాయి-"

అని విదూషకుడు బలత్కారంగా పురూరవుని వెంట బెట్టుకొని ఆ లతామండపంవద్ద కెళ్ళాడు

"ఇదే నీకు మంచి అనుకూలమైన చోటు. చుట్టూ తీగెలు పూచి ఎంతసొగసుగా వుందో చూడు. ఇవన్నీ చూస్తూవుంటే యిప్పటికి కొంతమట్టుకైనా నీ తాపం చల్లారివుండాలి. ఏమంటావ్?"

అన్న విదూషకుని మాటలు విని-యిస్సు మని నిట్టూర్చాడు పురూరవుడు.

"మిత్రమా! నే నేం చెయ్యనయ్యా! నీ కంటికి యి వన్నీ చల్లగా కనబడుతున్నాయేమో కాని-నా కంటికి అగ్నిజ్వాలలవలె కన్పిస్తున్నాయి. నాకోరిక నెరవేరే ఉపాయ మేదైనా ఆలోచించి, నన్ను విరహతాపంనుండి విముక్తి పొందించకూడదా?"

"ఇది మరీ బాగుంది. పూర్వం యింద్రుడు అహల్యను మోహించినకాలంలో అతనిచేత అశ్వినీదేవతలు చిక్కబడి నట్లు-యిప్పుడు నేను నీ చేత చిక్కుకొని చస్తున్నాను. ఆ అశ్వినీదేవత లొకవెఱ్ఱిబాంద్రు- నే నొక వెర్రిబాపడను."

"కోపగించుకోకయ్యా మిత్రమా! ఈలాంటి సమయాల్లోనేకదా మిత్రుల సహాయము అవసరమయ్యేది. 'మిత్ర మాపత్సు జానీయాత్' అనే న్యాయాన్ని విస్మరించావా?"

"గట్టిమాటే ముంచి బెట్టావ్! సరే, ఎవరికి గాక

పోయినా నాకు తప్పుతుందా నీ బాధ! కాస్సేపు నన్ను మాటలాడించకుండా కళ్ళు మూసుకో. ఇంతవరకూ నువ్వు చేసిన గోలవల్ల నా ఆలోచనలన్నీ చెదరిపోయాయి. తిరిగి వాటి నన్నింటినీ ఒకచోట చేర్చుకొని- నీ ప్రేయసి నీకు దక్కే- ఉపాయం చెబుతాను-'' అని ఆలోచనా ముఖం పెట్టి కళ్ళు మూసుకున్నాడు విదూషకుడు.

అప్పుడు పురూరవచక్రవర్తికి అకస్మాత్తుగా కొన్ని మంచి శకునాలు కన్పించాయి. వాటి అంతరార్థాన్ని తెలుసుకున్న ఆ రాజర్షి ముఖంపై చిరునవ్వు వెలసింది. ఆ పూర్ణ చంద్రముఖి తప్పక త్వరలో తనకు లభ్యం కాగలదనే దృఢ నిశ్చయాని కొచ్చి తిరిగి ఆమెను గురించి మదిలో తల పోయసాగాడు.

# 5

ఊర్వశి పురూరవుణ్ణి గురించి ఆలోచించుకుంటూ చాలా సేపు ఏకాంతంగా వుండలేక పోయింది. ఒంటరితనం ఆమెను మరింత మదన తాపానికి గురిచేసింది. క్షణక్షణానికి ఆ రాజర్షిపై మక్కువ ఎక్కువ అవుతోందే తప్ప, ఆయనను గురించిన ఆలోచనలు తననుండి విడిపోవటం లేదు. ఆయన తన నెందుకింత గాఢంగా ఆకర్షించుకున్నాడు? ఎటువైపు చూచినా ఆ మనోహరుని మంగళవిగ్రహమే తన కనుదోయికి కన్పిస్తోంది. ఎవరు మాట్లాడినా, ఆయన తియ్యటి మాటలే మదిలో మెదలుతున్నాయి. రథంపై తాను ఆయనతోపాటు వస్తున్నప్పుడు తన శరీరమంతా ఆయన శరీరాన్ని తాకి ఎన్నడూ పొందని మధురానుభూతిని ప్రసాదించింది. తను ఆయన కళ్ళల్లోకి సూటిగా చూడలేక, మాట్లాడలేక, సిగ్గుపడి తలవంచుకున్నప్పుడు, ఆ రాజర్షి పల్కిన పల్కులే మాటిమాటికీ స్ఫురణ కొస్తున్నాయి. తన హృదయబాధను ఆయన కెలా వివరించేది? తన ప్రేమను మన్నించి, ఆయన తనను ఆదరించగలడా? లేక...''

ఇహ ఆలోచించ లేక పోయింది ఊర్వశి. ఆ సౌందర్య మూర్తిని గురించిన ఆలోచనల నుండి తప్పుకొనేందుకు కాస్సేపు నృత్యం చేసింది. కాని అడుగులు తడబడ్డాయి. లాభం లేదనుకొని వీణ వాయించబోయింది. అయినప్పటికీ ప్రయోజనం లేకపోయింది వీణ సైతం అపశృతులు

పలికింది. దానితో ఆమె తనపై తానే విసుక్కుంది. తన హృదయ దౌర్బల్యానికి లోలోన కించపడుతూ లేచి భవనం నుండి వెలుపలికి వచ్చింది.

తీరా బయటికి వచ్చాక ఎటు వెళ్ళాలో బోధపడలేదామెకు. కాస్సేపు ఆలోచించింది. రంభ భవనానికి వెళదామనుకుంది. రెండడుగులు ముందుకు వేసింది కాని అంతలో ఏమని ఆలోచించుకుందో ఠక్కున ఆగిపోయింది. తను అక్కడికి యీ సమయంలో వెళితే, వాళ్ళంతా తన విరహబాధ గ్రహించి నవ్విపోతారు. గేలిచేస్తారు. వాళ్ళ వద్దకెళ్ళి నవ్వులపాలు కానటంకన్నా, ఏకాంతంగా వుండిపోవటమే భావ్యమనుకుంది. అంతేగాక నందనవనం వెళ్ళి అక్కడి రాజహంసతోనైనా తన హృదయావేదనను చెప్పుకోవాలనుకుంది. వెంటనే అక్కడినుండి బయలుదేరి నందనవనం ప్రవేశించింది.

కాని ఆ రమ్యమైన ప్రదేశంలోకూడా ఆమెకు శాంతి లభ్యంకాలేదు. చక్కనైన ఆ వనంలోని లతల్ని, పారిజాత పుష్పాల్ని చూస్తూ, మదనవికారానికి లోనుచేసే ఆ సౌరభాల వాసన పీల్చుకుంటూ, గాఢంగా నిట్టూరుస్తూ, ప్రణయ భారంవల్ల అడుగులు తడబడుతూ వుండగా, నెమ్మదిగా ఒక కొలనుగట్టుమీది కెళ్ళి కూర్చుంది.

ఆమె గట్టుమీద కూర్చోగానే, సరస్సులోని హంస ఒకటి కిలకిలా నవ్వింది. ఆ నవ్వు విన్న ఊర్వశి లోలోన

వుడికిపోయి వెనుదిరిగి చూసింది.

"నేనే ఊర్వశీ!" అని తిరిగి నవ్వింది హంస.

"సంతోషించాం కాని ఎందుకలా నవ్వుతున్నావు?" అనడిగింది ఊర్వశి.

"నీలో ఎన్నడూ లేని పరధ్యానం చూసి నవ్వు వచ్చింది. నవ్వాను .."

"ఆ మాత్రానికే నవ్వాలా? అయినా పరధ్యానం ఎందుకు కల్గుతుందో నీకు తెలుసా?"

"ఆఁ! తెలియకేం? కాని నా నోటంట వింటే నీకు కోపం వస్తుందేమో!"

"రాదులే! చెప్పు"

"ఊహుఁ! నేను చెప్పను. నిజంగా నీకు కోపం వస్తుంది."

"అబ్బబ్బ! నాకేం కోపం రాదులే! వూరకే విసిగించక చెప్పరాదూ?"

"అందరికీ పరధ్యానం ఎందుకు కల్గుతుందో చెప్పమన్నావా లేక నీ కొక్కదానికే ఎందుకింత పరధ్యానం కల్గిందో చెప్పనా?"

"ఇతరుల సంగతి నాకెందుకు? నా విషయమే చెప్పు."

"అయితే విను. గంగలాగా ప్రసన్నవు, తటిల్లతలా చంచలవతివి అయిన నీ హృదయం నిన్ను విడిచి మరొకరిని చేరుకుంది. అందుకే యింత పరాకు చిత్తగించావు!"

"బాగానే చెప్పావు! కాని నా హృదయం నీ వన్నట్లు నన్ను విడిచి పోలేదు ఇంకా నా స్వాధీనంలోనే వుంది."

"పూరకే తప్పించుకోకే; నీ హృదయం నీలోనే వుందని నీ కెట్లా తెలుస్తుంది? అది ఎప్పుడో నిన్ను విడిచిపోయిందని నీ నడకా, చూపులూ, మాటలే స్పష్టరుస్తున్నాయ్! అదుగో! చల్లని గాలులు నిన్ను తాకి ఏ విధంగా వెచ్చపడుతున్నాయో! ఇంతకీ నీ హృదయాన్ని తనలోకి రప్పించుకున్న ఆ ధర్మాత్ము డెవరో?"

తిరిగి పురూరవుని తలంపు మెదిలేసరికి ఆమె సిగ్గుపడింది. ఆ లజ్జావదనాన్ని ఆ హంస చూసి ఏమని గేలి చేస్తుందోనని ఆమె తన ముఖం చాటు చేసుకుంది.

అంతలో కాలి అందెలు ఘల్లు ఘల్లుమని మ్రోగుతుండగా చిత్రలేఖ అక్కడికి వచ్చింది.

"ఓః! అప్పుడే యిక్కడికి చేరుకున్నావా? నా ఊహే నిజమైంది" అన్నదామె.

"ఏమిటే" అంది ఊర్వశి, ఏమీ తెలియనట్లు.

"నీ కోసం అంతా గాలించాను. ఎక్కడా కన్పించక పోయేసరికి, బహుశా విరహతాపాన్ని భరించలేక యిక్కడికి వచ్చి వుంటావేమోనని నే తలంపుతో, యిటు వచ్చాను. ఏం? నీ తాపం కాస్తయినా వుపశమించిందా?"

"అబ్బ! ఎప్పుడూ పరిహాసోక్తు లేనా!"

"ప్రియసఖి చిత్రలేఖ నీతో గాక మ రెవరితో పరిహాస మాడుతుంది ఊర్వశీ!" అని మధ్యలో ఆ హాస కలుగ జేసుకుంది

"ఇహ నువ్వు పూరుకో! నీ నోట్లో ఏరహస్యమైనా పడిందా అది దాగదు. ఇక్కడి కొచ్చే అప్సరసల కంతా చెప్పి నా ప్రాణం తీస్తావ్! చిత్రా! మనం యిక్కడినుండి వెళదాం పద" అని ఊర్వశి చిత్రలేఖను వెంటబెట్టుకొని అక్కడినుండి బయలుదేరింది.

కొంతదూరం వెళ్ళాక ఆమె వున్నట్లుండి అక్కడే నిలిచిపోయింది. అకస్మాత్తుగా ఊర్వశి ఆగిపోవటంతో చిత్రలేఖకూడా అక్కడే నిలిచి-

"ఏమిటే ఆలోచిస్తున్నావ్!" అనడిగింది.

"ఏమీ లేదు, పద పోదాం"

"ఎక్కడికి?"

"భూలోకానికి-" అని నెమ్మదిగా పలికిందామె.

"దేనికి?"

"ఆమాత్రం తెలియదటే?"

"ఊహు!"

"చిత్రా! ఏమిటోగాని నా మన స్పందుకో తీయటి తలపులతో ఉరకలేస్తోంది. ఎవరినో చూడాలని భ్రమ. ఎందుకో నా ఎదలో యీ తొందరపాటు?"

"మారుడు సామాన్యుడు కాడు ఊర్వశీ!"

"అందుకే యింత విరహబాధ ననుభవిస్తున్నాను. ఆ పురుషోత్తముని కళ్ళల్లో కళ్ళుపెట్టి చూడందే, ఆ రాజర్షితో ఒక్కమాటైనా మాట్లాడందే, యీ ఊర్వశి ఊర్వశి కానేరదు..."

"గట్టి చిక్కే! తీరా అతన్ని కళ్ళార చూశాక వెనక్కి రాజాల నంటావేమో!"

"కావొచ్చు కాని చిత్రా! నా మన స్సెందుకే ఆ పురూరవునిపై యింతగా మరులుగొన్నది?"

"ఏమో' ఆ సంగతి నా కెలా తెలుస్తుంది?"

"ఎంత నిగ్రహించుకుందామన్నా అతనినుండి మనస్సు మరలుటలేదు. అనుక్షణమూ హృదయం అతన్నిగురించే పలవరిస్తోంది. దీని కంతకూ కారణ మేమిటే!"

"నీ ఎదలోని బాధ నాకూ అర్థ మవుతోంది ఊర్వశీ! అయినా నువ్వు యిచ్ఛాస్వేచ్ఛ గలదానివి. ఆశించిన వాడిని అనుభవించగల అదృష్టశాలివి. స్వేచ్ఛగా ఆ సుంద రాంగుని నందనవనానికి తీసుకొచ్చి సుఖించు. ఇంత చిన్న విషయానికి నా సలహా ఏమిటి?"

"అలా అనకు చిత్రా! నా ఎద ఎదలో లే దిప్పుడు. మదనతాపంవల్ల ఏ ఆలోచనా పాలుపోవటంలేదు. ఒక మానవచక్రవర్తి నన్నింత గాఢంగా ఆకర్షించకు నేందుకు, అతన్ని కున్న పుణ్యచరిత్ర ఏమిటే?"

"పురూరవుడు సామాన్య చక్రవర్తి కాదు ఊర్వశీ!

ఆతను మహాసాత్వికుడు. గొప్ప బలపరాక్రమసంపన్నుడు. దేవాసురయుద్ధాలలో దేవపక్షము వహించి పోరు సల్పి, దేవతలకు విజయలక్ష్మిని ప్రసాదించియిచ్చిన ధీరోదాత్తుడు. పైగా అతని రథంసైతం చంద్రాకారమే. అతని పల్కులు..."

"అమృతధారలుకదూ!"

"ఔను-"

"ఆతను గొప్ప సౌందర్యవంతుడు. ప్రణయ సామ్రాజ్య చక్రవర్తి. నా హృదయచోరుడు కనుకనే."

"కనుకనే నీ మనసు అతనిపై మరలుగొన్నది. మళ్ళీ ఊర్వశి కొక క్రొత్త చరిత్ర ప్రారంభ మవుతోంది..."

ఆ మాటతో ఊర్వశి చిరునవ్వు చిలకరించింది.

"చరిత్రగతులు మారటం సర్వసాధారణమే! పద, ఆ నయనసుందరుని చేరుకుందాం-"

"సరి-సరి, మీ యిద్దరిమధ్యా నే నెందుకు? నువ్వొక్కదానివే వెళ్ళితృప్తితీరా అతన్ని చూసిరారాదూ!"

"వూహుం! అలా వీల్లేదు. అతన్ని చూడగానే నా హృదయం స్వాధీనం తప్పి బేల అవుతుందేమో! నువ్వూ వెంటరావే! నా ప్రక్కన చిత్ర వుంటే మగజాతికి లోకువ కాదు యీ ఊర్వశి..."

"ఇంతకీ ఆ మహారాజువద్దకు ఎవరినైనా దూత్యం పంపించావా?"

"వూహుఁ!"

"మరి ఎలాంటి రాయబారం లేకుండా వున్నపళంగా బయలు దేరటమే!"

"ఎప్పుడో నా హృదయాన్నే రాయబారం పంపించాను లే!"

"మంచిపనే చేశావ్! నిన్నా పని చెయ్యమని ప్రోత్సహించినవా రెవరో నాకు చెప్పకూడదా?"

"ఇం కెవరు? ఆ మన్మథుడే నాలో ప్రవేశించి యింతపని చేశాడు. అబ్బ! అల్లరి చెయ్యకు, రావే!"

"సరే. యీ మాటల కేమొచ్చెగాని పద వెళదాం. ఇంతకీ అతను ఎక్కడుంటాడని వెతుక్కుంటూ వెళ్లాలి..."

"అవును. మంచి ప్రశ్నే!"

"రసికులు యిలాంటి సమయాలను వృథాగా గడపరు. అందులోనూ పురూరవుడు రసరాజ్యచక్రవర్తి. తన దేవేరితో కలిసి ఏ ఉద్యానవనంలో నైనా..."

"ఇక చెప్పకు. వూరకే నన్ను రెచ్చగొట్టి ఏడిపించాలనా నీ వుద్దేశ్యం?"

"అదేమీ కాదు. ఇది కేవలం నా వూహామాత్రమే! ఆయన యిప్పుడేం చేస్తుంటాడో ప్రత్యక్షంగా చూస్తావుగా! అవునుగాని నువ్విలాగే ఆ పురూరవుని కంటబడతావా?"

"ఔను. ఏం?"

"వనిత తా నలచి వస్తే ఎంతటి మగవారైనా చుల

కనగా చూస్తారు. నీయెడ అతని అభిప్రాయ మేమిటో తెలుసుకోనిదే కంటబడటం భావ్యం కాదు''

''మరి ఏం చేద్దా మంటావ్?''

''ఏదో ఒకటి నువ్వే ఆలోచించు...''

''నా కే ఆలోచనలూ తోచటం లేదు''

''బాగుంది. ప్రియసందర్శనాభిలాషివి నీ కేమార్గమూ తోచకపోతే-వృత్తిపుణ్యానికి నా కెలా తోస్తుంది?''

''దేనికే యీ మాట లన్నీ! నాపై జాలితోనైనా ఏదో ఒక ఉపాయం చూడవే!''

''సరే. చెలిమి చేసినందుకు తప్పుతుందా మరి? తిరస్కరిణీవిద్యాప్రభావంతో ఆయనకు కన్పించకుండా వెళ్లి పరిస్థితులను గమనిద్దాం..''

''నీ ఆలోచన బాగానే వుంది. కాని నా కో భయం కలుగుతోంది''

''ఏమిటది?''

''మనం భూలోకానికి వెళుతున్నప్పుడు తిరిగి ఏ దానవుడైనా చూసి మనల్ని చెరపట్టితే-యిక దిక్కెవ్వరు?''

''ఓసీ పిరికి! ఎందుకే అంత భయం నీకు? మనకు బృహస్పతి నేర్పిన 'అపరాజిత' అనే శిఖాబంధన విద్య తెలుసునుగా! దాని ప్రభావంతో ఎవరి కంటా బడకుండా భూలోకం చేరుకుందాం-''

''ఎంత మంచి ఆలోచనే! సమయానికి నా కా అప

రాజిత శిఖాబంధనం జ్ఞప్తికి రాలేదుసుమా!''

''జౌనౌను. ప్రేమికులకు ముందు ఆలోచన లెప్పుడూ వుండవు-'' అని చిత్ర నవ్వింది.

ఊర్వశికూడా నవ్వకుండా వుండలేకపోయింది. ఆ తర్వాత యిద్దరూ అపరాజిత శిఖాబంధనతో రాక్షసుల కంట బడకుండా భూలోక గమను లయ్యారు.

కొంతదూరంలో వారికి ప్రతిష్ఠానగరం వింత కాంతులతో వెలిగిపోతూ - రమ్యమైన హర్మ్యాలతో కలకల లాడుతూ కన్పించింది.

ఊర్వశి ఎదలో మునుపటికన్నా ఆతురత అధికమైంది. మాయావస్త్రాన్ని ఒంటికి కప్పుకొని ఎప్పుడెప్పుడు తా నా పురూరవుని చెంత చేరుదునా అని తొందరపడసాగింది.

''అదిగో! అదే నీ హృదయచోరుని అంతఃపురం. దాని పేరు కైలాసశిఖరసశ్రీక. గంగానది ఒడ్డునే వుండి దర్పణంలో తన ప్రతిబింబం చూసుకుంటున్నదా అన్నట్లుంది. ఎంత మనోజ్ఞంగా కన్పిస్తోందో చూడు...'' అన్నది చిత్రలేఖ.

''జౌనౌను. పురూరవుని కళాత్మకజీవితానికి ఆ అంతఃపురమే ఒక దర్పణము. ప్రస్తుతం మన కర్తవ్యమేమిటి?''

''కర్తవ్యాన్ని గూర్చి ఆలోచించుకుంటూ వెళితే కాలం చాలదు ఊర్వశీ! ఈ రాచనగరులో నీ ప్రియుడు

ఎక్కడున్నాడో-ఏం చేస్తున్నాడో తెలుసుకోవటం చాలా కష్టతరమైన విషయం. మాయాప్రభావంతో నువ్వే అతన్ని చూడు —''

''వూహుఁ! మాయమంత్రాలతో నా హృదయాన్ని ఆకట్టుకోలేను. ప్రత్యక్షంగా వెదికి అతన్ని దర్శించటంలో కల్గే తృప్తి, సుఖమూ - మాయాప్రభావాలవల్ల ఎలా జనిస్తుంది? ఆ అంతఃపురంకు వెళదాం...''

అన్న ఊర్వశి మాటలు విని చిత్రలేఖ ముసి ముసి నవ్వు ప్రదర్శించింది. ఇద్దరూ అదృశ్యరూపంతో రాజనగరు చేరి పురూరవుడి అంతఃపురం ప్రవేశించారు. కాని రహస్య మందిరంలోనూ, శయ్యాగారంలోనూ ఎక్కడ చూసినా ఆయన కన్పించలేదు.

ఊర్వశి పురూరవుడి దర్శనం కాకపోవటంతో గాఢంగా నిట్టూర్చింది. భరించలేని విరహతాపంవల్ల ఆమె ఆవేదన మరింత అధికమైంది.

''ఇంతమాత్రానికే కృంగిపోతా వెందుకు? నేవేరి అంతఃపురంకు వెళదాం పద; అక్కడ వున్నాడేమో చూద్దువు గాని...'' అన్నది చిత్రలేఖ.

తప్పనిసరి అవటంవల్ల ఊర్వశి కాదనలేక పోయింది. అక్కడ్నుంచి యిద్దరూ కాశీరాజపుత్రిక ఔసీనరి అంతఃపురానికి వెళ్ళారు. అక్కడకూడా ప్రియసందర్శనభాగ్యం లభ్యంకాలేదు. ఔసీనరి ఏకాంతంగా కూర్చొని ఏదో

దీర్ఘాలోచనలో మునిగివుంది.

"నీ ఆశ నిరాశే అయ్యింది. ఇక్కడ కూడా లేడు. దేవేరిని ఒంటరిగా వదలి ఎక్కడి కెళ్ళాడో, ఏమో! ఇంతకూ నువ్వు దురదృష్టవంతురాలివి—"

"....."

"అయినా యింతటితోనే నిరాశపడటం విజ్ఞత అన్పించుకోదు. ఇటు ప్రక్కనే నందనవనాన్ని బోలిన ప్రమదావనం వుంది. అక్కడికి కెళ్ళి చూద్దామా!"

"తప్పుతుందా- మరి..."

ఇద్దరూ ప్రమదావనం చేరి పురూరవునికోసం చుట్టూ చూశారు. అల్లంతదూరంలో లతామండపంవద్ద ఒక చలువ రాతితిన్నెపై విదూషకునితోపాటు ఆశీనుడై వున్న పురూరవుని చూడగానే వాళ్ళ ఆనందోద్రేకానికి అంతులేకపోయింది.

అతన్ని చూడగానే ఎందుకో ఊర్వశి అడుగులు తడబడ్డాయి. లజ్జాభారంతో ముందడుగు వెయ్యలేక ఎక్కడి దక్కడే నిలిచి పోయింది.

"ఇప్పటికి నా బాధ తీరింది. అడుగోనమ్మా నువ్వు మెచ్చిన రాజర్షి. ఎందుకో విచారవదనుడై వున్నాడు. ఆయన ముఖంలో కూడా విరహతాపం స్పష్టంగా గోచరిస్తోంది. ముందు ఉదయించిన చంద్రుడు చంద్రికకోసం ఎదురు చూస్తున్నట్లుంది. ఇహ తృప్తి దీరా ఆ సుందరాంగుని చూస్తావో, తనివితీరా మాటలాడుతావో, లేక

స్తబ్ధంగా యిలాగే నిల్చుండి పోతావో నీ యిష్ట మొచ్చిన రీతిగా ప్రవర్తించు. ఇక నా కెలాంటి సంబంధమూ లేదు.''

చిత్రలేఖ మాటలను ఊర్వశి పట్టించుకునే స్థితిలో లేదు. సర్వమూ మరచిపోయి ఆ చక్రవర్తి సౌందర్యాన్ని చూస్తూ అలాగే నిల్చుండి పోయింది.

''ఏమిటే, పలకవు! నా అవసరం తీరిందనా యీ నిర్లక్ష్యం?'' అంది చిత్రలేఖ లేని కోపాన్ని అభినయిస్తూ.

''వూరుకోవే! ఎందుకు నీకీ కపటకోపం? నన్ను మాటిమాటికీ ఏడ్పించటంవల్ల నీ కొరిగే దేమిటి?''

''బాగుందమ్మా! యిదో అపవాదా నాకు? సరేకాని యిహ వెళదా-మా?''

''ఎక్కడికే''

''స్వర్గానికి-''

''అప్పుడే?''

''ఊఁ!''

''బాగుబాగు, ఇంతా చేసి యిదా నీ తుదిమాట. వచ్చిన పని పూర్తికానిదే అప్పుడే తిరిగి వెళ్లటమా?''

''అయితే కథాప్రారంభం కాస్త త్వరగా కానియ్యరాదూ!''

అని చిలిపిగా నవ్వింది చిత్రలేఖ. తిరిగి పురూరవుని వైపొకసారి అర్ధనిమీలిత నేత్రాలతో చూసింది ఊర్వశి. ఆమె కనుదోయికి అంతకు పూర్వంకన్నా మనోహరంగా కన్పిం

చాడు పురూరవుడు.

"చిత్రా! మహారాజును చూడవే! మొదట మనం చూసినప్పటికంటే చాలా అందంగా కన్పిస్తున్నాడు. అతని ప్రక్కనే కూర్చున్న విదూషకుడు కళ్ళు మూసుకొని ఏదో ఆలోచిస్తున్నట్లున్నాడు. ఆ యిద్దరినీ దగ్గరగా సమీపించి, వాళ్ళ సంభాషణ వినాలని కుతూహలంగా వుంది..."

అంటూ ఊర్వశి చిత్రలేఖ చెయ్యి పట్టుకొని పురూరవుని చెంత చేరింది. తిరస్కరిణీ విద్యవల్ల అదృశ్యరూపంలో వుండటంతో, ఊర్వశి రాకను పురూరవుడు గుర్తించలేక పోయాడు. యథావిధిగా ఊర్వశిపైని ఆలోచనలతో దీర్ఘంగా నిట్టూరుస్తూ, ఆమె లభ్యమయ్యే వుపాయాన్ని విదూషకుడు ఎప్పుడెప్పుడు చెబుతాడా అని ఆతురత పడసాగాడు.

అంతలో వున్నట్లుండి విదూషకుడు కళ్ళు తెరిచాడు.

"మిత్రమా! నా ప్రేయసి కన్పించే వుపాయం ఆలోచించావా?" అనడిగాడు వుత్కంఠతతో పురూరవుడు.

"ఆఁ! నీ దుర్లభప్రణయినీ సమాగమోపాయాన్ని ఆలోచించి వుంచాను..."

"అయితే ఆలశ్యం దేనికి? వెంటనే చెప్పు"

"కాస్త ఆగవయ్యా! చెప్పేలోపుగానే అంత తొందర పాటెందుకు?"

వారిద్దరి సంభాషణ వింటూ ఊర్వశి చలించి

పోయింది.

"అయ్యో! పాపం యీ పురూరవచక్రవర్తి మదన తాపంవల్ల ఎంతగా ఆరాటపడుతున్నాడు? ఈ ప్రేమమూర్తి ప్రేమప్రార్థనను విన్న ఏ స్త్రీ వూరుకోగలదు?! అనుకుందామె?

"వినవయ్యా రాజా! నీ ప్రేయసి ఊర్వశి కన్పించే వుపాయం చెబుతున్నాను. నువ్వు ఏ కలతలూ లేకుండా హాయిగా యిక్కడే నిద్రపో! స్వప్నంలో నీ కా ఊర్వశి దర్శన మిస్తుంది. కాదు, నిద్రపోవటం చేత కాదంటావా, చిత్రఫలకాన్ని తీసుకొని ఆమె రూపాన్ని చిత్రించి, దాన్నే తనవితీరా చూస్తూకూర్చో!"

విదూషకుని మాటలు విని పురూరవుడు తల పట్టుకున్నాడు. ఊర్వశి పురూరవుని ఆంతర్యాన్ని గ్రహించి తన మీది మోహంతో ఆయన సతమత మవుతున్నా డని లోలోన సంతోషించింది.

"చెలికాడా! యింతసేపూ ఆలోచించి యిదా నువ్వు చెప్పే వుపాయం? నువ్వు చెప్పిన యీ రెండుపనులూ నాయెడ సాధ్యం కానివే! ఆ అన్నులమిన్నపైని దుఃఖంతో నా మనస్సు నిండిపోయింది గనుక, నాకు నిద్రరావటం లేదు. కళ్ళు అశ్రుజలంతో నిండిపోయాయి గనుక ఆమె చిత్రాన్ని వ్రాయటంకూడా అసాధ్యమే!" అన్నాడు పురూరవుడు.

చిత్రలేఖ మహారాజు మాటలు విని ఊర్వశివైపు తిరిగి,

"ఏమమ్మా; విన్నావా నీప్రియుని మాటలు. ఇప్పటికైనా నీ హృదయం శాంతించిందా?" అన్నది.

"ఆఁ!" అని నవ్వింది ఊర్వశి.

"అయితే యింకా ఆలస్యం దేనికి? వెంటనే నీ మాయావస్త్రంతొలగించుకొని ఆయన ముందుకెళ్లరాదూ?"

"ఊహుఁ! ఇంకా కాస్సేపు వా రేంమాట్లాడుతారో వినా లని కుతూహలంగా వుంది. అదుగో! విదూషకు డేదో అంటున్నాడు విను..."

"ఏదో నాకు తోచింది చెప్పాను గాని, అవి రెండూ సాధ్యపడ వని మొండికెత్తితే నే నేం చెయ్యను? ఇక నీ ఆరాటాన్ని ఏవిధంగా తీర్చుకుంటావో నా కెంతమాత్రం సంబంధం లేదు..." అంటున్నాడు, విదూషకుడు.

"ఇప్పుడు న న్నేం చెయ్యమన్నావ్, మిత్రమా! ఆ త్రిలోకసుందరి ఊర్వశికి నాపై ప్రేమ జనించలేదేమో! లేక నేను బాధపడటం చూస్తూకూడా వూరకుండిపోయిందేమో! ఆమె దేవస్త్రీకదా! నా హృదయావేదన ఆమెకు తెలియకుండావుంటుందా? ఏమిటోగాని దయలేని యీ మన్మథుడు నాలో తీరని కోర్కెలను రేపి అన్నివిధాల చిత్రహింస చేస్తున్నాడు..."

చిత్రలేఖ పురూరవుడి ఆవేదన విని జాలిపడింది.

"ఊర్వశీ! వింటున్నావా? పాపం, ఆ రాజర్షి బాధ నీ మనస్సును కరిగించటంలేదా?" అ నడిగింది.

"అయ్యో! ఆయన నన్ను అపార్థం చేసుకున్నాడే! నే నిప్పు డేం చెయ్యను? ఆయనకు నా ఎదలోని మాటలను ఎలా వివరించి చెప్పను? సిగ్గువల్ల ఆయనముందుకు వెళ్ళలేకపోతున్నాను...ఇదుగో! ఈ భూర్జపత్రంపై నా మనోగతాభిప్రాయాలను వివరించి ఆయనముందు వెయ్యనా?" అంది కంగారుతో ఊర్వశి.

"ఆలశ్యం దేనికి? అలాగే కానివ్వు. ఇదే నీకు మంచిసమయం."

అంది చిత్రలేఖ. ఊర్వశి వెంటనే ఒక భోజపత్రం అందుకొంది.

'హృదయేశ్వరా!'

మీ మాటల నన్నింటినీ ఆలకించాను. నాకుమాత్రం మీపై అనురాగం లేదనుకున్నారా? మీవలె నేనూ ఎంతగా విరహతాపంతో బాధపడుతున్నానో ఎలా వివరించి చెప్పను?

మిమ్మల్ని చూసింది మొదలు–నా మనస్సు మీపై మరలుగొన్నది. మీపైని మోహాధిక్యతవల్ల దేవలోకంలో క్షణంకూడా నిశ్చలంగా వుండలేకపోయాను. నా మనస్సు నన్ను వీడి మిమ్మల్ని చేరుకోవటంతో, నన్ను నేను నిగ్రహించుకోలేకపోయాను.

ఆ విరహవేదనను బాపుకునేందుకై నందనవనం వెళ్ళాను. నా పిచ్చిగాని ఆవనంలోమాత్రం శాంతి లభ్యమౌతుందా? అక్కడి చల్లగాలులు నా శరీరాన్ని తాకి

నంతనే వెచ్చనైనవి. పారిజాతపుష్పాలను, లేతచిగుళ్ళను పరచుకొని పవ్వళించగా, నా నిట్టూర్పులవల్ల అవి వాడిపోయినవి ఈ రెండు తార్కాణాలవల్ల యీపాటికి నా హృదయావేదన మీకు స్పష్టమైవుంటుంది-"

అని ఆ భోజపత్రంపై ఆమె వ్రాసి పురూరవునివైపు విసరింది. అది గాడ్పుకు అటూ యిటూ పరుగెత్తుతూ వెళ్ళి విదూషకునిపై వాలింది. అకస్మాత్తుగా తనపై ఏదో వస్తువు పడగానే ఆ బ్రాహ్మణుడు కంగారుపడ్డాడు.

"అయ్యో! అయ్యో! ఇదేమిటి! పాముపడగలాంటిది నాపై పడబోతోంది." అన్నాడు.

అతని కంగారు గమనించి పురూరవుడు చిరునవ్వు ఒలికించాడు.

"ఎందుకలా కంగారు పడతావ్? అది పాముకుబుసం కాదు. నీ కూరకనే భయ మెక్కువ. దానిపై ఎవరో ఏదో వ్రాసినట్లుంది."

"నీ పరితాపాన్ని చాటునుండి విన్న ఆ దేవసుందరి ఊర్వశి ప్రణయలేఖ వ్రాసిందేమో చూడు." అని ఆత్రంగా అన్నాడు విదూషకుడు.

పురూరవుని కా మాట ఎంతో వుల్లాసాన్ని కలిగించింది. తక్షణమే ఆ భోజపత్రాన్ని అందుకున్నాడు. అందులో ఊర్వశి తన నుద్దేశించి వ్రాసిన మాటలను చదువుకొని సంతోషపరవశు డయ్యాడు.

"మిత్రమా! నేను ధన్యుణ్ణి. నువ్వన్నట్లుగానే నా ప్రేయసి ఊర్వశి యీ భోజపత్రంపై తన సమ్మతి తెలిపింది." అన్నాడు.

"అదృష్టవంతుడివే! ఇప్పటికైనా నీ మనసుకు పూరట లభించిందా?"

"ఒక్క పూరటే ఏమిటి? నాపై సంపూర్ణ అనురాగమున్నట్లు ఆమె యిందులో స్పష్టపరిచింది. ఈ ప్రణయలేఖను చూస్తూవుంటే, నా కనులముందు ఆమె నిల్చున్నట్లేవుంది. నా చేతివ్రేళ్ళ చెమటకు యిందులోని అక్షరాలు చెరిగిపోతాయేమో! నువ్వు దీన్ని జాగ్రత్తపెట్టు"

"అలాగే! కాని నీ కింత ఆశపుట్టించిన ఆ ఊర్వశి యింకా ప్రత్యక్షంగా కన్పించదేం?"

ఆ మాట వినగానే ఊర్వశి తన ప్రియసఖి చిత్రలేఖతో-

"చిత్రా! నేను వెంటనే ఆయనవద్దకి వెళ్లేందుకు ఎందుకో సంకోచంగా వుంది. ముందుగా నువ్వే వెళ్ళి ఆయనతో మాట్లాడుతూవుండు. ఈ లోగా నేను నా మనస్సును దిటవుపరచుకొని వస్తాను..." అన్నది.

అలాగే నని చిత్రలేఖ తిరస్కరిణీవిద్య నుపసంహరించుకొని ఆయన ముందు కెళ్ళి-

"నమస్కారం ప్రభూ!" అంది.

చిత్రలేఖను చూచి పురూరవుడు ఎంతగానో ఆనం

దించాడు. ఆమెను కుశలప్రశ్న లడిగిన తర్వాత-

"గంగను విడిచి వచ్చిన యమునవలె ఊర్వశిని వదలి నువ్వొక్క దానివే రావటం నాకంత సంతోష కరంగా లేదు" అన్నాడు.

అంతవరకూ ఆమె ఊర్వశి అని భ్రాంతిపడివున్న విదూషకుడు వెంటనే-

"ఏమిటేమిటీ! ఈమె ఊర్వశి కాదా! ఇంతవరకూ యీమె ఊర్వశి అని భ్రమిస్తున్నానే-" అన్నాడు.

మహారాజు మాటకు సమాధానంగా చిత్రలేఖ —

"రాజా! ముందుగా మబ్బు, తర్వాత మెరుపు కన్పించటం పరిపాటే కదా!" అంది.

"అయితే నీ సఖి ఊర్వశి నాతో ఏమైనా చెప్పమన్నదా?"

"ఆఁ! మునుపు మీరు కేశిదానవుని నుండి రక్షించినట్లే, నేడు మన్మథుని బారినుండి రక్షించమని మా ఊర్వశి మీతో చెప్పమన్నది."

"ఇది మరీ బాగుంది. నువ్వా మనోహరి ఒక్కతే తపిస్తున్నట్లు చెబుతున్నావేగాని, ఆమెను గురించి నే నెంతగా బాధపడుతున్నానో నీకు తెలియటంలేదా? ఈ విషయంలో మా ఇద్దరి మనస్సులూ ఒకటిగానే వున్నాయి. ఏకాభిప్రాయంతోవున్న మనస్సులు సులభంగా ఏకం కాగలవని నీ చెలితో నా మాటగా చెప్పు..."

అని పురూరవు డనగానే చిత్రలేఖ ముసిముసిగా నవ్వుకుంటూ-

"చెలీ, ఊర్వశీ ఇకనైనా రావమ్మా! మహారాజు నీ యెడ పూర్తిగా అనురక్తుడై వున్నాడు" అంది.

వెంటనే ఊర్వశి అక్కడి కొచ్చి-

"ఎంత గట్టిదానవే! నేను పరాకుగావున్న సమయం చూసి మాటైనా చెప్పకుండా, ఒంటరిదానిని చేసివచ్చావా?" అన్నది ఏమీ జరుగనట్లు.

"ఆఁ! ఆఁ! ఎంతమాట నువ్వు పరాకుగా వున్నప్పుడు నే నొచ్చానా? సరి సరి, యిక ఒక్క క్షణంలో తెలుస్తుందిగా, ఎవ రెవరు ఎవరిని ఒంటరిగా విడిచిపెట్టేది" అని చమత్కారంగా బదులు చెప్పింది చిత్రలేఖ.

ఊర్వశి తనవైపే రెప్పవాల్చకుండా చూస్తున్న ఆ రాజర్షిని చూసి,

"నమస్కారం రాజా!" అని చిరునవ్వు చిలకరించింది.

"ఓహోఁ! ఊర్వశీ! ప్రేయసీ! వచ్చావా! నీ కోసమే నే నిక్కడ చాతకపక్షివలె వేచివున్నాను. నీ సందర్శన భాగ్యంవల్ల నా హృదయతాపం చల్లారింది. ఒక్క దేవేంద్రునికి తప్ప అన్యుల కెవ్వరికీ నమస్కరించని నువ్వు, ఆ భాగ్యాన్ని నాకు ప్రసాదించావ్! రా, యీ చలువరాతి తిన్నెపై కూర్చో..."

అంటూ పురూరవుడు ఆమె కుడిహస్తం పట్టుకొని

ఆ చలువరాతి తిన్నెమీద కూర్చోబెట్టాడు. పురూరవుని చూడగానే ఊర్వశి సమస్తమూ మరచిపోయి మంత్రముగ్ధ అయ్యింది.

ఆ దృశ్యాన్ని కళ్లప్పగించి చూస్తున్న విదూషకుడు తన చేతిలోని భోజపత్రం గాలికి ఎగిరిపోయిన సంగతే గమనించక ఆ ప్రేమమూర్తుల దగ్గిరికి వచ్చాడు.

"ఏమీ! ఈమె నా చెలికాని ప్రేయసి ఊర్వశా! మరి ఇంతవరకూ నాకు నమస్కరించలేదేం?" అన్నాడు.

అందుకు ఊర్వశి నవ్వి-

"స్వామీ! విదూషక చక్రవర్తీ! నా ప్రేమమూర్తి చెలికాడా! నీకిదే నమస్కారం" అన్నది.

"మంచిది, నీకు శుభం కల్గుగాక" అని ఠీవిగా దీవించాడు విదూషకుడు.

అంతలో ఎవ్వరూ ఊహించని విధంగా అక్కడొక సంఘటన జరిగింది. దేవలోకంనుండి దేవదూత అక్కడికి వచ్చి,

"ఓ చిత్రలేఖా! ఊర్వశిని వెంటనే పిలుచుకొని రా! సరస్వతీ విరచితమైన, అక్షరసాలతో నిండిన లక్ష్మీస్వయంవర నాటకాన్ని, మీరు భరతముని నేర్పిన విధంగా అభినయించేందుకు తక్షణమే ఊర్వశిని రమ్మని దేవేంద్రుడు ఆజ్ఞాపించాడు. ఆయన దిక్పాలకాది సురశ్రేష్ఠులతో యిప్పుడు సభతీరి వున్నాడు. వేగిరమే ఆమెను బయలుదేరమను' అని చెప్పాడు.

దేవదూత మాటలువినగానే అందరూ చింతాక్రాంతు

లయ్యారు. ఊర్వశి ఆ వేదనకు అంతు లేక పోయింది. దుఃఖ పీడితురాలు కావటంతో ఆమె నోట మాట రాలేదు.

"ఊర్వశీ! దూత చెప్పిన మాటలు విన్నావు కదా! మహారాజువద్ద వేగమే సెలవు తీసుకో" అన్నది లోలోన వ్యసనపడుతూ చిత్రలేఖ.

ఊర్వశి ఏమీ మాట్లాడలేక దీనంగా పురూరవుని వైపు చూసింది. ఆమె దీనదృక్కులను చూసి ఆ రాజర్షి పూర్తిగా పరితపించాడు. అకస్మాత్తుగా సంభవించిన యీ వియోగానికి ఆయ నెంతో పరితపించాడు.

"ఊర్వశీ!" అన్నాడు ఆమెనైపు ప్రేమతో చూస్తూ.

"ప్రియా!" అంది ఊర్వశి.

"తప్పదు ప్రభూ! దేవర ఆజ్ఞ ఉల్లంఘించ లేను."

"నన్ను ఒంటరిచేసి, నా గుండెల్ని విరహతాపంతో మండించి వెళతావా?"

"నేను సైతం యీ విరాళిని భరించ లేను ప్రభూ! కాని నేను పరాధీనను. ప్రభు ఆజ్ఞను తిరస్కరించ లేని దీన స్థితిలో వున్నాను. నన్ను మన్నించండి...."

"ప్రియా నువ్వు లేని ఒక్క క్షణం నే నెట్లా గడపను? తిరిగి నీ దర్శనభాగ్యం భాగ్యం నా కెప్పుడు ప్రసాదిస్తావ్"

"నిన్ను చేరందే నేను బ్రతకగలనా ప్రభూ! క్షణాలలో వచ్చి నీ ముందు నిలుస్తాను. ఇప్పటికి అనుజ్ఞ ప్రసాదించండి."

అంటూ ఊర్వశి చిత్రలేఖతో పాటు ఆయనవద్ద సెలవు

తీసుకొని అంతరిక్షానికి ఎగిరింది. కాని, ఆమె మనస్సంతా పురూరవునిపైనే లగ్నమై వుండటంతో కనుచూపుకు అందే వరకూ ఆయన్నే చూస్తూ వెళ్ళసాగింది.

పురూరవుడు కూడా ఆకాశంకేసి చూస్తూ అలాగే నిల్చుండి పోయాడు.

ఇక్కడ పరిస్థితి యిట్లుండగా నిపుణిక తను విదూషకునివల్ల విన్న రాజరహస్యాన్ని పరుగు పరుగున వచ్చి కాశీరాజ పుత్రి మహారాణి ఔసీనరికి చెప్పింది. అంతా విన్న దేవి -

"నిపుణికా! నువ్వు చెప్పింది నిజమేనా?" అనడిగింది.

"నిజానిజాలు మీరే ప్రత్యక్షంగా చూసి తెలుసుకోండి దేవీ! ఇప్పుడు మహారాజుగారు ప్రమదావనంలో విదూషకునితో పాటు ఏకాంతంగా ప్రణయరహస్యాలోచనలు చేస్తున్నారు. అక్కడికి యీ సమయంలో మనం వెళితే సర్వం మీకే బోధపడుతుంది" అంది నిపుణిక.

"అవును, నువ్వన్నదీ నిజమే! ప్రత్యక్షంగా చూసి వినందే కాని దేన్నీ గుడ్డిగా నమ్మకూడదు. కాని, నిపుణికా! నిజంగా మహారాజు ఒక దేవవేశ్యకోసం యింతగా పరితపిస్తాడంటావా?"

"ఏమోనమ్మా! మగవాళ్ళ హృదయాలు ఏ సమయంలో ఏం ఆలోచిస్తాయో మనకెట్లా తెలుస్తుంది? ఊరకే కాలహరణం దేనికి? పదండి పోదాం..."

అంటూ నిపుణిక మహారాణిఔసీనరిని వెంటబెట్టుకొని ప్రమదావనానికి బయలుదేరింది.

ఇద్దరూ ప్రమదావనం చేరుకున్నారు. కొంతదూరం వెళ్ళేసరికి వాళ్ళకు ఊర్వశి పురూరవునికి వ్రాసిన ప్రేమలేఖ కన్పించింది. ఆ ప్రణయలేఖను విదూషకుడు ఏమరుపాటుతో

పోగొట్టుకున్న ఫలితంగా అది మహారాణి చేతుల్లో పడింది. దాన్ని ఆమె చదువుకొని లోలోన వ్యసనపడి- నిపుణిక చెప్పిందే యదార్థమని గ్రహించి పురూరవుని చేరేందుకు ముందుకు నడిచింది.

అదే సమయంలో పురూరవుడు ఊర్వశిపైని వ్యామోహంతో విరహబాధ ననుభవించ సాగాడు.

"మిత్రమా విదూషకా! నా బాధను ఏమని చెప్పుకోను? నా ప్రేయసి ఊర్వశిని చూడలేని యీ కళ్ళు ఒక కళ్లేనా? నా బ్రతుకూ ఒక బ్రతుకేనా? నే నేమైపోతే నే మిక? ఆమె తిరిగి నాకు దర్శన మిస్తుందో లేదో? ఆ లావణ్యవతిని నే నెప్పుడు మళ్ళీ కళ్ళారా చూడగలనో-" అంటూ విలపించసాగా డాయన.

అప్పుడు విదూషకుడు ఆయన మనఃక్లేశాన్ని కొంత వరకు నివారించే వుద్దేశ్యంతో ఊర్వశి వ్రాసిన ప్రణయ లేఖను చూపబోయాడు. కాని, అది తన చేతుల్లో లేక పోవటం గమనించగానే అతని గుండె గుభేల్మంది.

'అయ్యో! ఊర్వశి రాకతో ఆ భూర్జపత్రం ఎటు పోయిందో ఎరుగనైతినే? ఇప్పుడు మహారాజుగారు ఆ లేఖ నడిగితే ఏమని బదులు చెప్పగలను?' అని తనలో తాను గొణుక్కోసాగా డతను.

"విదూషకా? ఏమో చెప్పబోతున్నట్టున్నావే! ఏమిటది?" అనడిగాడు పురూరవుడు.

"ఏమీ లేదు ప్రభూ! ఆ ఊర్వశికి మీపై అనురాగ మెక్కువ అని చెప్పబోతున్నాను."

"నువ్వన్నది నిజమే విదూషకా! ఆమె వేడి నిట్టూర్పులు విడుస్తూ- నాపైనే మనసు లగ్నం చేసుకొని వెళ్ళలేక వెళ్ళలేక వెళ్ళిపోయింది. ఆమెను చూడలేని నాకు నయనానందం ఎట్లా కలుగుతుంది? మిత్రమా! ఆమె నాకు వ్రాసిన ప్రణయలేఖనైనా యివ్వు. ఒకసారి తృప్తిగా చూస్తాను."

ఆ మాటతో విదూషకుడు కంగారు పడ్డాడు. అనుకున్నంతపని జరిగింది. ఇక దాపరికం మంచిది కాదనుకున్నాడు.

"ఇంకెక్కడి భోజపత్రం మిత్రమా! అది ఊర్వశితో పాటే వెళ్ళినట్లుంది" అన్నాడు నెమ్మదిగా.

పురూరవునికి అతని సమాధానం చికాకు పరిచింది. ఆయన యదార్థ విషయాన్ని గ్రహించినవాడై—

"విదూషకా! ఎంతపని చేశావ్? నా ప్రాణప్రియమైన ఆ ప్రణయలేఖను ఏ విధంగా జారవిడిచావ్? నువ్వు చేసే పనులన్నీ యిలాగే జాగ్రత్త లేకుండా వుంటాయి. ఈ పరిసరాల్లో ఎక్కడైనా లేఖ పడివుంటే మో వెతుకుదాం. ఆ ఉత్తరం లభ్యమయ్యేవరకూ నాకు మనశ్శాంతి కల్గదు-" అంటూ అతనితోపాటు ఊర్వశీ ప్రణయ లేఖకోసం ఆ ప్రదేశమంతటా గాలించసాగాడు.

అప్పటికే అక్కడికి వచ్చి ఒక చెట్టు దాపున నిల్చొని

మహారాజు అవస్థనంతా గమనించిన ఊర్వశి ఆయన ఆవేదనను స్పష్టంగా అర్థంచేసుకుంది. ఆయన ఊర్వశి వ్రాసిన ప్రణయలేఖకోసమే అంతగా ఆరాటపడుతున్నాడని తెలుసుకునేసరికి ఆమె హృదయం గాయపడింది.

వెంటనే ఆమె మహారాజు ముందుకు వచ్చి —

"ఆర్యపుత్రా! ఎందుకలా ఆవేదనపడుతున్నారు? మీరు వెతుకుతున్న ప్రణయలేఖ యిదుగో, స్వీకరించండి-" అంటూ ఆయనకు అందించింది.

పురూరవుడు ఆ హఠాత్ సంఘటనకు క్షణకాలం ఆశ్చర్యపోయాడు. ఆయన తడబడుతూ —

"దేవీ! నేను దీనికోసం వెతకటంలేదే!" అని బొంకాడు.

కాని, ఊర్వశి అంతటితో ఊరుకోలేదు.

"క్షమించండి ప్రభూ! నేను వచ్చి మీకు బాధ కలిగించానేమో! నావల్ల మీ పనికి ఆటంకం కల్గినట్లుంది. నేను వెళ్ళిపోతున్నాను-"

అంటూ ఆమె కోపంతో అక్కడినుండి ముందుకు నడిచింది. కాని, పురూరవుడు వెంటనే ఆమె ముందుకువచ్చి-

"దేవీ! ఎందుకు నాపై యింత అలుక బూనావ్? నేనేఅపరాధం చేశాను!" అన్నాడు.

"అపరాధం చేసింది మీరు కాదు, నేనే! నాపై ప్రేమ లేని మీ వద్దకు రావటమే నేను చేసిన అపరాధం" అంటూ ఆమె యిహ అక్కడ నిల్చోకుండా గబగబా

నిపుణికతోపాటు వెళ్ళిపోయింది.

ఆమె ఆవిధంగా తిరస్కరించి వెళ్ళటంతో పురూరవుడు లోలోన వ్యధ చెందాడు. అప్పుడు విదూషకుడు ఆయనను వూరడించే వుద్దేశ్యంతో-

"మిత్రమా! ఇంకా యిక్కడ ఎందుకు జాగు చేస్తావు? ఆమె వానకాలపు నదివలె కలకతేరకయె వెళ్ళిపోయింది" అన్నాడు.

"విదూషకా! నాకు ఊర్వశిపై ఎంత ప్రేమ వున్నప్పటికీ యీమెను విడిచిపెట్టగలనా? అయినప్పటికి నే నెంత బ్రతిమాలినా యీమె విప్పించుకోలేదు. సరే, పద పోదాం. మధ్యాహ్నకాల మైంది."

అంటూ దిగులుగా పురూరవుడు విదూషకునితోపాటు అంతఃపురంవైపు వెళ్ళిపోయాడు.

## 7

దేవలోకంలో సుధర్మసభయందు శచీదేవితో పాటు సురపతి కొలువుతీరాడు. ఒకవైపు అష్టదిక్పాలకులు, మరొక వైపు ఋషిపుంగవులు తమకై నిర్దేశించబడిన వుచితాసనాలలో కూర్చున్నారు. నాట్యశాస్త్రనిర్మాత భరతముని ప్రత్యేకంగా గురుపీఠాన్ని అధిష్ఠించాడు. బ్రహ్మ సరస్వతీ కూడా ఆ సభకు విచ్చేసి గౌరవాధ్యక్షపదవి నలంకరించారు.

ఆనాడు సభామండపం చాలా చక్కగా అలంకరింపబడింది. సరస్వతీ విరచితమైన 'లక్ష్మీస్వయంవర' నాటకాన్ని భరతముని ఊర్వశీ మేనకాది అప్సరసలకు ఎంతో ప్రయాసపడి చక్కగా నేర్పాడు. ఆనాటకాన్ని ఆనాడు ప్రదర్శించేందుకు దేవేంద్రుడు ఆజ్ఞాపించటంవల్ల విధిలేక ఊర్వశి పురూరవునికి వీడ్కోలు చెప్పివచ్చింది. కాని, ఆమె మనస్సు మనస్సులో లేదు. ఎలాగో మనస్సు దిటవు పరచుకొని ఆకర్షణీయంగా అలంకరించుకుంది.

"ఎందుకో వూరికే నా గుండెలు ఆవేగంతో కొట్టుకుంటున్నాయి చిత్రా" అంది తన ప్రక్కనున్న చెలికత్తె చిత్రలేఖతో ఆమె.

"ఈ కాస్సేపు ఎలాగో ఓపికపట్టు; ఆ తర్వాత నీ మనస్సు శాంతి నొందేచోటుకే వెళుదువుగాని" అంది చిత్ర నవ్వుతూ.

"చిత్రా! అ దేమిటోగాని ఎన్నడూ లేని జంకు

నాలో నేడు ప్రవేశిస్తోంది. సభాప్రాంగణంలోనికి వెళ్లేందుకు భయమౌతోంది. రంగస్థలంపై నన్ను నేనే మరచి ఏదైనా పొరపాటు చేస్తానో, ఏమో..."

"ఈలాంటి పిచ్చి పిచ్చి అనుమానాలతో వూరకే కలతపడకు. నువ్వా పురూరవుణ్ణి ఎంత గొప్పగా ప్రేమిస్తున్నప్పటికీ యింత బలహీనురాలివి కాకూడదు."

"నిజమే! కాని సమయం మించిపోయింది. పూర్తిగా నా హృదయం స్వాధీనం తప్పింది"

"నిన్ను నువ్వు నిగ్రహపరచుకోలేకపోతే, విధిపై భారం వేసి ప్రవర్తించటంకన్నా గత్యంతరం లేదు."

"అంతే నంటావా?"

"ఆఁ! అంతకన్నా మరోదారి లేదు"

అంటూ చిత్రలేఖ బలవంతంగా ఊర్వశిని రంగస్థలానికి తీసుకొచ్చింది.

అంతలో దేవేంద్రుడు నాటక ప్రదర్శనకు అనుమతించటంతో నాటకం ప్రారంభమైంది. ఊర్వశి తన వంతు వచ్చేసరికి లక్ష్మివేషధారణలో రంగస్థలంలోకి అడుగుపెట్టి, అందరూ ఆశ్చర్యపడేలా, యీమె లక్ష్మియా ఏమిటి అన్న భ్రాంతి గొల్పేలా అభినయించసాగింది.

అప్పుడు వారుణివేషము వేసుకొన్న మేనక అభినయిస్తూ వచ్చి లక్ష్మిపాత్ర ధరించిన ఊర్వశి నుద్దేశించి.-

"చెలీ! ఇక్కడ సమస్తభువనాలను ఏలే మహామహు

లెందరో విచ్చేసివున్నారు. వీరిలో శ్రీ మహావిష్ణువుకూడా వున్నాడు. వీరందరూ తమ యిష్టమొచ్చినరీతిగా సమస్త ప్రపంచాన్ని పరిపాలించగల సమర్థులు. వీరిలో నువ్వు ఎవరిని వరింతువో తెల్పు'' మన్నది.

పురూరవునిపై పూర్తిగా మరులుగొన్న ఊర్వశి ఆ సమయంలో తన్నుతాను మరచిపోయింది. తను రంగస్థలంపై వున్నా ననే భావనే అప్పుడామెలో వుదయించలేదు. అందుకే 'పురుషోత్తముని వరిస్తాను' అనేందుకు బదులుగా 'పురూరవుని వరిస్తాను' అందామె.

వెంటనే సభలో కలకలం బయలుదేరింది. నాట్యాచార్యుడు భరతుడు ఊర్వశి చేసిన తప్పిదానికి కుపితుడయ్యాడు.

''ఓసీ కామినీ! నే నెంతో శ్రమతో నీకు నేర్పిన విద్య నంతా ఒక్క మాటతో వృథాచేశావ్. నువ్వెవరినో మనసులో తలచుకొని నేర్పిన విద్య నంతా చెరిపివేశావు. అందుకు తగిన ఫలితం అనుభవించు. దేవతాస్త్రీవై వుండి ఒక మానవుణ్ని వరించినందుకు నీకు దివ్యత్వంపోవుగాక'' అంటూ ఆయన కోపంతో కఠినంగా ఊర్వశిని శపించాడు.

మహర్షి శాపాన్ని విని ఊర్వశి కంపించిపోయింది. కాని దయామయు డైన యింద్రుడు వెంటనే మహర్షి మాటకు అడ్డుపడి ఆమె కిచ్చిన శాపాన్ని మరోవిధంగా మళ్ళించాడు.

"నువ్వు ప్రేమించిన పురూరవుడు మానవుడే అయిన ప్పటికీ మహానుభావుడు. ఆయన నాకు అప్పుడుకూడాను. నా కెన్నోమార్లు రణరంగంలో తోడ్పడ్డాడు. కాబట్టి ఆయనను సంతోషపెట్టటంకూడా ఆవశ్యకమే! నీవు నీ యిచ్చవచ్చిన రీతిగా ఆయనవద్దకు వెళ్ళి సేవ చెయ్యి. మీ సంతానాన్ని ఆయన చూడనంతకాలం నువ్వాయనవద్ద వుండగలవు" అని యింద్రుడు ఆమె శాపాన్ని వరంగా మార్చాడు.

"మహాప్రసాదం," అంటూ ఊర్వశి ఆయనకు అభివాదం చేసింది.

నాటకప్రదర్శన ముగియగానే ఊర్వశి చిత్రలేఖతో పాటు తన నివాసం చేరుకుంది. అభిసారికవేషం ధరించి కొద్దిగా ఆభరణాలు పెట్టుకుంది. నల్లని ముసుగును ఒంటికి కప్పుకొని పురూరవుణ్ణి చేరుకునేందుకు తిరిగి చిత్రతోసహా ప్రతిష్ఠానగరానికి బయలుదేరింది.

# 8

చంద్రోదయం కాసాగింది.

మణిహర్మ్యంలో ఒక వుచితాసనంపై పురూరవుడు కూర్చున్నాడు. ఆయన మన స్సంతా ఊర్వశిపై నేలగ్నమై వుంది. ఆమె ఎప్పుడెప్పుడు వస్తుందా అని ఆయన ఆకాశం కేసి అదేపనిగా దీక్షతో చూడసాగాడు.

కాని, అప్పటికే ఊర్వశి చిత్రతోపాటు అక్కడికి వచ్చింది. అయితే ఆమె అంతర్ధానమైవుండటంవల్ల పురూరవుడు ఆమె రాకను గుర్తించలేకపోయాడు. ఊర్వశికూడా చప్పున బయటపడలేదు. మహారాజు తన చెంత నున్న విదూషకునితో ఏవిషయమై ముచ్చటిస్తాడో వినాలనే కుతూహలంతో ఆమె అలాగే నిల్చుండిపోయింది.

అదేసమయంలో పురూరవుడు విదూషకునితో—

"అబ్బ! ఈ రాత్రి ఎట్లా క్రమక్రమంగా గడిచి పోతోందో అలాగే నా హృదయతాపంకూడా పెరుగుతోంది" అన్నాడు.

"అదేమిటి! హాయిగా, చల్లని వెన్నెల కురుస్తోంటే తాప మంటున్నావ్?" అన్నాడు నవ్వుతూ విదూషకుడు.

"అయ్యో! నా తాపం యీ వెన్నెలతో తీరేది అయితే బాగుండేది. కాని, యీ తాపం అలాంటిదికాదు. ఊర్వశీ ముఖచంద్రుని వెన్నెలతో తప్ప యీ తాపం చల్లారదు" అని నిట్టూర్చాడు పురూరవుడు.

అదంతా వింటున్న ఊర్వశి తనలో తాను మహా దానందభరితురా లైంది. అంతలో అక్కడికి మహారాణి ఔసీనరి వచ్చింది. ఆమె వ్రతనిష్ఠతో చిక్కి వుంది. అప్పు డామె దాసీలతో వ్రతానికి కావలసిన పూజాద్రవ్యాల నన్నింటినీ వెంటతీసుకుని వచ్చింది.

"ప్రాణేశ్వరా! ఈ వ్రతాన్ని మీ యెదుటనే నేను నెరవేర్చాలి. అందుకై నాకుగా మీరు కొంచెంసేపు శ్రమ తీసుకోవాలి" అంటూ ఆమె పురూరవునికి నమస్కరించింది.

లోగడ పురూరవుడు ఊర్వశియందు మనసుపడినా డనే కోపంతో ప్రమదావనంలో ఆయనను తిరస్కరించి వెళ్ళినమహారాణి యిప్పుడు పూర్తిగా శాంతచిత్త అయ్యింది. మహారాజు ఆశించింది లభ్యం కావటంకన్నా తనకు మరో సుఖం అక్కర్లేదు అనుకుం దామె. అందుకే తిరిగి ప్రభువును ప్రసన్నచిత్తుణ్ణి చేసుకునేందుకు 'ప్రియానుప్రసాద' మను నోము చేసేందుకు చంద్రుడు రోహిణీ నక్షత్రంతో చేరివున్న ప్పుడు మణిహర్మ్యంమీదికి మహారాజును రమ్మని కోరుకుంది. ఆయనకూడా ఔసీనరిపై గాఢానురాగబద్ధుడు కావటం మూలాన మారుమాట చెప్పకుండా వచ్చాడు.

"దేవీ! ఎందుకీ వ్రతాలు, తపాలు?" అన్నా డాయన సౌమ్యంగా ఆమెతో.

అందు కామె సిగ్గుపడి తల వంచుకుంది.

"ప్రియా! ఈ వ్రతం మీ కోసమే. దేవతాదంపతులు

రోహిణీచంద్రుల సాక్షిగా చెబుతున్నాను. మీరు ఏ స్త్రీని ప్రేమించినా సరే ఆమె మీకు భార్య కాగోరినప్పటికీ- నే నామెను ఆదరిస్తాను అని శపథం చేస్తున్నాను'' అందామె.

ఆ మాటల నాలకించి ఊర్వశి చాలా సంతోషపడింది.

''దేవీ! నన్ను నువ్వు ఎవరికైనా దానం యివ్వవచ్చు. లేక నీ భృత్యుణ్ణి చేసుకోవచ్చు. కాని, నేను నీకు దూర మవుతున్నాననే తలంపుతో యీ విధంగా చెయ్యటం మంచిదికాదు సుమా!'' అన్నాడు పురూరవుడు దేవేరితో.

అందుకు ఔసీనరి నవ్వి --

''ప్రభూ! ఏది ఏమైనా నా వ్రతం ఫలించింది. సెలవిప్పించండి.''

అని క్షణమైనా జాగు సెయ్యకుండా ఆమె అక్కడి నుండి సపరివారంగా వెళ్ళిపోయింది.

ఆమెనిష్క్రమించగానే పురూరవుడువిదూషకునితో-

''దేవి యీపాటికిచాలాదూరం వెళ్ళివుంటుందికదా'' అన్నాడు.

''ఆఁ! ఆఁ! వెళ్లేవుంటుంది. ఇహ నీకొచ్చిన భయ మేమీ లేదు. నిశ్చితంగా వుండు.''

''నా కేమి నిశ్చింత! దేవి వదిలి వెళ్ళిందే కాని ఊర్వశి యింకా రాలేదుకదా! ఇప్పుడా దేవసుందరి వచ్చి మృదువుగా నా కళ్ళు మూస్తే ఎంత హాయిగా వుంటుంది'' అంటూ ఆయన కళ్ళు మూసుకున్నాడు.

ఆయన మాటల నన్నింటినీ వింటున్న ఊర్వశి అదే మంచి అదనుగా భావించి- వెంటనే ఆయన సరసకొచ్చి వెనక పాటుగా కళ్ళు మూసింది.

పురూరవుని కోరిక ప్రత్యక్షంగా ఫలించటం చూచిన విదూషకుడు సంతోషంతో—

"మిత్రమా! పేరు చెప్పుకో మరి" అని నవ్వాడు.

"ఈమె నా ఊర్వశియే" అని పురూరవుడు బదులు పలికాడు.

అప్పుడు ఊర్వశి వయ్యారంగా వచ్చి అతని ప్రక్క కూర్చుంది.

"చెలీ, చిత్రా! మహారాణి ఔశీనరి మహారాజును నాకు దాన మిచ్చింది. అందుకే యింత స్వాతంత్రంగా యీయన సరసన కూర్చున్నాను" అందామె నవ్వుతూ.

"మీ పరిహాసాలు తీరిగ్గా చేసుకు నేందుకు గాని, యిహ నేను వెళ్లొస్తాను, మహారాజా! మాట తప్పకుండా మా చెలి నిన్ను చేరింది. ఇహ ఈమెను ఏ విధంగా మురిపిస్తావో, నీదే భారం. ఇహ నాకు సెలవా?" అని నెమ్మదిగా చిత్రలేఖ అక్కడి నుండి వెళ్ళిపోయింది.

అదే సమయంలో విదూషకుడుకూడా తనకు భోజనపు వేళ అతిక్రమిస్తోం దని సాకు చెప్పి అక్కడి నుండి నిష్క్రమించాడు.

చిత్రలేఖ, విదూషకుడు అక్కడి నుండి వెళ్ళిపోవటంతో పురూరవుడు, ఊర్వశి మాత్రమే ఏకాంతంగా వుండి పోయారు. ఆ చల్లని వెన్నెల్లో పురూరవుడు ఊర్వశిని నెమ్మదిగా తన కౌగిట చేర్చుకొని అక్కడి నుండి ప్రమదావనంలోని ఒక పూపొదరింటిలోకి తీసుకవచ్చాడు.

అక్కడ చాలాసేపు మౌనంగా గడిచిపోయింది కాలం. ఇహ ఆనిశ్శబ్దాన్ని పురూరవుడు భరించలేకపోయాడు.

''ఊర్వశీ!'' అంటూ మోహంతో ఆమె కళ్ళల్లోకి చూశాడు.

''ప్రభూ!'' అని ఆమె అతన్ని కావులించుకుంది.

''మనిద్దరం ఏకాంతంగా కలుసుకునే యీ శుభ సన్నివేశంకోసం ఎన్నెన్ని కలలు కన్నానని'' అన్నాడు పురూరవుడు.

''నేనూ అంతే ప్రభూ!''

''ఆ నాడు నిన్ను చూసింది మొదలు ధర్మాసనంమీద వున్నా, అంతఃపురంలో వున్నా, ఎక్కడున్నా నీ రూపమే నా ఎదుట నిలిచి, నన్ను నన్నుగాకుండా చేసేది. ఏ యే రూపాల్లో ఎన్నెన్ని యుగాలు నీ కోసం తపస్సు చేశానో కాని, యీ నాటికి నువ్వు నా దానవయ్యావు. ఇహ నన్ను విడిచిపోకు. నిన్ను విడిచి రెప్పపాటుకాలమైనా బ్రతకలేను-''

అంటూ పురూరవుడు ఆమెను గాఢంగా తన హృద

యూనికేసి హత్తుకున్నాడు. ఆయన గాఢాలింగనంలో ఆమె తన యవ్వన సంపదనంతా ధారపోసింది.

"ఊర్వశీ! ఈ రేయి ఎంత మనోహరంగా వుంది. ఇంత చల్లని రాత్రిలో నిన్ను పొందిన నా అదృష్టం చాలా గొప్పది" అన్నాడు పురూరవుడు ఆమె కురులను సవరిస్తూ.

"ప్రభూ!" అందామె మోహావేశంతో.

"అవును ప్రియా! ఈ రేయి నువ్వెంత దివ్యంగా మెరిసిపోతున్నావ్. నీ సౌందర్య ప్రతిభ వల్లనే యీ వనంలో వెన్నెల కురుస్తున్నట్లుంది. నువ్వు నా దగ్గరికి నడిచి వస్తున్నప్పుడు, ఎవ్వరో నాలో వీణ మీటినట్లయింది. నీ నడకను, నీ హొయలును ఏమని వర్ణించను? నీ కనుల్లో ఎక్కడివన్ని దివ్యకాంతులు? నీ పెదవులకు ఎక్కడిదా గొప్ప అరుణవర్ణం? నీ ప్రతి కదలికకు, చూపుకు ఏ విధమైన ఉపమానాలు చెప్పను? ఊర్వశి నా ప్రేయసి అని యీ లతలకు, విరియ కాసిన సౌరభాలకు చెప్పుకోనా? ఈ వసంతఋతువులో ఆ కోయిల జంట ఎంత మధురంగా పాడుతూందో చూడు. కాని, ఆ కోయిలకూడా నిన్నే మాటిమాటికి చూస్తుందేమిటి? ఈ లతలు, పువ్వులు అన్నీ నిన్నే వరించినట్లున్నాయి."

"ప్రభూ! నన్నంత గొప్పగా ఆరాధించకు. నీ ప్రేమను భరించగల స్తోమతు నా కుందా?"

"అలా అనకు ఊర్వశీ! నీకన్నా నేను గొప్ప అదృష్టవంతుణ్ణి. అందుకే నీ పొందు లభ్యమైంది. ఇప్పుడిప్పుడే

నా కర్థ మాతోంది, నే నీజన్మ ఎత్తిన దెందుకో. నీకోసమే, నీ కోసమే, నే నీ జన్మ ఎత్తాను ఊర్వశీ!'' అంటూ తిరిగి పురూరవుడు ఆమెను కావులించుకున్నాడు.

అప్పు డామె నవ్వుతూ మోహంతో ఆయనను క్రీగంట చూస్తూ తన మెడలోని హారాన్ని ఆయన మెడలో వెయ్యబోయింది.

"ప్రియా! ఏమి టది? నీ కుంద్రని వక్షోజాలపై మెరుస్తున్న యీ చంద్రహారాన్ని నా మెడలో వేస్తున్నావ్?'' అన్నాడు పురూరవుడు.

"ప్రభూ! నా కోర్కె మన్నించండి. నా ప్రేమ కానుకను మీరు తప్పక స్వీకరించాలి. అవునుగాని, రాజా! నాపై మీ కెందు కింత మోహాధిక్యత?''

"మాటలతో చెప్పలేను దేవీ! ఆ భ్రమరాన్ని సారభాలపై నీ కెందు కంత మక్కువ అని అడిగితే ఏం చెబుతుంది? ఆ కోయిలమ్మను కోయిలపై ఎందు కా అనురాగమని ప్రశ్నిస్తే ఏమని పలుకుతుంది? ప్రియా! నీ రూపాన్ని చూసి సిగ్గుపడి చంద్రకిరణాలుకూడా నిన్ను తాక లేక పారిపోతున్నాయి. ఆ ఆడలేడి నిన్ను సమీపించేందుకే బిడియపడుతోంది చూడు. జంతుజాలంలోని యవ్వనసంపదను కూడా కదిల్చివెయ్యగల నీ జగదేకసౌందరాన్ని నాకోసమనా సృష్టింపచేశాడా నారాయణఋషి!''

"రాజా! మాటలతో నీతో పోటిపడి గెలువలేను.

పదండి, ఆ కొలనులో కాస్సేపు క్రీడిద్దాము''

అని ఊర్వశి పురూరవుణ్ణి తనవెంట కొలనుదాకా నడిపించుకొచ్చింది. ఇద్దరూ ఇష్టానుసారం ఆ కొలనులో దిగి జలకమాడసాగారు.

''ప్రియా! ఈ నీళ్ళల్లో నిన్ను నా హృదయానికి పెనవేసుకొని, నీ గుండ్రని వక్షోజాలు నా గుండెల్ని తాకి చలిస్తూంటే, నీ పెదవులపై పెదవులుంచి, నీ కనురెప్పలపై ముద్దులిడుతూ, నేనే నువ్వుగా, నువ్వే నేనుగా తన్మయుడనయ్యాను'' అన్నాడు పురూరవుడు ఆమెను మరింత దగ్గరగా తన హృదయానికి హత్తుకుంటూ.

''నేనూ అంతే ప్రభూ!'' అంది ఊర్వశి లజ్జావతియై.

''ఊర్వశీ! నువ్వెంత గొప్ప రసికురాలివి. నీ పొందులో నేను నేర్చుకున్న యీ విద్య అనంతమైనది. నీ అధరామృతాన్ని గ్రోలేందుకు నాకున్న ఈ రెండు పెదవులూ, కాముకత్వంతో మరింత గొప్ప సౌందర్యాన్ని చేకూర్చుకున్న నిన్ను చూసేందుకు నాకున్న యీ రెండుకళ్ళూ, రతిక్రీడలో నువ్వు చెప్పే రహస్యాలను వినేందుకు యీ రెండు చెవులూ చాలటంలేదు. ప్రియా! ఎట్లా భరింతు నింత గొప్ప అనుభూతిని!''

''ప్రియా! మాటలలోపడి నిన్ను నువ్వు మరచిపోతున్నావ్. పద వెళదాం, పూపొదరింటిలో కాస్సేపు విశ్రమిద్దాం'' అంది ఊర్వశి ఆయన భావోద్వేగాన్ని అప్పటికి మరోదారికి మళ్ళిస్తూ.

తెల్లవారింది.

పురూరవుడు ఊర్వశి తొడపై తల బెట్టి ఇంకా గాఢ నిద్రలో మునిగివున్నాడు. ఊర్వశి తదేకంగా ఆయనను చూస్తూ ముసిముసినవ్వులు నవ్వుకోసాగింది.

చాలా సేపటికి ఆయన నిద్రనుండి మేల్కొన్నాడు. ఆమె తలను తన దగ్గరకు తీసుకొని మోహంతో ముద్దు బెట్టుకున్నాడు.

"రాజా! ఎందుకంత గాఢంగా నిద్రపోయావ్?" అనడిగింది ఊర్వశి.

"అవును, గాఢంగానే నిద్రపోయాను. కాలాన్ని వ్యర్థం చేసుకున్నాను. కాని, రాత్రి నేను బాగా అలసిపోయిన ట్లున్నాను, ఊర్వశీ!"

"అలుపా! దేనికి?"

"నీతో... నీతో..."

"బిడియపడతావేం?"

"నీతో ఎంత స్వేచ్ఛాగా మాట్లాడుతున్నా, నాలో మానవసహజమైన లజ్జ యింకా నశించలేదు."

"రాత్రికీ యిప్పటికీ నీ రూపంలో గొప్పమార్పు వచ్చింది. ఎంత మనోహరంగా కన్పిస్తున్నావ్, రాజా!"

"నీ పొందు చెందిన ఫలితమే.."

"నువ్వు గాఢనిద్రలో మునుగకముందు నాకిచ్చిన సుఖం అనిర్వచనీయం. మళ్ళీ ఒకసారి..."

"ఇప్పుడా?"

"ఔను. ఏం?"

"ఈ సూర్యోదయసమయానా!"

"ఆఁ!"

"కూడదు."

"దేనికి?"

"ఎవరైనా వస్తారు."

"ఎక్కడికి?"

"యీ వనానికే."

"వస్తే నేం?"

"చూస్తారు."

"దేన్ని?"

"మన... మన..."

"అయితే?"

"అసూయపడతారు."

"ఎందుకో?"

"ఇంత గొప్ప సౌందర్యవతిని పురూరవుడు ఒక్కడే అనుభవిస్తున్నాడే నని"

"నీకు గర్వంకాదా?"

"అయినా వాళ్ళలా చూడకూడదు. నీకింకా మానుషత్వం అర్థం కాలేదు."

"ఏం మనుష్యులు! అందాన్ని అనుభవించే వాడిని చూసి ఆనందించలేని అభాగ్యులు."

"మానవత్వం అంతే! సహృదయతకి వీళ్ళు చాలా

దూరంగా వుంటారు. ఓర్పను ఏకోశానా వుండనివ్వరు. ఈర్ష్యా ద్వేషాలకు చాలా దగ్గరివాళ్ళు. అన్నీ కావాలనుకుంటారు. ప్రతిదీ స్వంత అనుభవానికి రావాలంటారు. నిన్నీ సమయంలో నేను... నేను... అనుభవిస్తూంటే చూసి విమర్శిస్తారు.''

''ఎందుకో?''

''వేళ కాని వేళలో పురూరవుడు ఊర్వశితో...''

''ఆగిపోయావేం?''

''రతిక్రీడలో మునిగి తేలియాడుతున్నాడని గుస గుసలు చెప్పుకుంటారు.''

''తప్పా?''

''కాదనుకో! మానవ మేధస్సు ఎంతటి గొప్ప గొప్ప విషయాలను సాధించినా, యింకా తమని తాము అర్థం చేసుకోలేదు. ఈ మానవజాతి రతిక్రీడ కొక నియమాన్ని పెట్టుకుంది. చీకట్లో తప్ప రమించేందుకు వీళ్ళు సంకోచిస్తారు; భయపడతారు. ఎందుకని కారణమడగకు, వీళ్ళు యింకా ఎదగలేదు.''

''పోనీ, యీ మానవుల గొడవతో మనకేమి? నువ్వు కాలకృత్యాలు తీర్చుకో, నేనీ లోగా స్నానంచేసి వస్తాను''

''నియమాలు తప్పరాదు''

''నీ మాటకు తిరుగులేదు'' అన్నదామె నవ్వుతూ.

ఆ విధంగా పురూరవుడు పూర్తిగా ఊర్వశికి అంకితమైపోయాడు. ఆమె ధ్యాసలో ఆయన సమస్తప్రపంచాన్ని బంధువులను, రాజాన్ని, మంత్రులనూ, చివరికి తన్నుతాను మరచిపోయాడు.

# 11

అర్ధరాత్రయింది.

పూర్ణిమ చంద్రుడు తన దివ్యకాంతులతో వెలిగి పోతు న్నాడు. ప్రమదావనంలోని ఒక కొలను గట్టున ఊర్వశి కూర్చున్నది. ఆమె ప్రక్కనే పురూరవుడు ఆసీనుడై, కొలను లోని చిన్నచిన్న అలలను చూస్తూ నిశ్శబ్దంగా వుండి పోయాడు.

చాలాసేపు యిద్దరూ ఏమీ మాట్లాడుకోలేదు. ఊర్వశి కొలనులోకి కాళ్ళను చాపి ఆడుకుంటోంది. పురూరవుడు ఆమె పాదాల చుట్టూ మూగుతున్న చిన్న చిన్న చేపల్ని చూసూ మురిసిపోసాగాడు.

ఆ విధంగా గంట గడిచింది.

ఊర్వశి వున్నట్లుండి అక్కడినుండి లేచింది. పురూ రవుడు ఆమెవైపు వింతగా చూశాడు.

"ఎక్కడికి?" అనడిగాడు.

"ఎక్కడికో వెళ్ళాలని వుంది..."

"సరిగ్గా చెప్పు-"

"చెప్పలేను. ఏదో చెయ్యాలని మనస్సు తొందర పడుతోంది. ఎక్కడికో వెళ్లాలని నా ఎదలో ఆరాటం! ఎక్కడి కెళ్ళాలో ఏం చెయ్యాలో మాత్రం స్పష్టంగా తెలియటం లేదు....

"నందనవనంలో తిరిగే నీకు యిక్కడివన్నీ విసుగు

కల్గిస్తున్నాయేమో!''

''కాదు. మరింత వుత్సుకత రేకెత్తిస్తున్నాయి. అన్నీ అనుభవించాననుకున్న నాకు యీ పరిసరాలు బిడియ పడేలా చేస్తున్నాయి!''

''ఇక్కడ నువ్వేం చూశావ్?''

''శృంగారానుభూతితో ప్రతి అణువులోనూ సౌంద ర్యాన్ని చూశాను. నిజమైన వీటి సౌందర్యంముందు యీ ఊర్వశికి సౌందర్యం లేదు.''

''ఇక్కడ నువ్వు చూసింది చాలా స్వల్పం. ఇంత కన్నా గొప్ప రసానుభూతిని ప్రసాదించే ప్రదేశ మొకటుంది.''

''ఎక్కడ?''

''గంధమాదనపర్వతం. మన భోగానుభవానికి అన్ని విధాలా అనుకూలంగా వుంటుంది''

''అలాంటి ప్రదేశాన్నే మనం చేరుకోవాలి.''

''ఎప్పుడు?''

''ఈ క్షణంలోనే!''

''అదెలా సాధ్యమవుతుంది?''

''ఏం?''

''ఈ రాజ్యాన్ని, ప్రజలను, అందరినీ వదలి ఎలా రాను?''

''నా కోసం-''

"అవును. నీకోసం ఏమైనా చెయ్యగలను. కాని - కాని నన్నే నమ్ముకున్న వీళ్లందర్నీ వదలి.. "

"నేను పూర్తిగా నిన్నే నమ్ముకున్నాను. వాళ్ళ కన్నా మరింతగా నేను విలపిస్తాను. నాతోపాటు నువ్వు అక్కడికి రాకపోతే..."

"నేను నీతోపాటు వస్తే యీ రాజ్యం ఏమైపోతుందో!"

"ఏమీ కాదు. నువ్వు పాలకుడివి. వాళ్ళు పాలితులు. నువ్వు లేకపోతే వాళ్ళు మరొక ఏలికను చూసుకుంటారు. కాని, మనమిద్దరం రసికరాజ్య పాలకులం. ఇద్దరిలో ఏ ఒక్కరం లేకపోయినా. "

"అవును, నువ్వన్నదీ నిజమే. నేను లేకపోయినా యీ సామ్రాజ్యాన్ని నా బంధువులు, మంత్రులు పాలించగలరు. నువ్వు లేకపోతే నేను బ్రతికలేను. నీకోసం ఏమైనా కాగలను. నీ యిష్టమే కానివ్వు. ఉదయమే మనం వెళ్ళిపోదాం యిక్కడ్నుంచి-" అంటూ పురూరవుడు ఆమెను బిగియార కౌగలించుకొని చెక్కిళ్ళపై ముద్దులవర్షం కురిపించాడు.

ఆ మరునటి దినమే ఆయన ఊర్వశితోపాటు కైలాస శిఖరం ప్రక్కనున్న గంధమాదన పర్వతానికి వెళ్ళి, అక్కడి రమణీయమైన అడవుల్లో వనాల్లో యిచ్ఛాస్వేచ్ఛగా ఆ దేవసుందరితో క్రీడించసాగాడు.

